# చతుర

సంపుటి : 6 మార్చి 1983 సంచిక : 2

## ఈ నెల సమగ్ర నవల

సకల కళారూపాల సమన్వయవేదిక సినిమా. నటీనటులు, గాయకులు, చిత్రకారులు, రచయితలు, దర్శకులు, సాంకేతిక నిపుణుల ప్రతిభా పాటవాల సమ్మేళన ఫలమే లక్షలాది ప్రేక్షకులను రంజింపజేస్తున్న విజ్ఞానమైనా, వినోదమైనా.

అలాంటి సృజనాత్మక కళారంగంలో పరాన్నభుక్కులు చేరి అమాయక కళాకారులను ఆర్థిక ప్రలోభాలతో బానిసల్ని చేసుకోవాలని చూస్తే ఫలితాలెలా ఉంటాయి? తనకు ఆధారాన్నిచ్చిన చెట్టుకే చేటు తెచ్చేలా ఎదిగిపోయే....

# బదనిక

లా కళారంగాన్ని ఆశ్రయించి, ఆక్రమించుకోజూచే స్వార్థపరుల నీడలో కళాకారుల జీవితాలెలా కృశిస్తాయి? కాలం కలిసిరాక తమ మాయోపాయాలు తనకే శాపంగా పరిణమిస్తే భవిష్యత్ ఏమిటి?

## టి. రత్నాదిత్య

సినీ మాయామేయ జగత్తులోని తెరవెనుక కుళ్ళును కరుణామయంగా చిత్రించిన 'బదనిక' ఈ నెల 'చతుర' సమగ్ర నవల. కళారంగాన్ని కృంగదీస్తున్న కాసుల అధిపత్యానికి దర్పణం 'బదనిక'.

# చతుర

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ – 500 004.

# రచయితలకు ఆహ్వానం

**ఇతివృత్తంలో, రచనా సంవిధానంలో నూతనత్వం చూపగల రచయితలకు 'చతుర'లో నెల నెలా నవలల పోటీయే! ప్రచురించే ప్రతి నవలకూ రు. 1500, అత్యుత్తమ నవలకు రు. 2000 పారితోషికంగా అందజేసే నవనవలా వేదిక 'చతుర'.**

* నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 – 112 పేజీల నవలానుబంధాలలో ప్రచురితమవుతూన్న నవలికలు 'చతుర'లో అచ్చులో 60 - 70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.
* పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడతాయి.
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసి వచ్చే పక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపించగలరు.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రా గానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.

ముఖచిత్రం : దిలీప్ బెనర్జీ

రెండవ కవరు : బ్రహ్మదేవ్

మూడవ కవరు . ఇ. రాజ్యలక్ష్మి



# చతుర ప్రపంచం

## దోసెల ఘనత

దోసెలంటే అందులోనూ మసాలా దోసె లంటే నోరూరనిది ఎవరికి? అలాంటిది కర్నాటకలో ఏకంగా దోసెల పేర ఊరే వుందని వింటే "ఆహా ఆఊళ్ళో ఉద్యోగం దొరికితే ఎంత హాయి" అన్పిస్తుంది కదూ? పేరు చూసి అక్కడి వీధులు, పొలాలనిండా దోసెలే వుంటాయనుకోకండి. ఆ ప్రాంతానికి ఆ పేరు రావడానికి ఓ కథ వుంది.

మన దేశం పరాయి పాలనలో వున్నపుడు అడవుల్లో వేటాడటానికని బ్రిటిష్‌వారు కొంతమందిని నియమించేవారు. అలా 1940లో ఓ బ్రిటిష్ జాతీయుడు బెల్గాం జిల్లాలో నియమించబడ్డాడు. అతగాడోసారి ఉత్సాహంగా తుపాకీ భుజానేసుకొని వేటకి బయల్దేరితే కనీసం పిచ్చుక పిల్లయినా దొరకలేదు. పైగా వేట సరదాలో తిరుగుతూ అడవిలో దారితప్పిపోయాడు. దాహం వేసి నీళ్ళ కోసం వెతుకుతోంటే ఓ గుడిసె కన్పించిందతనికి. అందులో ఓ యువదంపతులు నివశిస్తున్నారు. తుపాకీ పట్టుకున్న అతన్ని చూసి వాళ్లు భయపడిపోయారు. అయితే అతను దారి తప్పిన సంగతి చెప్పాక కాస్త కుదుటపడి చల్లని మజ్జిగ తెచ్చిచ్చారు. దాహం తీరిన ఆ వేటగాడు వాళ్ళకి కృతజ్ఞత చెప్పి బయల్దేరబోతుంటే ఆ దంపతులు ఏదైనా తిని వెళ్ళమని బలవంతం చేశారు. వారి ఆతిథ్యాన్ని కాదనలేక సరేనన్నాడు కానీ వీలయినంత తొందరగా వంట అయిపోవాలన్నాడు.

అందుకని ఆగృహిణి అన్నం, చపాతీలు చేస్తే ఆలస్యం అవుతుందని పిండి కలిపి వేడి వేడిగా నేతితో దోసెలు వేసిచ్చింది. ఆంగ్లేయ వేటగాడు అంతకు ముందెప్పుడూ దోసెల రుచి చూళ్ళేదు. పైగా ఆ దోసెల మీద గుండ్రటి రంధ్రాలు చూసి మరింత ఆశ్చర్యపోయాడు. కుతూ





హలం ఆపుకోలేక దోశల మీద అంత కళాత్మకంగా ఒకే పరిమాణంలో వున్న గుండ్రని రంధ్రాలు ఎలా చేశారని వాకబు చేసి ఆ విషయం తన డైరీలో కూడా రాసుకున్నాడు. వాళ్ళ అట్లదసు తీసుకొని కృతజ్ఞతలు తెలిజేసి వెళ్ళిపోయాడతను.

ఓ నెల తర్వాత ఆ దంపతులకు ఒక ఉత్తరం వచ్చింది. నిరక్షరాశ్యులయిన వారు ఉత్తరాన్ని చూడగానే భయపడి పోయారు. గ్రామాధికారి అది చదివి విషయం చెప్పాక వారి సంతోషానికి అంతులేకపోయింది. ఆ బ్రిటిష్ అధికారి వారుకళాత్మకంగా తయారుచేసినదోసెలకు గాను నాలుగు ఎకరాల ప్రభుత్వభూమిని ఇస్తున్నట్లుగా రాశాడు.

ఆ దంపతులకు ఇవ్వబడిన నాలుగు ఎకరాల భూమి బెల్గాంలోని బిలహోంగల్ తాలూకాలో మల్లపూర్ గ్రామందగ్గిర వుంది. బెల్గాం జిల్లాని ఇప్పటికీ దోసా హోలా అంటే దోసె ప్రాంతం అని పిలుస్తారు. అదీ సంగతి.

# మోడల్ జర్నలిస్టులు

మార్కెట్లోకి వచ్చిన ఏ చిన్న వస్తువైనా విరివిగా అమ్ముడుపోవాలంటే విస్తృత ప్రచారం అవసరం. ఇదివరకటికంటే ఇపుడు ఎడ్వర్టయిజ్ మెంట్ పద్ధతుల్లో చాలా మౌలికమైన మార్పులు వచ్చాయి. ప్రజలు కూడా 'ఫలానా ఎడ్వర్టయిజ్ మెంట్ చూశావా? చాలా బావుంది!' అని ఎడ్వర్టయిజ్ మెంట్ టెక్నిక్ ని మెచ్చుకునే స్థాయికి ఎదిగారు. దాంతో చక్కని పరిచయ వాక్యాలతో సాధ్యమైనంతగా ప్రజలకు దగ్గరవాలని ఎడ్వర్టయిజ్ మెంట్ రంగంలో ఉత్పత్తిదారులు పోటీపడుతున్నారు. ఉదాహరణకు ఓ



చీరల ప్రకటన తీసుకుంటే 'స్త్రీ మనోభావాలకు అందమైన భాషలు ఎన్నెన్నో! అందులో మా కంపెనీ ఒకటి' అని ఒకరంటే 'స్త్రీ జీవితంలో ఎంతో అందమైన క్షణాలలో ఒక భాగం మా చీరలు' అని ఇంకొకరు.

ఇదివరకు ఇటువంటి వాటికి మోడలింగ్ చేసేందుకు ప్రత్యేకించి కొందరుండేవారు. అలాంటివారేగాక సినిమా తారలు, క్రీడాకారులు కూడా రకరకాల ఎడ్వర్టయిజ్‌మెంట్లలో కనబడ్డం పాఠకులకీ, ప్రేక్షకులకీ విదితమే. కానీ పత్రికా సంపాదకులు, పాత్రికేయులు కూడా మోడలింగ్ వైపు మొగ్గు చూపడం విశేషం.

తన రచనలతో, సంపాదకీయాలతో అశేష పాఠకుల్ని ఆకట్టుకున్న బ్లిడ్జ పత్రికా సంపాదకుడు ఆర్. కె. కరాంజియా విమల్ సూటింగుల ఎడ్వర్టయిజ్‌మెంట్లకు మోడల్ అయ్యారు. జంటిల్‌మన్స్ ఫ్యాషన్ క్వార్టర్లీలో భారతదేశంలో బెస్ట్ డ్రెస్ వేసుకునే పది మందిలో ఒకరుగా ఆర్. కె. కరాంజియా ఎన్నికయ్యారు. మిగతావారిలో ఒకనాటి మేటి క్రికెట్ ఆటగాడు నవాబ్ ఆఫ్ పటౌడి, మాధవరావు సింధియా కూడా ఉన్నారు. వీళ్ళిద్దరూ డిగ్‌జమ్ సూటింగ్ ఎడ్వర్టయిజ్‌మెంట్లలో వున్నారు.

ఆర్నెల్లు సావాసం చేస్తే వారు వీరౌతారన్నట్లు ప్రఖ్యాత మోడల్ అనితా రెడ్డి ఓ శుభ ముహూర్తం చూసుకుని ఢంగున జర్నలిజంలోకి దూకింది. ఓ స్త్రీల పక్షపత్రికకు రాయడం కూడా ప్రారంభించింది. అలాగే అంతకు ముందు కొన్నాళ్ళు మోడలింగ్ చేసిన శోభాకిశా చంద్, మనేకాగాంధి వేర్వేరు పత్రికలకు సంపాదకత్వం వహించి నేర్పరులనిపించుకున్నారు. వృత్తి, ప్రవృత్తులు వేర్వేరయితేనేం రాణింపు, గణింపువున్నప్పుడు. సో....పడిఎడమైతే పొరబాటు లేదంటే లేదోయ్!






# నకిలీ

ఇది ప్రకటనల యుగం అనీ, భారీ ఎత్తున ప్రచారంతో హోరెత్తించనిదే వస్తువులు పెద్దగా అమ్ముడుపోవని అందరూ అంగీకరిస్తారు. అయితే కొన్ని కంపెనీలు తమ అమ్మకాల కోసం గాక తమ ఉత్పత్తులకు వస్తున్న నకిలీల గురించి హెచ్చరిస్తూ ప్రకటనలిచ్చుకొంటున్నాయి. పేరున్న కంపెనీలకు ఇదో తలనొప్పి వ్యవహారంగా వుంటే నకిలీ వస్తువుల ఉత్పత్తిదారుల పని మాత్రం బూర్లె గంపలో పడ్డట్టుగావుంది. ప్రస్తుతం దాదాపు అన్ని ఉత్పత్తులకీ నకిలీ ఉత్పత్తులు తయారై బాహాటంగానే అమ్ముడవుతున్నాయి.

ఢిల్లీ సమీపంలో గల ఫరీదాబాద్‌లోని ఓ బట్టల మిల్లులో చీరలతోపాటు మగవారి బట్టలను కూడా ఉత్పత్తి చేసి వాటి మీద విమల్, మఫత్‌లాల్, బొంబేడయింగ్ కంపెనీల లేబుల్సను అతికిస్తున్నారని ఆదాయంపన్ను అధికారుల తణిఖీలో బయటపడింది ఈమధ్యే. అలాగే మద్రాస్‌లోని ఓ బోగస్ ఫ్యాక్టరీ ఫిలిప్స్‌కంపెనీ లేబుల్‌తో అలాంటి ఎలక్ట్రికల్ వస్తువులనే తయారుచేస్తోంది. ఇవి అచ్చం ఫిలిప్స్ ఉత్పత్తుల్లానే వుంటాయి. ఇలా గత 20 ఏళ్ల నుంచి జరుగుతున్నా ఈమధ్యనే బయటపడిందీ విషయం.

ఆయాబ్రాండ్ల నిజమైన ఉత్పత్తిదార్లు తమ అమ్మకాల ద్వారా ఒకలక్ష రూపాయలు సంపాదిస్తున్నచోట, నకిలీవస్తువుల ఉత్పత్తిదార్లు మూడు - నాలుగు లక్షల రూపాయలు సంపాదిస్తున్నారు. ఈ నకిలీ వస్తువుల లిస్ట్ అనంతం. వీటిలో బీడీల నుండి స్కూటర్ విడిభాగాల దాకా అన్నీ వున్నాయి.

ఒక్క కోడిగుడ్డు మాత్రమే కల్తీకి అతీతం అనుకొనే వాళ్ళింతవరకూ. ఇప్పుడు అవీ కల్తీకి గురవుతున్నాయి. ఫారమ్ కోళ్ళ గుడ్లకన్నా నాటుకోళ్ళ గుడ్లు ఎక్కువ బలవర్ధకమైనవన్న నమ్మకంవుండటాన గ్రామాల్లో ఇళ్ళపట్టున పెరిగే నాటుకోళ్ళ గుడ్లకి గిరాకీ ఎక్కువ. వాటి ధరా ఎక్కువే. ఫారమ్ కోడిగుడ్లు తెల్లగా, నాటు కోడిగుడ్లు కొంచెం లేత పొగాకు రంగులో వుంటాయి. అందుకని

ఫారమ్ కోడిగుడ్లను టీ డికాషన్‌లో ముంచి కొంచెం రంగు రాగానే వాటిని నాటు కోడిగుడ్లుగా చెప్పి అమ్ముకుంటు న్నారు.

## లైబ్రరీ

ప్రపంచంలోని వివిధదేశాల అక్షరాస్య తను ఆ దేశాలలోని గ్రంథాలయాలసంఖ్య, వాటి స్థితిగతులనుబట్టి నిర్ణయించవచ్చున డంలో పొరపాటేమీ లేదు. మనదేశంలో ఊరికొక గ్రంథాలయం సంగతి అటుంచి వున్న గ్రంథాలయాల గోడే పట్టించుకొనే నాథుడులేడు. ఇక ఆదర్శ గ్రంథాలయాలు సుందరస్వప్నం మాత్రమే.

అయితే స్వీడన్ రాజధాని స్టాక్‌హోమ్ లోని గ్రంథాలయం తీరుతెన్నులుచూస్తే మాత్రం ఎవరికయినా ముచ్చటేస్తుంది. స్టాక్‌హోమ్‌లోని ప్రజాగ్రంథాలయ నిర్వ హణ వ్యయం ఏడాదికి సుమారు 14కోట్ల రూపాయలు. ఈ వ్యయంలో 60శాతం గ్రంథాలయ సిబ్బంది జీతభత్యాలకింద, 16శాతం గ్రంథాలయ భవనం మీద ఖర్చుచేయబడుతోంది. ఇందులో 18లక్షల 82వేల పుస్తకాలు, ఒకలక్షా పదివేల ఆడియో–విజ్యువల్స్, 2వేల 4వందల స్లైడ్స్ వున్నాయి.

ఈ గ్రంథాలయ సిబ్బంది సంఖ్య 700వరకూ వుంది. వీరు ఏటా 1,49,148 పుస్తకాలను తెప్పించి పాఠకులకు పంపిణీ చేస్తుంటారు. ఈ గ్రంథాలయంలో అన్ని యూరోపియన్ భాషల సాహిత్యానికి సంబంధించేగాక థాయ్, చైనా సాహిత్యా నికి కూడా ఇండెక్స్‌వుంది. ప్రత్యేకంగా ఒక విభాగాన్ని సంగీతానికి కేటాయించి నాలుగు వేల గ్రామఫోన్ రికార్డులు, కేసెట్లను పోగుచేశారు.

ఈ గ్రంథాలయంలో రిఫరెన్స్‌లకు, పిల్లలకు, సంచారగ్రంథాలయానికి విడిగా శాఖలున్నాయి. కొన్ని పరిశ్రమలవారికి అక్కడికే తీసుకెళ్ళి మరీ పుస్తకాలివ్వ బడతాయి. ఆసుపత్రి గ్రంథాలయం దీని మరో ప్రత్యేకత. ఇది ఆసుపత్రులకు, ఇళ్ళలోని వృద్ధులకూ పుస్తకాలు ఇస్తుంటుంది. గత సంవత్సరం ఇలా అయిదులక్షల పుస్తకాలు అందించారట. ప్రస్తుతం అక్కడ మాట్లాడే పుస్తకాలు, కేసెట్లు రికార్డులకు గిరాకీ పెరిగింది. అంధులకు 64వేల బ్రెయిలీ పుస్తకా లను సరఫరా చేసింది.

1980లో ఈ గ్రంథాలయం 154 ప్రదర్శనలను ఏర్పాటుచేసింది. 177 వినోదకార్యక్రమాలు నిర్వహించింది. వీటిలో సినిమాలు, నాటకాలు, జానపద పాటలపోటీలు వగయిరా ఉన్నాయి. ఆదర్శగ్రంథాలయమన్న పేరు స్టాక్ హోమ్ గ్రంథాలయానికి అక్షరాలా సరి పోతుంది.






**ఇది హఠాత్తుగా తయారైనదేం కాదు కాని, మేధావులు మరియు మెషీనుల ద్వారా అత్యంత ఉత్కృష్టం చేయబడిన షేవింగ్ టెక్నాలజీ ఫలితమే ఇలాంటి రేజర్ బ్లేడ్ విల్ట్ఎడ్జ్.**

విల్ట్ఎడ్జ్.
విల్కిన్సన్ స్వోర్డ్ వారి టెక్నాలజీ ఫలితమే ఈ రేజర్ బ్లేడ్. ప్రపంచంలోని అత్యంత నిశితమైన బ్లేడ్ల వెనుకవున్న షేవింగ్ టెక్నాలజీ.

విల్ట్ఎడ్జ్.
దిగుమతి చేయబడిన ఉక్కుతో తయారై, యాంత్రిక సానరాయి మరియు తోలుపట్టీ మీద పదును పెట్టబడి గోథిక్ ఆర్చ్ ఆకారం పొందిన మొనతో కూడిన రేజర్ బ్లేడ్—ఈ గోథిక్ ఆర్చ్ మొన ఎన్నో సంవత్సరాల తీవ్ర సంశోధన ద్వారా ఉత్కృష్టం చేయబడి మరియు పి.టి.ఎఫ్.ఇ. పూత కల్గినది. షేవింగ్ టెక్నాలజీలో సంభవించిన మహత్వపూర్ణమైన ఏకైక ప్రగతి. మీకు మునుపెన్నడూ లభించని అతి సున్నిత, సురక్షితమైన మరియు చక్కటి షేవ్‌ను అందించడానికి, ఆహా షేవ్ తర్వాత షేవ్.. ఎన్నో మరెన్నో షేవ్‌లు.




నిజానికి ఎన్ని ఎక్కువ షేవ్‌లంటే దీనికోసం కాస్త ఎక్కువ పైకాన్ని ఖర్చు పెట్టడానికి మీరు ఏమాత్రం వెనుకాడరు.

విల్ట్ఎడ్జ్.
ఇది మీపై చెరగని ముద్రను వేసి పోతుంది—దీని నాణ్యత అసమానం, దీనితో లభించే షేవ్‌లు అధికం.

**విల్ట్ఎడ్జ్ : మరింత ఎక్కువ పొందాలని అభిలషించేవారి కోసం- ఎక్కువ షేవ్‌లు, ఎక్కువ సుఖం,ఎక్కువ సంతృప్తి.**



**Wiltech India Ltd.**

Rediffusion/WIL/1786h/TL

పుచ్చ పువ్వులాటి వెన్నెల. పచ్చని పైర గాలి. నాగరాజుకు ఆ గట్టు మీద నడు స్తోంటే మనసెంతో ఆహ్లాదంగా ఉంది. అడుగులో అడుగువేసుకొంటూ నడు స్తోంటే ఊరు వెనుకబడి పొలం దగ్గర పడుతోంది.

నాగరాజుకు ఎప్పుడూ పొలంపైకి దృష్టి పోదు. సాయంత్రం చిరు చీకట్లు చిమ్మే సమయానికి లైబ్రరీ నుంచి ఇంటికి చేరటం, వేడివేడి మెతుకులు నాలుగు నోట్లో వేసుకోవటం, ఆ తర్వాత పంచాయతీ ఆఫీసు అరుగుమీదకు చేరటం, అక్కడ చేరిన పదిమందితో ఊరు మాటుమణిగేదాకా అచ్చట్లు ముచ్చట్లు, ఆ అమ్మకబుర్లు, ఈ అయ్యకబుర్లు చెప్పు కోవటం-చివరకు ముక్కలు పంచుకొని జీవితంలో కాలాన్నీ, ధనాన్నీ వృధా పర్చటం అలవాటు. అలవాటు కాదేమో, జీవితం ఆ పద్ధతిలో సాగిపోతోంది.

మెట్రిక్ పాసయ్యాక ఏంచెయ్యాలి అని ప్రశ్న తలెత్తింది నాగరాజుకు ఏం చేయాలి? ఉద్యోగానికి పనికివచ్చే చదువు కాదు అది. ఇంకో మార్గం ఏదీ తోచక, పీయూసీకి అప్లికేషన్ పెట్టాడు. సీటు వస్తుందనుకొంటే రాలేదు.

జీవితం అక్కడే మలుపు తిరిగింది. అదుపు తప్పింది. ఇంటిదగ్గరే సమయం అంతా వృధాపర్చటం ఇష్టం లేక లైబ్రరీ ముందు తచ్చాడటం అలవాటు అయి, అక్కడినుంచి పంచాయతీ ఆఫీసు అరుగు మీదకు, చివరకు పేకముక్కల వద్దకూ చేరింది.

ఈరోజు ఆట రసవత్తరంగా సాగు తోంది. నాగరాజే నాలుగు ఆటలు వరు సగా గెల్చాడు. అయిదో ఆట ఆడు





తోంటే కరెంట్ పోయింది. అరగంట సేపు కరెంట్ కోసం వేచిచూసి అందరూ ఇక కుదరదని కొవ్వొత్తులతో మొదలు పెడదాం అన్నారు. నేను ఆడనంటూ నాగరాజు లేచాడు. మామూలుగా అయితే ఇలాంటపుడు ఒప్పుకోరు కానీ కరెంటు లేదన్న కారణంగా నాగరాజు నిష్క్ర మణకు అందరూ అనుమతి ఇచ్చేశారు.

ఇంటికి వెళ్ళేబదులు పొలానికి వెడితే- అనిపించింది నాగరాజుకు.

ఇంటి దారి వదిలి పొలానికి దారి తీశాడు. పంచాయతీ ఆఫీసునుంచి పొలానికి అరమైలు దూరం ఉంటుంది. నెమ్మదిగా వెన్నెల్లో నడిస్తే అరగంటకు చేరుకో వచ్చు. ఆ తర్వాత ఏ కాపలావాడితోనో అరగంటహస్కుకొట్టి అప్పటి ఆలోచనను బట్టి ఇంటికి వెళ్ళటమో, పొలాన్నే పడుకోవటమో నిర్ణయించుకోవచ్చు ననుకొన్నాడు నాగరాజు.

కాలు జారింది ఆ చీకటి వెన్నెల్లో. గట్టుమీంచి పక్కన ఉన్న పొలంలోకి పడింది కాలు. ముళ్ళలా గుచ్చుకొన్నాయి కోసి వదిలిన వరిచేను మొదళ్ళు. అబ్బా అనుకొంటూ సరిచూసుకొంటూ మళ్ళీ కదిలాడు.

అర్ధరాత్రయినా, అపరాత్రయినా ఆ దారిన తిరగటం అలవాటుంది కాబట్టి భయం లేకుండా, సొంత వూరు కాబట్టి మరింత నిశ్చింతగా నాగరాజు వెన్నెల్లో తనతోనే నడుస్తున్న నీడను చూసు కొంటూ నడుస్తున్నాడు.

పొలంలో ఎవరు ఉంటారు కాపలాగా? తెలీదు. పొలం వ్యవహారాల్ని పట్టించు కోవటం తన పద్ధతి కాదు. అపుడెపుడో ఒకసారి బండికట్టి పక్క ఊరికి వెడదా మని సరదాగా ప్రయత్నం చేశాడు. బండి సగం దూరం వచ్చాక, ఎదుటి వైపునుంచి

వస్తున్న బస్సునుచూసి ఎద్దులు బెదిరి పక్కకు లాగేసాయి. ఆ దెబ్బను తను కంట్రోల్ చేయలేకపోయాడు. బండి గిరికీలు కొట్టింది. ఒకటి రెండు చోట్ల గీరుకుపోయింది. చిన్న దెబ్బలే అయినా మనసు భయపడింది. మళ్ళీ బండికి ఎద్దుల్ని కట్టిన పాపానపోలేదు. అన్ని విషయాలనూ తండ్రికో, పాలేళ్లు బూచి గాడు, కిష్టిగాడికో వదిలేయటం తన పంతయింది. ఎంత పొలం ఉందో, అందులో ఎంత మెరకో, ఎంత పల్లమో, దేనికెంత సాగుబడి ఉందో, అసలేమైనా పండుతున్నాయో లేదో కూడా తను పట్టించుకోనక్కర్లేదు.

కడుపులో చల్ల కదలకుండా కాలం గడుపుకోగలిగే రోజులు.

పొలంగట్టు కిందనుంచి ఏదో పాకిన చప్పుడు అయింది.

నాగరాజు ఆలోచనలు తెగాయి.

పొలంకేసి, అక్కడఉన్న పంట కుప్పలకేసి చూశాడు నాగరాజు. మామూలుగా అలాటి వేళల్లో ఎవరో ఒకరు రాత్రంతా మెలుకువగా ఉంటారు. ఏడాది పాటు పడ్డ కష్టానికి ఫలితం. కుప్పనూర్చి పంటను బస్తాలకెత్తి ఇంటికి చేర్చుకోగలిగినపుడే దీర్ఘంగా నిట్టూర్చుకోవచ్చు. ఏ క్షణంలో ఏమర్చి ఉన్నా, కుప్పలో పంట ఇంటివరకు చేరకపోవచ్చు. అందుకే ఎవరో ఒకరు మెలుకువగా ఉండేది. ఉంటే కూడా ఏ సోడాబుడ్డి దీపమో, కోడిగుడ్డు దీపమో — కాకపోతే హరికేన్ లాంతరో ఉంటుందితోడుగా.

ఈ రోజున ఏ వెలుగూ కనపడ్డంలేదు అక్కడినుంచి.

అంటే...?

నాగరాజు మనసెందుకో కీడు శంకించింది.

కొంపదీసి ఏ దోపిడీయో, దొంగతనమో జరగలేదుకదా? పంట కుప్పల్ని కళ్లాల్లోంచి ఎత్తుకుని పోవటం పెద్ద విశేషం ఏమీకాదు! ఏమరిపాటున సోమరిపోతులైన కాపలావాళ్ళు కళ్ళు మూసుకొంటే, ఇది మామూలుగా జరిగే సంగతే.

నాగరాజు ఒక్కసారి ఊరికేసి వెనక్కు తిరిగి చూశాడు.

కరెంటులేని ఊరు నిశ్చింతగా నిద్రపోతోంది. ఇటు కళ్ళంలో వెధవలూ అంతే కాబోలు అనుకొన్నాడు నాగరాజు.

"ఒరోరి కిష్టిగా" ఒక్క పొలికేక పెట్టాడు.

పుచ్చపువ్వులాటి ఆ వెన్నెల్లో ఆ కేక అటూ ఇటూ ప్రయాణించింది. జవాబేమీ లేదు. అంటే?

నాగరాజు కంగారుగా, భయంగా, ఆత్రంగా పొలాల గట్లమీద అడ్డంపడి తమ పొలంకేసి పరుగు ఆరంభించాడు.

రొప్పుతూ, రోజుతూ కళ్ళం చేరేసరికి కళ్ళం నిశ్శబ్దంగా ఉంది. కుప్పలన్నీ వెన్నెల్లో వెన్నముద్దల్లా నిగనిగలాడుతున్నాయి.

నాగరాజు క్షణం ఊపిరి తీసుకున్నాడు.

'ఎక్కడ చచ్చారు వీళ్ళంతా?' అనుకొంటూనే నాగరాజు కుప్పల ముందు వెనకలన్నీ వెతికాడు. ఎక్కడా ఎవరూ కనిపించలేదు.

వెన్నెల్లో ఓ మూల ఒదిగి కూర్చున్న హరికేన్ లాంతర్ బిక్కుబిక్కుమంటూ నాగరాజుకేసి చూస్తోంది. నాగరాజు అటు వెళ్ళి దీపం హెచ్చించి పైకెత్తి మరోసారి కేకవేశాడు. "ఒరే బూచిగా..ఓరి కిష్టిగా"

కళ్ళంలో ఓ మూల కూర్చున్నాడు

# ప్రియ తోడుగా ఉంటే చాలు... మరింత సంతృప్తి!




బ్రేక్‌ఫాస్ట్ తీసుకొనేవేళ పక్కన 'ప్రియ' ఉంటే ప్రతి ఉదయం రుచులమయం. అదే 'ప్రియ' ఆకర్షణలోని రహస్యం. నోరూరించే పలురకాల పచ్చళ్ళలో మీకు కావలసింది ఎన్నుకోండి.

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ 300, 650 గ్రాముల సీసాల్లో దొరుకుతాయి.

* మామిడికాయ * నిమ్మకాయ * టొమాటో
* అల్లం * గోంగూర * ఉసిరికాయ * చింతకాయ
* పండు మిరపకాయ * వంకాయ

తీపిరకాలు : * మామిడికాయ * అల్లం

**ఎంతో రుచి... ఎంతో రుచి... ప్రియ**

**ప్రియ ఫుడ్స్**
ప్రైవేట్ లిమిటెడ్

Marketed by:
MARGADARSI
MARKETING
PRIVATE LIMITED
Eenadu Compound
Hyderabad - 500 004.

KIRON/PI/812

నాగరాజు. అదృష్టం బాగుంది పోయింది కానీ లేకపోతే ఎంత పంట...! ఏ దొంగ వెధవలో ఎత్తుకుపోతే...? కరెంటు పోబట్టి, తన దృష్టి ఇటు మళ్ళబట్టి పొలం కేసి వచ్చాడు. లేకపోతే ఏం జరిగేదో?

రానీ, దొంగ వెధవలని అనుకొన్నాడు నాగరాజు.

కళ్ళంలో కూర్చున్న నాగరాజుకు దూరంగా ఉన్న ఊరు చిన్నగా కని పిస్తోంది. వెన్నెల్లో హాయిగా పక్క పరుచు కొని బోర విరుచుకొని మరీ నిద్రిస్తోంది.

అరగంటకు అటూ ఇటుగా బూచిగాడు వచ్చాడు. అల్లంత దూరాన్నుంచి వాడి ఈల పాట వినిపిస్తూనే ఉంది. ఊరికి అవతల పక్కన ఉన్న మాలపల్లి నుంచి వస్తున్నాడులా ఉంది. పాట హుషారుగా ఉంది. పాట ఆగినపుడల్లా నోట్లో బీడీ ముక్క కాబోలు మరోసారి బాగామండు తోంది.

బూచిగాడిని దూరాన్నుంచి చూస్తూనే ఉన్న నాగరాజు, వాడు దగ్గరకి రాగానే తన కోపాన్ని పట్టలేకపోయాడు.

ఏం చేస్తున్నదీ గ్రహించుకోలేని మూర్ఖత్వం అతన్ని ఆవరించింది.

"ఎవురదీ?" అని నెమ్మదిగా కుశల ప్రశ్న అడుగుతున్న రీతిలో ప్రశ్నిస్తూ వచ్చిన బూచిగాడిని, లాగి చెంప మీద ఒకటి కొట్టాడు నాగరాజు.

బూచిగాడు ఎగిరి అల్లంత దూరాన పడ్డాడు. అనుకోని సంఘటన ఇది. ఎవరో కళ్ళంలో తనపైన చెయ్యి విసరటం ఒక్కటే అర్థమయింది బూచిగాడికి.

"ఎవురదీ అంటే..." ఏదో అన బోయాడు బూచిగాడు.

"ఎక్కడ చచ్చావురా దొంగ నాయాలా! పెళ్ళాం పక్కలో వెచ్చగా తొంగుని వస్తున్నావ్ యేంరా? ఈడ కళ్ళం కాడ ఎవరుంటార్రా నీ బాబు" నాగరాజు కసితీరా మనసులో ఉన్న కోపాన్ని వెళ్ళగక్కాడు.

బూచిగాడికి అర్థమయింది - అక్కడ నిలిచింది చిన్నయ్యగారని.

నెమ్మదిగా లేచాడు.




"నువ్వు చేసిన పనేం బాగలేదురా అబ్బాయ్" అన్నాడు కోదండరామయ్య.

నాగరాజుకు తలకొట్టేసినట్లుగా ఉంది పాలేరు వెధవ. తప్పు చేశాడు. తను ఒక్కసారి ఒక్కటంటే ఒక్కటి ఇచ్చు కొన్నాడు ఇలాంటి వెధవల్ని. ఎప్పటి కప్పుడు అణిచిపెట్టకపోతే అణిగేవాళ్ళు కారు వాళ్ళు. అలాటిది పెద్ద నేరంగా- నిజంగా హత్యానేరానికి సైతం ఇలాటి విచారణ జరుగుతుందో లేదో అనుమానమే. ఏదో ఘోరం జరిగినట్లుగా విచారణ- పంచాయితీ ఇంతక్రితం ఎప్పుడైనా ఇలాటిది జరిగిందా ఈ ఊళ్ళో! మనుషులంతా ఎలా ఉండేవారు! ఎలాటిది ఎలా అయిపో తోంది! మనసు కుతకుత ఉడుకుతున్నా నాగరాజు ఏమీ అనలేదు.

"మీరేదైనా చెప్పండి అబ్బాయిగారూ! బూచిగాడి మీద చెయ్యి చేసుకోవటం బాగాలేదండీ" అన్నాడు తలవరిగా ఉండే మసిగాడు.

"ఏం చెయ్యమంటారు మరి! కళ్ళంలో పంట నిండుగా ఉంది. వదిలేసి వాడు తాగి వస్తే ఊర్కోటమేనా? కళ్లాన్ని ఎవడైనా దోచుకొనిపోయి ఉంటే...?"

"అలా ఎందుకు జరుగుతుందండీ!"

"అంటే జరగదనా? జరగనపుడు మరి కళ్ళానికి కాపలా దేనికి? ఇంట్లో హాయిగా ఉండలేక వెళ్ళి పొలాలలో పడుకోవటం దేనికి?" నాగరాజు సూటిగా అడిగాడు.

"దేనికి అంటే ఏం చెప్తాం అబ్బాయ్ గారూ! ఏదీ జరగకుండా..."

"అంటే ఏదో జరుగుతుంది, దాన్ని జరగనివ్వకూడదనేకదా కాపలా. మరి ఆ కాపలాను వదలి...."

"అదంతా సర్లేగానీ అబ్బాయ్- నువ్వు ఆ బూచిగాణ్ని కొట్టకుండా ఉండా ల్సిందిరా!"

తండ్రి అదేమాట రెండోసారి అన్నాడు. నాగరాజు భరించలేక పోయాడు.

"సరే. కొట్టి ఉండకూడదు. కానీ కొట్టాను. ఏం చెయ్యమంటారు ఇపుడు. వెళ్ళి ఆ వెధవ కాళ్ళ మీద పడమంటారా మీరు?"

తలవరి మసిగాడు నెమ్మదిగా అన్నాడు "తప్పండయ్యా! మీరు మాటలు మిగిలి పోతున్నారు! అదంత మంచిది కాదు"

నాగరాజు ఉలిక్కిపడ్డాడు. ఆఫ్టరాల్ ఊళ్ళో తలారిగా బతికే మసిగాడు ఇన్నాళ్ళకు తనకు హెచ్చరికలు చేస్తు న్నాడు. మంచిచెడులు ఏమిటో విడమర్చి హితబోధ చేస్తున్నాడు.

"ఏంట్రోయ్! నా సంగతి ఏమిటో గానీ నువ్వు మాత్రం నీతిపాఠాలు చెప్తున్నావ్" నాగరాజు మళ్ళీ అన్నాడు.

"ఏం చేస్తామండయ్యా! మీరు మాటలు మీరి, చేతలు మీరితే మీకే మంచిదిగాదని చెప్పేందుకే వచ్చాం"

"అసలు నువ్వెందుకు వెళ్ళావ్‌రా పొలానికి! ఏ రోజు వెళ్ళనివాడివి ఈ రోజున వెళ్ళావ్, సమస్య నెత్తిమీదికి తెచ్చావ్" కొంచెం విసుగ్గా అన్నాడు కోదండరామయ్య.

"సమస్యేమిటండీ - మీరు మరీనూ. అడ్డమైనవాళ్ళకు ప్రాముఖ్యత ఇచ్చేసి వాళ్ళేదిచెప్తే అదే ఒప్పుకొంటూపోతే ఇలాగే ఉంటుంది పరిస్థితి! కళ్ళం వదిలేసి ఆ గాడిదకొడుకు పోవచ్చుగానీ లాగి లెంపకాయ ఒకటి కొడితే వచ్చిందట తప్పు"

"మీరేమనండి అయ్యా! అది తప్పే ఇక మీదట అలా జరగదని మీరు చెప్పటం తప్పదు"

అంటే? క్షమాపణ చెప్పమంటున్నారా తనను! వీళ్లు కూటికి గతిలేనివాళ్లు. ఊర్లో ఇల్లిల్లూ అడుక్కుంటూ తిరిగి బతికే ఈ కూలి వెధవలకా తను క్షమాపణ చెప్పేది. వల్లకాదు .... తను చెప్పడు. అసలు తప్పు వాడిదైనా వాడి గురించి ఎవరూ పట్టించుకోరేం? ఏం జరిగిందని ఎవరూ వాడిని అడగరేం? ఎందుకలా చేశావని ఎవరూ అసలు ప్రశ్నించరేం?

అటు సూర్యుడు ఇటు పొడవనీ, తల్లక్రిందులుగా ఊర్లో అందరూ తపస్సు చేయనీ-తను చేసింది తప్పని, ఇకపై ఇలా జరగదని తను చెప్పడు

అది తనకు, తన వంశానికి, తన

అహానికి మచ్చ. తను ఆ పని చేయడు. ఏం జరగాల్సి ఉంటే అదే జరగనీ!

"మీరంతా కలిసికట్టుగాపోయి గంగలో దిగండి. నేను మాత్రం అలా చెప్పను! మీ ఏడుపేదో మీరు ఏడవండి" ఒళ్లు మండి నాగరాజు మనసులో ఉన్న కసినీ, కోపాన్నీ వ్యక్తం చేస్తూ ఇంట్లోకి నడిచాడు.

వెనుక నుంచి రకరకాల వ్యాఖ్యానాలు వినిపిస్తూనే ఉన్నాయి.

"అయ్యా-ఇలా అయితే కష్టమండి" అని ఒకరు అంటున్నారు.

"రేపట్నించి వేరేవాళ్ళను చూసు కోండయ్యా" అని ఇంకోరు అల్టిమేటం ఇస్తున్నారు.

"వీడేది తెచ్చినా నెత్తిమీదకే తెస్తాడు" అంటూ కోదండరామయ్యా వాళ్ళకు సర్దిచెప్తున్నాడు "మీరుండండిరా! వాడి తత్వం అది. ఏదో పొరబాటు జరిగి పోయింది"

"ఆమాటే ఆర్నీ చెప్పమనండయ్యా!" అది బూచిగాడి మాట.

లోపల నాగరాజుకు వళ్ళంతా చెమటలు పోస్తున్నాయి. ఎంత ధైర్యం వీళ్ళకు! వీళ్ళకు క్షమాపణ చెప్పి తను మళ్ళీ ఆ ఊళ్ళో తలెత్తి ఉండగలగటమా! అయినా వీళ్ళకెంత ధైర్యం! తప్పుచేసికూడా ఎదుటి వాళ్ళనుంచే క్షమాపణ కోరగలగటం - ఏమిటి వీళ్ళకు ఇంత ధైర్యం? ఇదంతా ప్రభుత్వం చేస్తున్న పని. వెనుకబడ్డ జాతు లంటూ అన్ని రకాల సదుపాయాలూ చేస్తూ నెత్తిమీద కూర్చోబెట్టుకొంటే ఇంకెలా ఉంటుంది!

"అబ్బాయ్" అంటూ కోదండ రామయ్యా లోపలికి వస్తూ అన్నారు- "ఏంపని చేశావ్‌రా! ఆ పంచాయితీ ఆఫీసు అరుగు మీద పేకాడుకోకుండా నీకెందు కొచ్చిన గొడవరా ఇది"

"అదేంటండి మీరూ అలాగే అంటారు, అడ్డమైన వాళ్ళనూ వెనకేసుకొస్తూ. కళ్ళంలో హరికేన్ దీపం ముట్టించి ఇంటికి పోతే ఆ దీపం అటూ ఇటూ అయి కుప్పలు అంటుకొన్నా, ఏ దొంగలన్నా దోచుకొనిపోయినా ఇంక అంతేకదా! ఆ సంగతే వాడినీ అడగరేం?"

కోదండరామయ్యకు కొడుకు అంటున్న దాంట్లో కొంత సబబు కనపడింది కాని ఆ మాట వసారాలోనూ, ముందున్న పందిరిలోనూ అనే వీలులేదు కొడుకుకు నచ్చజెప్పుకోపటం తేలిక.

"నువ్వనేది నిజమేకానీ, అది కుదరని పనిరా! ఊళ్ళో మనం పేరుకు పెద్దాళ్ళమే కానీ ఇంక దేనికీ కాము. అన్నిటికీ వాళ్ళ మీదనే ఆధారపడటం తప్పనిసరి. కప్పేతకు కుప్పనూర్పిళ్ళకు - అంతవరకు దేనికి...నారు దగ్గర్నుంచి ఇంటికి పంట తెచ్చేంతవరకు వాళ్ళే గతి మనకు! ఏ పనీ మనకు చేతకానపుడు, అన్నిటికీ ఇతరుల మీద ఆధారపడినపుడు మనం చెయ్యి, నోరు పారేసుకోకూడదు. నా మాటవిను. వచ్చి ఒకసారి ఇంకెపుడూ ఇలా జరగదని చెప్పిపో! ఆ ఒక్కమాట అనేసెయ్. కాలం మనదికానపుడు తలెత్తి బతకడం కుదరనిపని రా! వచ్చి నా మాట విని ఆ ఒక్కముక్క అనేసిపో!"

"ఛీ వాళ్ళకా? కూటికీ గుడ్డకూ గతిలేని వాళ్ళకు నేను క్షమాపణ చెప్పటమా?"

"క్షమాపణకాదిది ఇకపై ఇలా జరగ దని హామీ. అంతే! ఇపుడు కొట్టినందుకు క్షమాపణ కాదు నువ్వు చెప్పేది"

తండ్రి చెప్పిన మాటల్లో నిజముంది. కానీ క్షమాపణ చెప్పి, పోనీ తండ్రి

అన్నట్లు హామీ ఇచ్చి మళ్ళీ వాళ్లను చూస్తూ జీవితం గడపటం తన తలకు మించినపని. అదే ఖరాఖండిగా చెప్పే శాడు.

"ఒకటే నాన్నా దీనికి పరిష్కారం! వాళ్ళకు మీరన్న హామీ ఇచ్చి వాళ్ళ ముందు నిలబడటం కష్టం"

"హామీ ఇవ్వకపోతే ఇక పంట చేతికి దక్కేదీ కష్టమే! నా బాధ అర్థంచేసుకో"

నాగరాజు క్షణం ఆలోచించి "సరే పదండి! కానీ ఆ తర్వాత నేనేంచేసినా మీరు అడ్డుచెప్పకూడదు"

"సరే నీ ఇష్టం వచ్చినట్లుకానీ" అంటూ కోదండరామయ్య వసారాలోకి దారితీశాడు. నాగరాజు పందిరికింద మను షుల్ని పురుగుల్లా చూశాడు. ఆ పురుగులు తనని అష్టదిగ్బంధం చేస్తున్నాయి. జీవితం దుర్భరం చేస్తున్నాయి. రేప ట్నించి...

"ఇంకెప్పుడూ ఇలా జరగదు"

అది హామీయో, క్షమాపణో ఎవరూ పట్టించుకోలేదు కానీ నాగరాజుకు తల కొట్టేసినంత పనయింది. అవమాన భారంతో మనసంతా కుతకుతలాడుతూంది.

కోదండరామయ్య పందిరిలో ఉన్న మనుషులతో ఇంకా ఏదో మాట్లాడుతూండ గానే నాగరాజు ఇంట్లోకి వచ్చాడు. తిన్నగా తన గదిలోకి నడిచి భోషాణం పక్కనే ఉన్న పెళ్లాం పెట్టె తెరిచాడు. పట్టుచీరలకింద పదిలంగా చీర గుడ్డలో మూటగట్టిన పెళ్లాం నగల్ని క్షణం చూశాడు. బాగా ఆలోచించి కొన్నిటిని ఏరుకొని చేతి రుమాల్లో కట్టుకొని ఇంట్లోంచి దొడ్డిదారమ్మట బయట పడ్డాడు.

కోదండరామయ్య మాటలు. అనునయ వాక్యాలు అతన్ని చాలా దూరం వరకూ వెంటాడుతూనే ఉన్నాయి.




బజర్ మోగటంతో రామదాసు ఒక్క సారి ఉలిక్కిపడ్డాడు. ఎవరు మోగించి ఉంటారా అని క్షణం ఆలోచించాడు. రూము దగ్గరికి ఎవర్నీ రానియ్యవద్దని ముందే చెప్పాడు తను బాయ్‌తో. అయినా ఎవరోవచ్చి మోగించారు బజర్. అంటే - వాళ్లకు తను రూంలోనే ఉన్న సంగతి తెలుసునన్నమాట!

చేతిలో కలం పక్కనపెట్టి విసుగ్గా లేచాడు రామదాసు. ఇలాటి అవాంతరాల వల్లనే అనుకొన్నపని ఏదీ అనుకొన్నట్లు సాగదు. తన చేతిలో ఇలాటి అవాంత రాల్ని ఆపే శక్తి లేకపోయినా తప్పంతా తనదేనన్నట్లుగా అందరూ అనుకుంటారు. పోనీ వెళ్లి తలుపు తీయకుంటేనో? తలుపు తీస్తే ఆ అనాహ్వానిత అతిథివచ్చి గంటో అరగంటో తన సమయాన్ని తినేస్తాడు. ఆ తర్వాత మళ్లీ తనకు ఖాళీ. కానీ అప్ప టికి తన మూడ్ గోవిందా కొట్టేస్తుంది.

మళ్లీ బజర్ మోగింది ఇక తప్పని సరి తను రూం తలుపు తీయటం.

రామదాసు తలుపు తీశాడు.

ఎదురుగా ప్రొడక్షన్ మేనేజర్ సూర్యా రావు నిలబడి ఉన్నాడు-

"నమస్తే కవిగారూ" అంటూ.

"రా, సూర్యం" అంటూ రామదాసు లోపలికి వచ్చాడు.

"చెప్పండి, ఎందాక వచ్చింది స్క్రిప్టు?"

ప్రొడక్షన్ మేనేజర్ ఆ ప్రశ్న అడుగుతున్నాడంటే, ఆ ప్రశ్న వాడి సొంతం అయి ఉండదు. అటు డైరక్టర్ గారో, ఇటు నిర్మాతగారో కబురుపెట్టి ఉంటారు. లేకపోతే వాళ్లు వీణ్ని తన పట్లో నిఘా వేసి ఉంచమనుంటారు. స్క్రిప్టు రాస్తున్నానంటూ లోపల ఏ అమ్మాయితోనైనా కాలంగడుపుతూఉండి ఉంటాడని వాళ్ల అనుమానం. అదీకాక ఏ జర్నలిస్టులతోనో బాతాఖానీలోపడి ఉంటాడని వాళ్ల భయం.

ఏదైతేనేం - సూర్యారావు అలాగనే అడిగాడు

"నడుస్తోంది"

సూర్యారావు నవ్వాడు. "నడిస్తే ఎట్లా సార్! పరిగెట్టాలి. రేపట్నించే కదా అవుట్ డోర్"

"తెలుసు"

"తెలిసీ నడిపిస్తే ఎలాగండీ! చెప్పండి, పరిగెట్టించేందుకు ఏం కావాలి!?"

సూర్యారావు ఏం అడుగుతున్నాడో రామదాసుకు తెలిసింది. అందులో ఎంత ఎకసెక్కం ఉందోకూడా అర్థంఅయింది. ఇది ఓ విచిత్రరంగం. ఆ రంగంలో అంప ఎదీ ఒక దారి తనదో దారి అయింది. తాడి తోపులో ఉంటూ కూడా పాలుతాగుతున్న మనిషి తను! అంతకన్నా విడ్డూరం ఇంకోటి ఏదీలేదు. కొందరు తన పద్ధతిని మెచ్చుకున్నారు. కొందరు దానికి నొచ్చు కొన్నారు. మరి కొందరు దాన్ని కాస్ట్లీ నటనగా భావిస్తున్నారు. ఏదైతేనేం తన పద్ధతి తనది!

సూర్యారావు మళ్ళీ అడిగాడు నెమ్మదిగా-"చెప్పండి కవిగారూ...అదా, ఇదా! ఏం కావలన్నా సరే! ఎవరికీ తెలీకుండా నేను ఏర్పాటు చేస్తాగా?"

రామదాసు నెమ్మదిగా అన్నాడు- "చూడు సూర్యారావ్! నాకుఏదైనాకావల్సి వస్తే అది అడిగి తెప్పించుకొంటాను. అందులో నాకేం మొహమాటం లేదు. నాకు 'అది' కావాలన్నా 'ఇది' కావాలన్నా ముందు నీకే కబురు పెడతాను. ఇప్పట్లో నాకు అదీ ఇదీ ఏదీ అక్కర్లేదు. కాస్తంత టైం కావాలి! ఒంటరిగా ఉండే వీలు కావాలి!! అంతే!" వెక్కు అనే మాటకు అందమైన రంగులు పులిమి చెప్పాడు రామదాసు.

అక్కడి పరిభాషలో అది అంటే బుడ్డి, ఇదిఅంటే ఆడది అని రామదాసుకూ తెలుసు. అందుకే అవేమిటని అడగకుం డానే జవాబు ఇచ్చాడు.

"ఏంటో సార్, మీ పద్ధతంతా వింత! సిగరెట్ తాగరు. మందు కొట్టరు. ఇంక దాని సంగతి సరేసరి-దగ్గరకైనా రానివ్వ నంటారు! అయినా పదేళ్లనుంచి పాతుకుని పోయారు, ఎలా నెగ్గుకు వస్తున్నారో ఏమో మరి"

ఆ సంగతి రామదాసుకే ఆశ్చర్యంగా ఉంటుంది. తను సిగరెట్ తాగడు. మందు ముట్టుకోడు. ఆడదాని ధ్యాస తనకే ఆవ హించదు. కాంట్రాక్ట్ ప్రకారం సొమ్ము పుచ్చుకోవటం, సొమ్ముకు తగ్గట్టు మాట లను పేర్చుకోవటం-అంతే చేతనయింది తనకు! దీన్ని తన చేతకానితనం అనే వాళ్లూ ఉండి ఉంటారు. తను వాటిని పట్టించుకోడు. సూర్యారావు లాగ ఎవరో ఎప్పుడో ఒకసారి ఇలా అడిగితే నిర్మొహ మాటంగా ఊరుకోవటం - ఒక్కోసారి

చాచి లెంపకాయ కొట్టినట్లుగా జవాబు ఇవ్వటం! ఇపుడు ఏది చెయ్యటానికి మనసొప్పటం లేదు. ధ్యాసంతా స్క్రిప్టు మీదేఉంది.

రామదాసు జవాబు ఇవ్వకపోయే సరికి సూర్యారావు కుర్చీని దగ్గరగా జరుపుకున్నాడు "అయ్యా! ఒకటే సంగతి చెప్దామని వచ్చాను. మొహమాటం ఏమీ లేదు. గణపతి వచ్చి చెప్పి వెళ్ళాడు. చెప్పటం ఏమిటిలెండి కాళ్ళావేళ్ళా పడ్డాడు. ఏదో మీరు దయతలిస్తేకానీ కథ సాగేట్లు లేదు. గుంట బాగుంది. ఏదో ఓ సీనో, ఓ షాటో - ఏదో ఒకటి మీరు తల్చుకొంటే ఎంత! డైరక్టర్‌గారికి మీరంటే గురి. మీరొక్కసారి చెప్పారంటే చాలు మా పని అయిపోతుంది. అటు ఆ పిల్ల కు ఆ వేషమూ దొరుకుతుంది, ఇటు మాకూ కొంత సరదా కూడా దక్కుతుంది..."

ఇంకా సూర్యారావు ఏదో అనబోతూనే ఉన్నాడు. రామదాసుకు ఒళ్లుమండిపోయింది. అసలే స్క్రిప్టు రాసుకోవల్సిన టైం నాశనం అయిపోయిందన్న బాధ. పైగా ఇలాటి దౌర్భాగ్యుల బేరసారాలు! భరించలేకపోయాడు.

"సూర్యం! ఇదే మొదటిసారీ, ఆఖరుసారీ చెప్తున్నాను. నాకు ఇలాటివినచ్చవు. ఇన్ని సినిమాలకు పనిచేశాను. ఏ ఒక్క అమ్మాయి పేరైనా ఎవరికైనా సిఫార్సు చేసి ఎరుగుదునా? నా దగ్గర ఇలాటి ప్రస్తావనలు తేకు"

"నే చెప్పేదీ ఆదేనండీ- ఎప్పుడూ ఇలాటివి చెప్పని మీరొక్కసారి చెప్పారంటే..."

"సూర్యం! తప్పది. నన్ని రొంపిలోకి దింపకు! నీ ఇష్టమొచ్చినట్లు నువ్వు ఏడుగానీ నాకీ పెంట పెట్టకు. వెళ్లు. వెళ్ళి నీపనులు చూసుకో! అనవసరంగా ఇంకోసారి ఇలాటి ప్రసక్తి నా దగ్గర తేకు. మరోసారి ఇలా జరిగితే ప్రొడ్యూసర్‌గారికి, డైరెక్టర్‌గారికి కబురు పెడతాను"

"కోపం దేనికండీ కవిగారూ! పోనీ, అంతగాఅయితే ఈరాత్రికి మీకేవేర్పాటు చేయిస్తా. కుర్రది బాగుంది. గనుక ఇంత ప్రయత్నం లేకపోతే అసలు మీదాకా వచ్చేదా ఏమిటి?''

రామదాసు ఇంక ఉండ బట్టలేక పోయాడు.

"సూర్యం...గెటవుట్. దౌర్భాగ్యపు పనులు చేస్తూ ఇంకా నాకుకూడా వాటాలా? సిగ్గులేకపోతేసరి! పో బయటకు''

"కవిగారూ! గెటవుట్... గెటవుట్ అన్నారు కదూ మీరు. నన్ను-ప్రొడక్షన్ మేనేజర్ సూర్యారావును ఇంత మాటన్న వాడెవ్వడూ ఈ ఇండస్ట్రీలో లేడండీ! ఉండడు...ఉండడానికి వీల్లేదు. ఆఫ్టరాల్ డైలాగ్‌రాసే మీరు ఊహూ-ఉండనివ్వను. చూడండి నా తడాఖా. ప్రొడ్యూసర్‌గారితో చెప్పి, నెక్స్ట్ ప్రొడక్షన్‌కు వేరేవాడిని కుదుర్చుకోపోతే...."

"ఏడిశావ్. బోడి ప్రతిజ్ఞ నువ్వూనూ. ముందు బయటకు పోరా నువ్వు" అన్నాడు రామదాసు చాలా కోపంగా.

"పోరా...రా అన్నారు కదా మీరు. సరే. మీరేవచ్చి నా కాళ్ళ మీద పడి ఛాన్సుల కోసం అడగకపోతే చూడండి" అంటూ చిరచిరలాడుతూ సూర్యారావు బయటకు నడిచాడు.

లాడ్జిరూం తలుపు దభేలున పడింది.

రామదాసు మనసంతా చీకాగ్గా తయారయింది. ఆఫ్టరాల్ ఒక ప్రొడక్షన్ మేనేజర్-నిర్మాత ఖర్చు పెట్టే డబ్బులో కమీషన్లు కొడుతూ బతికేవాడు-ఎంగిలా




కుల వద్ద పొర్లాడేవాడు వాడు తనతో ఛాలెంజ్ చేయటం!!

రామదాసుకు తెలుసు తన సత్తా ఏమిటో! మాటల్లో పదును ఉన్నంతకాలం పచ్చగా ఉంటాడు తను! అంతేగానీ ఇలాటి బ్రోకర్ వెధవల వద్ద నీచపు పనులు చేస్తూ, చేసేందుకు అవకాశం ఇస్తూ బతకటం తనవల్లకాదు. ఆరోజె వస్తే కలాన్ని అవతల పారేసి నాలుగు అక్షరమ్ముక్కలు నేర్చుకొన్నదానికి సార్థకతగా నలుగురికి ట్యూషన్లు చెప్పుకొని బతుకుతాడు తను! అంతేకానీ...

కలాన్ని మూసి టేబుల్ మీద పడేశాడు రామదాసు. మూడంతా పాడయిపోయింది. రాయాల్సిన సీను కథకు చాలా బలమైనది. ఆ సీను వల్లే పాత్రలకు సరైన ప్రాణప్రతిష్ఠ జరుగుతుంది. అలాటి సీనును ఇలాటి మూడ్‌లో రాస్తే సీన్ సరిగా పండకపోవటంతో కథ నాశనం అవుతుంది.

రామదాసు లేచాడు. హేంగర్‌కు వేలాడుతున్న లాల్చీని కొడుక్కొని లాడ్జి రూంకు తాళం వేసి, బయటకు నడిచాడు.

* * *

షూటింగుకు హాజరవటం అంటే రామదాసుకు తగని చిరాకు. ఏ సంస్థతో అయినా మొదలు ఒప్పందం కుదిరే సమయంలోనేచెప్పేస్తాడు-తను షూటింగులకు హాజరు కానని! తన పనంతా దర్శకుడో, నిర్మాతో అందించిన కథకు అవసరం ఉంటే స్క్రీన్‌ప్లే తయారు చేస్తూ మాటలు రాయటం, లేకపోతే తయారైన స్క్రీన్‌ప్లేకు మాటలురాసి ఇవ్వటం!

కానీ ఈరోజు పరిస్థితి వేరు. షూటింగు చాలా పెద్ద సంస్థది. తెలుగు చిత్రసీమలో

ఉన్న విజయ, వాహిని, సురేష్ వంటి ఉన్నత సంస్థల స్థాయికి చెందిన సంస్థ ఇది. తూర్పు తెల్లారగానే ఆ సంస్థ అధిపతి ఫోన్ చేశారు – షూటింగ్‌కు రావటం తప్పనిసరి అని. కుదరటం సాధ్యపడదేమో అనే వీలుకూడా లేదు. ఎవరో కొత్త హీరోయిన్‌తో సీన్సు తీస్తున్నారట. ఆ అమ్మాయి చిలకపలుకులు పలికేటపుడు ఒత్తులు, కష్టమైన పదాలు అనగలిగే స్థాయిలో ఉండకపోవచ్చు. అప్పటికప్పుడు మాటలు మార్చి ఆ అమ్మాయి అనగలిగే మాటలు రాయటం తప్పనిసరి. ఇలాటివన్నీ సెట్ మీద ఆఖరి క్షణాలలో తప్ప ఇంకెపుడూ తెలిసే అవకాశం ఉండదు. చిన్నచిన్న మాటలు వేరుగా పలకటం తెలికే అయినా అవి ఇతర మాటల కలయికతో ఉన్నపుడు, పెద్దపెద్ద వాక్యాలలో భాగాలయినపుడు పలకటం ఎలాంటివారికయినా కష్టమే. పెద్ద పెద్ద స్టార్స్ విషయంలో ఏ పదాలు కొంత కష్టపెతాయో ఊహించడం తేలిక. అలాటి పదాల్ని రాసేటపుడే పక్కకు పెట్టేస్తారు. కానీ వస్తున్నది కొత్త హీరోయిన్!!

తప్పనిసరి కావటంతో రామదాసు షూటింగుకు వెళ్లాడు.

వచ్చిన అమ్మాయి- ఎవరో కొంత వాక్‌శుద్ధి ఉన్న అమ్మాయే ! పదాలను పలకటంలో కొత్తదనం, బెరుకు ఉన్నాయే తప్ప అపశబ్దాలేమీ పలకటంలేదు. శుభ సూచకం అది ! పలికే తీరు బాగుంది. శరీరంలో అందచందాలు తగినంతగా ఉంటేచాలు ఈ ఫీల్డులో నిలబడటానికి. ఈ అమ్మాయికి మొదటి అర్హత ఉంది. అదే పదివేలు. కెమేరాలోంచి అందంగా కనిపిస్తోందన్న సంగతి స్క్రీన్ టెస్ట్ నాడే నిర్ణయం అయిపోయి ఉంటుంది. కనుక ఈ అమ్మాయికి ఉజ్వల భవిష్యత్తు ఉండి తీరుతుందనేది స్పష్టం.

రామదాసు ఆ అమ్మాయికి మొదట ఉచ్చారణలో ఉండాల్సిన జాగ్రత్తలు, తీసుకోవల్సిన మెలుకువల గురించి చెప్పాడు. ఆ క్షణంలో ఆ అమ్మాయి చూపిన శ్రద్ధతో రామదాసుకు ఆ అమ్మాయి మీద ఆసక్తి కలిగింది. ఉండాల్సిన అవసరం లేదు. ఆ అమ్మాయి ఏ పదాన్నైనా పలకగలదనే నమ్మకం కుదిరినా కొత్త అమ్మాయి షూటింగు సరదా చూద్దామనే ఆసక్తితో పూర్తయ్యేంత వరకూ సెట్‌లోనే ఉండిపోయాడు.

షూటింగు పేకప్ అయిపోయాక ఇంటికి బయలుదేరేసరికి కొంచెం ఆలస్యం అయింది. కార్లు లేకపోవటంతో ఓ అర గంట ఆలస్యం జతయింది. కార్లొచ్చి ప్రియారిటీ ప్రకారం బయలుదేరి రామదాసు వాటా వచ్చేసరికి చీకట్లు కమ్ముతున్నాయి.

చిరుచీకట్ల వేళలో కారు హెడ్‌లైట్లు కూడా డిమ్‌గానే వెలుగుతున్నాయి.

కారు నెమ్మదిగా పోతోంది.

ఆ సమయంలో చూశాడు అక్కడొక గుంపును రామదాసు. ఏదో ఆక్సిడెంట్ అనుకున్నాడు. ఇలాటి సిటీలో ప్రమాదాలు మామూలు సంగతి. కానీ అలా అనుకొని వెళ్లిపోలేకపోయాడు. మనసు కొంత అభ్యంతర పెడుతోంటే కాదని తోసిరాజనలేకపోయాడు.

ఆఖరికి కారుదిగి ఆ గుంపులోకి వెళ్ళాడు.

రామదాసు సినీ రచయితేకానీ ఈ దేశంలో సినీనటులకు ఉన్నంత పేరు





ప్రఖ్యాతులు ఇంకెవ్వరికీ లేవు. ఆఖరికి నాయకులకు కూడా అనేది నిజం అదే ఏ నటుడో వచ్చి ఉంటే గుంపంతా చెల్లా చెదరయి ఉండేది. అందరూ అతణ్ని చుట్టుముట్టి ఉండేవారు.

ఆఫ్టరాల్ రామదాసు ఓ రచయిత. ఎంత పేరున్న రచయిత అయితేనేం ఎవరికి గొప్ప? ఫలితంగా ఆ గుంపులోకి తోసుకొనే వెళ్ళాల్సివచ్చింది.

ఎవరో స్పృహతప్పిపోయి ఉన్నాడు. వేసుకొన్న బట్టలూ అవీ చూస్తోంటే ఏదో చదువుకున్న వాడిలాగనే ఉన్నాడు. ముఖంలో బాధ పైకి స్పష్టంగా కనిపిస్తోంది.

"ఏం జరిగింది?" అనడిగాడు రామదాసు ఎవర్నో.

ఎవరో జవాబిచ్చారు "ఆ ఏముంటుంది! నడుస్తూ నడుస్తూ పడిపోయాడు! మూర్ఛ రోగమేమో"

"మూర్ఛ అయితే నోట్లోంచి నురుగు అదీ వస్తుంది—మూర్ఛ కాదిది"

"మూర్ఛకు కాళ్లు చేతులుకూడా కొట్టుకుంటాయికదా"

మూర్ఛకాదని తేలాక ఆఖరికి తేలింది—బహుశా ఆకలికి తాళలేక స్పృహతప్పిపోయి ఉంటాడని!

రామదాసుకు బాధగా అనిపించింది. ఆకలి బాధ తానెరగనిదికాదు. ఎలా నాలుగు రాళ్ళు సంపాదించాలనే తపనతో ఈ ఊరికి వచ్చాడో రామదాసుకు ఇంకా గుర్తుంది. ఉద్యోగంకోసం ప్రయత్నించే రోజుల్లో ఇంట్లోంచి ఒక్క రూపాయి కూడా తెచ్చుకోకూడదన్న పంతంతో పంపులకింద నీళ్లుతాగి బతికిన రోజులు ఉన్నాయి. ఆనాటి ఆకలిబాధ రామదాసుకు ఇంకా బాగా గుర్తుంది.

అది ఇప్పుడు ఇలా ఎదుటిమనిషిలో ప్రతిధ్వనిస్తోంటే చూస్తూ ఊర్కోలేకపోయాడు.

"కొంచెం పక్కకు జరగండి—గాలి తగలనివ్వండి" అంటూ చొరవ తీసుకుని జనాన్ని పక్కకు జరిపాడు రామదాసు.

పక్కషాపులోంచి కొంచెం నీళ్ళు తెప్పించి ముఖంమీద చిలకరించాడు. అతను కొంచెం తేరుకున్నాక ఒక సోడా ఇప్పించాడు.

'ఇతనికి ఇవ్వాల్సింది సోడాకాదు - పెట్టించాల్సింది భోజనం' అనుకొంటూ రామదాసు కారు డ్రైవర్ని పిలిచాడు. అతనొచ్చాక కొంచెం సాయంచేసి కార్లోకి తీసుకొచ్చి పడుకోబెట్టాడు. కారు కదిలాక అడిగాడు—"మీ పేరేమిటి?" అని.

కళ్లు నీరసంతో మూసుకొని పోతోంటే అన్నాడావ్యక్తి "నాగరాజు."

ఇంకేమీ అడగలేదు రామదాసు అప్పటికి. అతని పేరు నాగరాజు కానీ ఏదైనా కానీ మిగతా కథ అడగటం అనవసరం. ఆకలికి తట్టుకోలేకపోయిన ముఖం అది. ఆ ముఖం వెనుక కథ అచ్చం ఒకేలా ఉంటుంది.

రచయిత కావటంతో రామదాసు ఆ కథ ఊహించుకొనే ప్రయత్నం చేశాడు.

నాగరాజును ఇంటికితెచ్చి సుష్టుగా భోజనం పెట్టించాడు. అన్నం తిన్నాక నాగరాజు చాలా సేపు నిద్రపోయాడు. ఆ తర్వాత రామదాసు పక్కగదిలో కూర్చుని రాసుకొంటూంటే నాగరాజు దగ్గరకువచ్చి కూర్చున్నాడు.

రామదాసు కలం మూసిపెడుతూ అన్నాడు "చెప్పండి"

నాగరాజు క్షణం ఏమీ మాట్లాడలేదు. ఆ తర్వాత నోరువిప్పుతూ అన్నాడు

"నేను మీకెంతో ఋణపడిఉన్నాను. జన్మలో మీరు చేసిన మేలు మరువను"

రామదాసు నవ్వాడు.

"ఏముంది నేను చేసిన మేలు?"

"అలా అనకండి. మనిషిని మనిషి పట్టించుకోని ఈ రోజుల్లో మీరు నామీద ఇంత ఆదరం చూపటం చాలా గొప్ప విషయం. మీరేగనుక ఆదుకోకపోయి ఉంటే నేనేమయిపోయేవాడినో అని పిస్తోంది"

"ఏమవుతుంది. ఏమీకాదు. నేనుకాపోతే బహుశా మరొకరెవరో మీకు సాయంచేసి ఉండేవారు! అంతే! సరె, అది వదిలి వెయ్యండి చెప్పండి ఏ ఊరుమీది? దేనికి వచ్చారు మీరిక్కడికి?"

నాగరాజు నెమ్మదిగా జరిగినదంతా చెప్పాడు.

రామదాసు అంతా విని అన్నాడు "పోన్లెండి మీకు కావల్సిన మొత్తం నేనిస్తాను. మీ ఊరు వెళ్లిపోండి! అక్కడికి వెళ్ళాక మీరామొత్తాన్ని పంపినా పర్వా లేదు, పంపకపోయినా పర్వాలేదు"

"నేనిపుడు ఊరు వెళ్లలేనండీ! మీకు మా ఊరు సంగతి తెలీదు. ఇప్పటికే నేను చేసినది ఏదో పెద్ద నేరమనే ప్రచారం జరిగిపోయి ఉంటుంది. పైగా నేనిలా రావటం. దాంతో ఆ కథకు కావల్సినన్ని మలుపులు కూడా ఉండి ఉంటాయి. బతకటానికి బలుసాకు చాలు అన్నారు. ఏదో ఒకటి చేసి ఇక్కడే బతుకుతాను. అంతే కానీ మళ్ళీ మా ఊరు వెళ్ళను" అన్నాడు నాగరాజు.

రామదాసు చాలాసేపు ఏమీ అనలేదు.

"ఏం చదివారు?" అనడిగాడు ఆఖరికి.

"మెట్రిక్ పాసయ్యాను. పీయూసీకి అప్లయి చేస్తే సీటు రాలేదు"



"ఊ...సరే...అయితే. పోనీ ఒక పని చెయ్యండి. నాకు తోచినదేదో ఇస్తాను. ఇక్కడే ఉండిపోండి! నేను సినిమాలకు డైలాగ్స్ రాస్తుంటాను. నా రాత అంత బాగుండదు. నేను డిక్టేట్ చేస్తుంటాను. దాన్ని కాస్త కాగితంమీద పెడితే చాలు"

నాగరాజుకు ఆ ఉద్యోగం నచ్చింది. ఆ క్షణంనుంచే చేరుతున్నట్లుగా చెప్పాడు. రామదాసు నవ్వుతూ అన్నాడు—"నాకు తెలుసు ఈమాట అంటారని. మళ్ళీ చెప్ప లేదనుకోవద్దు! సినిమాల్లో డైలాగులు అంటే చాలా ఆసక్తికరంగా కనిపిస్తుంది. కానీ ఈరోజు నేను రాసేవాటికి, తెరమీద వినిపించే వాటికి పెద్ద అగాధం ఉంటుంది. ఈ రోజు రాసినవి చదివి ఆరోజు తెరమీద అవి రాలేదనుకొని ఆశ్చర్యపోవటం కూడదు. ఏదో వాళ్ళు డబ్బు ఇస్తున్నారు. మనం రాసి ఇస్తున్నాం. అవి అలాగే వస్తున్నాయా అనుకోవటం తప్పు. తెలుగులో అక్షరాలు యాభై ఆరు ఉన్నాయి. ఈ అక్షరాలకు గుణింతాలను కలిపితే మరిన్ని! వాటిని నేను ఒకరకంగా పేర్చితే ఒకరకం మాటలు అవుతాయి. వేరేవాడు పేర్చితే ఇంకో రకం అవుతాయి! ఏవైతేనేం, అన్నీ తెలుగు అక్షరాలే కదా! ఇదిగో, ఇలాటి సమభావం ఉండాలి. ఆ సంగతి మర్చిపోవద్దు. ఇదంతా ఎందుకు చెప్తున్నానంటే-నేను డిక్టేట్ చేసే మాటలు రేపు సినిమాల్లో రాలేదని ఎక్కడా అనకు! అది తప్పు. పైగా ప్రమాదం కూడానూ! మాటలు రామదాసు అని పడితే చాలు. ఆ సినిమాలో ఉన్న పాత్రలు మాట్లాడినవి నేనే రాసినట్లు లెక్క - నిజానికి అవి ఎవరు రాసినా!"

నాగరాజుకు కొంత అర్థం అయింది. కొంత అర్థం కాలేదు. అర్థం అయిన వాటి గురించి ఆలోచించలేదు. అర్థంకాని వాటి గురించి తల బద్దలు కొట్టుకోలేదు.

అతని దృష్టంతా - రామదాసు సినీ రచయిత. ఆ నిచ్చెన సాయంతో ఆకాశాన్ని, చుక్కలను ఎలా అందుకోవటం అనే అంశంమీద ఉంది.




రూం తలుపుమీద ఎవరో దబదబా బాదుతున్నట్లుగా ఏదో అవాంతరం ముంచుకొచ్చేసిన రీతిలో తలుపు కొడుతోంటే రామదాసు విసుగ్గా లేచి వెళ్ళి తలుపు తీశాడు. ఎదురుగా రాంబాబుగారు రామదాసు మాటలు రాస్తున్న చిత్ర నిర్మాత.

"రండి రండి" అన్నాడు రామదాసు సగౌరవంగా.

రాంబాబుకు ఇండస్ట్రీలో మంచి పేరుంది. హిట్ చిత్రాలను తీసిన కీర్తి ఉంది. ఒకేసారి అయిదారుచిత్రాలను ప్రజలకు వారంవారంతేడాలతో అందించగలిగే స్తోమత ఉంది. ఇప్పటికే పన్నెండు చిత్రాలను తీసిన చరిత్ర ఉంది. అయినా ఆయన ఏ సాంకేతిక విషయంలోనూ ఇంతవరకు జోక్యం చేసుకోలేదు. సమర్థులైన నిపుణుల్ని నియమించుకొని, వాళ్ళకు అవసరం వచ్చిన సదుపాయాలు

చేసి తన పనిని కానిచ్చుకోవటం రాంబాబుకు అలవాటు. అందుకే ఆయన దగ్గర పని చేయాలంటే ఇటు టెక్నీషియన్లూ సంతోషపడతారు. అలాటిది రాంబాబుగారు ఇవాళ తన రూంలోకి రావటం రామదాసుకు ఆశ్చర్యం కలిగించింది. ఆయన రావటంలో ఆంతర్యం అంతగా అర్థం కాలేదు.

"ఏం కవిగారూ! ఏంచేస్తున్నారు?" అంటూ రాంబాబు వచ్చి చనువుగా మంచంమీద కూర్చున్నాడు.

"కవికి ఏం పని ఉంటుంది చెప్పండి. రాత! అంతే కదా" నవ్వుతూ జవాబు ఇచ్చాడు రామదాసు.

"ఏం రాతో కానీ – మీ్రరాసేది మా తల రాతల్ని నిర్ణయిస్తుంది. అది గుర్తుంచుకోండి. మీ డైలాగులబట్టే మా బాగోగులు! సరేకానీ, ఎందాకా వచ్చింది మా సీను?"

రామదాసు ఉలిక్కిపడ్డాడు. మా సీను అంటున్నాడేమిటి ఈయన! "ఇవ్వాల్సినవన్నీ ఇచ్చేశాం కదా"

"భలేవారండీ మీరు. రేపు బాబూరావుగారు ఖాళీట. అటు ఇందిరా ఖాళీ — అందుకే మిగిలిన ఆ రెండు సీన్లూ రేపు తీసేస్తే బాగుంటుందని నిర్ణయించుకున్నాంకదూ!"

"మీరు నిర్ణయించుకొన్నారేమో నాకు తెలీదు" అన్నాడు రామదాసు.

"అదేంటండీ అలా అంటారు? మీకు సూర్యంతో కబురుపెట్టాకదా– రేపు పొద్దున్నకల్లా నాకు సీన్లు కావాలని"

"నాకు సూర్యం వచ్చి చెప్పలేదు, చంద్రం వచ్చి చెప్పలేదు"

రాంబాబు దెబ్బతిన్నట్లు చూశాడు "మీకు చెప్పానని వాడు చెప్పాడే నాకు?"

"నాకు చెప్పలేదండీ వాడేసంగతీనూ. మీరు ఫోన్‌చేసి చెప్పాల్సింది లేకపోతే ఇలా వచ్చేది ఇంత్రకితమే వచ్చి చెప్పాల్సింది"

"ఏమిటి రామదాసుగారూ ఇలా మాట్లాడుతున్నారు? ఎప్పుడూ ఇలా మాట్లాడి ఎరగరుమీరు! నేనూ ఫోన్‌చేశా మీ రూంకు. ఎవరూ ఎత్తలేదు. మీరు ఎక్కడికో వెళ్ళారనుకున్నాను. పైగా కబురుపెట్టాకదా, ఇంకదేనికి మళ్ళీ మీకు చెప్పడం అని ఊర్కున్నా. ఇప్పుడైనా ఏమీతోచక ఇలా వచ్చా. అంతేకానీ..."

రామదాసుకు గొర్తొచ్చింది. ఇందాక ఫోనువస్తే తానే ఎత్తలేదు మూడ్ పాడయిపోతుందని అది ఈయన చేసినదన్న మాట!

రాంబాబు నెమ్మదిగా అన్నాడు "పోన్లెండి. ఆ సంగతి వదిలెయ్యండి. ఇప్పుడు చెపుతున్నాకదా, గుర్తుందికదా– సీను 18, సీను 22 రేపు పూర్తిచేయాలి. దయచేసి మొదలుపెట్టండి"

రామదాసుకు ఒళ్ళుమండిపోయింది. ఏమిటీపద్ధతి! మాటలు రాయటం అంటే తేలిక అనా వీళ్ళ అభి్రపాయం? పైగా తను ఇపుడు కథ రాసుకుంటున్నాడు. కథ రాసుకోవటం అంటే రచయితగా తను ఇంకా బతికిఉన్నానని ప్రపంచానికి తెలియజెప్పటం అన్నమాట! పైగా ఈ కథ అలాటి ఇలాటి కథా...? 'అగ్నిప్రమాదం' కథపేరు. ప్రపంచవ్యాప్తంగా రచయితలందరికీ జరుగుతున్నపోటీ ఇది. న్యూయార్క్ పోస్ట్ పత్రిక నిర్వహిస్తున్న పోటీల్లోనే కనుక తన కథకు బహుమతి వస్తే తెలుగు కథ గొప్పదనం ఏమిటో ఒక్కసారి ప్రపంచానికి అర్థంఅవుతుంది! తను ఈ కథ పూర్తిచేసికానీ ఇంకేమీ




ముట్టుకోడు- అటు సూర్యుడిటు పొడవనీ!

అదే చెప్పాడు నెమ్మదిగా రామదాసు-"కుదరదండీ ఇపుడు వేరేపనిచేసే మూడ్ లేదు. నాకు కొంత ప్రైవేట్ పనిఉంది"

రాంబాబుకూ ఈ వ్యవహారం కొత్తగా వుంది రామదాసు ఎప్పుడూ ఇలా మాట్లాడి ఎరగడు. ఏదో అవసరం కొద్దీ తప్పనిసరై రేపటి షూటింగుకోసం తను ఇలా అడిగాడేతప్ప ఇంతక్రితం ఎప్పుడూ ఇలా తను బలవంతంగా మాట్లాడి మాటలు రాయించుకున్న పాపాన పోలేదు. కానీ ఈ కవి ఆ గౌరవం తనకు దక్కించేలా లేడు. కొంపదీసి వేరే కంపెనీకి ఒప్పుకొని ఆ పని ముందు చేస్తూ తనపనిని పక్కకు తోస్తున్నాడా? అదే అయిఉంటుంది కారణం! అందుకే సూర్యం చెప్పలేదని నేరంకూడా అతని మీదకు తోసేస్తున్నాడు కాబోలు! ఏమైనా సరే వ్యవహారం తేల్చుకుంటే కానీ కుదరదు. తను వదలడు.

"ఏమిటి ప్రైవేట్ పనిఅంటే?"

వీళ్లకు అర్థంకాదు- రచయితకు కథ ఎంత ముఖ్యమో! ఇలాటి విషయం చెప్పటం అనవసరం. చెప్పి వాళ్ల చులకనగా అనే మాటలు వినడు.

"ప్రైవేట్ పని అంటే నాకు పూర్తి వ్యక్తిగతం. ఏమీ అనుకోకండి ఇలా అంటున్నందుకు" వ్యవహారం తెలియకుండానే చేయిజారిపోతోందని రామదాసుకు సిక్స్త్‌సెన్స్ చెబుతూనేఉంది.

రాంబాబు మంచంమీంచి లేచాడు "సరే అయితే- మీరు చెప్పకపోయినా నాకు తెలీదని, నాకు అర్థంగాదని, నేను అర్థంచేసుకోలేననీ అనుకోకండి. నాకు తెలుస్తూనే ఉంది మీరు అక్కడ రాస్తున్నది ఏదో. వేరే కంపెనీ పని చేస్తున్నారన్నమాట. దాసుగారూ....ఇపుడు మీరుంటున్న ఈ లాడ్జి ఛార్జీలు భరిస్తున్నది నేను. మీరు రాయాల్సింది నా స్క్రిప్టు. నాకు ఇష్టమైతేనే మీరు వేరేపని చేసుకోవాలనేది ధర్మం! రేపు నాకు అవసరం, స్క్రిప్టు పూర్తిచేసి పెట్టండి అంటే మీరు ప్రైవేట్ పని అని చెప్తున్నారు? నాకు ఇపతల లక్షలకొద్దీ బిజినెస్... గుర్తుంచుకోండి"

ఏమిటి బెదిరిస్తున్నాడా తనను? తను లొంగడు.

"కావచ్చునండీ! కానీ కవి అని మీరు పిలుస్తారుకదా...కవికి కొన్ని మూడ్స్ అంటూ ఉంటాయి. ఇపుడు నాకు ఆ మూడ్ లేదు. రాయను... రాయలేను"

"దీనికి లేని మూడ్ మీకు ఆ స్క్రిప్టుకు వస్తుందా?"

"అది స్క్రిప్టు కాదండీ...కథ! కథ రాసుకుంటున్నాను"

"కథా?" పకపక నవ్వాడు రాంబాబు. "కథకోసమా ఇంత గొడవ పడుతున్నాం! నా మాట వినండి. ఆ కథ తీసి అటు గిరవాటు వెయ్యండి. ఆ ముష్టి కథకు వచ్చే ముప్పయి రూపాయలు నేనిస్తా మీకు. ఎపుడూ లేనిది ఈసారి పొరబాటున ఇలా స్క్రిప్టు తయారవకుండా సెట్స్‌కు పోవడం వల్ల వచ్చింది ఇబ్బంది! చెప్పింది వినండి - రేపటికి సీన్సు రెండూ తయారుచేసి ఉంచండి!"

ఏమిటిది శాసనమా? తను తల ఒగ్గడు. ఒప్పందంలో ఇలా నిర్బంధించటం ఎపుడూ ఉండకూడదు నెలరోజులు-నెలరోజుల టైంలో తను స్క్రిప్టు అందించాలి. కానీ అసలు ఒక షెడ్యూల్ అంటూ లేకుండా ఏదో క్విగ్గా తీయాలని రాంబాబుగారు అనుకోవటం వల్ల ఇది

ఇలా అయింది. లేకపోతే పూర్తి స్క్రిప్టు ఒకేసారి ఇచ్చేయటం తనకు అలవాటు!

"క్షమించండి రాంబాబుగారూ! ఆ కథ పూర్తయితే కానీ నేను ఇంకోటేదీ ముట్టుకోను"

"అంటే" రాంబాబులో కోపం తార స్థాయికి చేరుకొంది "అంటే మీకు నా లక్షల గురించి ఏమీ పట్టలేదన్నమాట! మీ ముష్టి ముప్పయి రూపాయల కథ కోసం నాది పక్కన పడేస్తారన్నమాట! సరే, కానీండి! స్క్రిప్టు వర్కు కాదని కథల్ని రాసుకొంటున్న మీరు-కథల్నే నమ్ముకోవటం మంచిదేమో ఆలోచించండి!"

రాంబాబు లేచి బయటకు వచ్చేస్తోంటే అప్పటికి రామదాసుకు ఆయనేమన్నాడో అర్థం అయింది... "రాంబాబుగారూ!"

"సర్లెండి, వదిలెయ్యండి. మీరు మీ పని చేసుకోండి, నేను వేరే ఏర్పాట్లలో ఉంటాను"

రాంబాబు వెళ్ళిపోయాడు.

రామదాసు నివ్వెరపోయాడు. ఏం జరిగిపోయింది! ఏమనుకొన్నాడు తను! ఏంజరిగిపోయింది? కథ పూర్తయ్యాక కావాల్సిన ఆ రెండు సీన్లూ తను రాసిస్తానని అనాల్సింది! అనలేదా? ఆ అర్థం వచ్చేటట్లయినా ఏమీ అనలేదా? అన్నట్లే గుర్తు.

తప్పు జరిగిపోయింది. కథకు ఉండే ప్రాముఖ్యత ఏమిటో సినీ నిర్మాతలకు ఏం తెలుసు? కథ అనేది అసలు ఏ సినిమాల్లో ఉంటోంది ఈ రోజుల్లో! అందుకే ఈ చులకన! కానీ....

పోనీ వెళ్ళి అడిగితే.. 'ఏదో జరిగింది జరిగింది. దాన్ని పట్టించుకోకండి' అని అడిగితే? మూర్ఖులకు సరస్వతీ సాక్షాత్కారం ఎందుకు ఉండదో తనకు ఇపుడే తెలుస్తోంది. వెళ్ళి ఇపుడు లక్ష్మీపుత్రుని దయకు పాత్రమయితే తప్ప గత్యంతరం లేదు. రామదాసు లేచి ఆగిపోయాడు.

ఏం జరుగుతుంది? తను వెళ్ళకపోతే ఏం జరుగుతుంది? ఏమీ జరగదు. అది నిజం. ఎంత పెద్ద ప్రొడ్యూసర్ అయినా ఏం చేస్తాడు? తప్పు తనదికాదు. ముందు కబురు పెట్టకపోవటం ఆయన తప్పు. సూర్యానికి చెప్పాను అంటూ నేరం తన మీదకే తోసివేసినంత మాత్రాన ...ఊహూ అసలే రచయితలంటే అంతకన్నా హీనమయిన డిపార్ట్‌మెంట్ ఏదీ ఈ ఫీల్డులో లేదన్న భావం ఏర్పడిపోయింది. తను మారుస్తాడు ఆ పద్ధతి. కొత్తపద్ధతికి ఒరవడి పెడతాడు. అడిగిన వెంటనే నాలుగు అక్షరాలు కూర్చిఇవ్వటం కాదు రచన. ఆ సంగతి తను చాటిచెప్తాడు.

జరిగేది జరగనీ—తను మాత్రం వెళ్ళి ప్రాధేయపడడు మహాఅయితే ఈ తర్వాత చిత్రానికి తనను బుక్ చేసుకోడు. ఆత్మను చంపుకొంటూ వెళ్ళి ప్రాధేయపడటం కంటే ఆత్మహత్య చేసుకొని ఆకలిని చంపుకొంటాడు తను.

రామదాసు వెళ్ళి కథ రాసుకోవటంలో మునిగిపోయాడు. అంతసేపూ లాడ్జి రూంలో ఒకమూల పడుకొన్న నాగరాజు నెమ్మదిగా కదిలాడు.

* * *

రాంబాబు తన గదికి చేరుకొన్నాడు— గదిలోకి వస్తోంటే లోపల్నించి వెస్టరన్ మ్యూజిక్ సన్నగా వినిపిస్తోంది. ఇందాక బాయ్ వెలిగించి వెళ్ళిన అగరువత్తుల సువాసన నెమ్మదిగా గదిని వ్యాపిస్తోంది. మెత్తని పరుపు మీద కూర్చుంటే నిజానికి అక్కడ ఇంద్రబోగం ఉంటుందని




పించింది. కానీ ఆ క్షణంలో రాంబాబుకు వాటి మీద ధ్యాస లేదు.

రామదాసు తనను అవమానించి పంపి నట్లే ఉంది. ఎంత కండకావరం! లక్షల కొద్దీ పెట్టుబడి పెట్టేది తను. వీళ్ళ ఇష్టం వచ్చినట్లు వీళ్లుఆడితే సహించటం తెలివైన పనికాదు. తన వ్యాపారంతో చెలగాటం ఆడటం ఎవరికీ సరైన పనికాదు. తన స్క్రిప్టు రాయాల్సింది. అతని కథ... కథ అయివుండదు. తన ముందు ముఖ మిచ్చకపు మాటలు చెప్పేందుకు అలా అని ఉంటాడు కానీ నిజానికి అది వేరే కంపెనీ స్క్రిప్టు అయివుంటుంది.

కానీ... ఏంచేయాలి తను?

ఏంచేస్తే రేపటికోసీన్ తయారవుతుంది?

వేరే రచయితను పెట్టుకొంటే? ముందు ఆ పని చెయ్యాలి. ఈ రెండు సీన్లూ రాయించుకొంటేసరి...అసలు రామదాసే వస్తాడనిపిస్తోంది.

మనసంతా చాలా చీకాగ్గా ఉంది. ఏం చేయాలో తోచటం లేదు. లేచి బాటిల్లోంచి విస్కీ తీసి గ్లాసులోకి ఒంపుకొని, కోట్లో పోసుకొన్నాడు. మంచం మీద కూర్చున్నాడు. ఏం చేయాలో తోచటం లేదు.

సూర్యారావు వచ్చాడు గదిలోకి.

"రామదాసుతో చెప్పావా నువ్వు స్క్రిప్టు కావాలని?"

సూర్యారావు ఉలిక్కిపడ్డాడు. సరే కానీ...ఇదే సమయం. "చెప్పానండీ!"

"మరి చెప్పలేదని అంటున్నాడే అతను"

సూర్యారావు ఏమీ అనలేదు. ఏమనాలో తోచలేదు. తన మీద ప్రొడ్యూసర్ గారు నిఘావేస్తారని అనుకోలేదు.

"ఇందాకా నేను వెళ్ళేసరికి వేరే స్క్రిప్టు రాసుకొంటున్నాడతను" రాంబాబు నెమ్మదిగా అన్నాడు.



సూర్యారావు ఉలిక్కిపడి సర్దుకున్నాడు. మంచి తరుణము మించిన దొరకదు అనీ అనుకున్నాడు. "ఆ సంగతే మీకు చెప్దామనుకొన్నాను. కానీ ... రేపొద్దున్నకు మనకు కావాల్సినవి రెండే సీన్లు. ఇచ్చేస్తాడని నాకు అనిపించింది. అందుకే...''

"ఇంతకీ ఏమిటి చేస్తున్నాడు అతను?''

"కొత్త కంపెనీవాళ్ళతో మధ్యాహ్నం మాట్లాడుతుంటే చూశాను. ఏదో సవల తెచ్చి ఇచ్చినట్లున్నారు. అన్నీ కుదిరాయి కాబోలు..." సూర్యారావు నెమ్మదిగానే అన్నాడు. కానీ ఆ ఆజ్యం సరిపోయింది. రాంబాబుకు ఒళ్ళుమండిపోయింది. "తినేదేమో మనసొమ్ము! రాసేది ఇంకోడి స్క్రిప్టూనా? పైగా మధ్యాహ్నం ఒప్పుకొని ఇప్పటికి స్క్రిప్టు ఆరంభించేశాడంటే.. దొంగవెధవలు...సరే! వీడి రోగం నేను కుదురుస్తాను'' అంటూ ఫోన్ అందుకున్నాడు ''రిసెప్షన్'' అన్నాడు.

సూర్యారావుకు ఏంజరిగిందో అర్థం కాలేదు కానీ ఏదో జరిగిందని మాత్రం అర్థమయింది. లేకపోతే ప్రొడ్యూసర్ గారు ఇంత ఇదిగా ఉండరు! చూద్దాం. ఏం జరుగుతుందో! తనను ఆయన ఏమీ అనుమానించటం లేదు. అదిచాలు తనకు!!

"రిసెప్షన్. రాంబాబు హియర్. యస్... ఆర్ట్ ప్రొడక్షన్స్ - రామదాసని రైటర్ - నూట ఆరో నెంబరు గదిలో ఉన్నారు చూడండి. ఆయనగారిఎకౌంట్ వెంటనే క్లోజ్ చేయించి నాకు పంపండి. ఆయనకు నేను ఇలా చేస్తున్నానని మీరొకసారి ఫోన్ చేసి చెప్పండి. ఇకపై బిల్లు నేను భరించటంలేదు... ఓకే..." ఫోన్ పెట్టేశాడు.

సూర్యారావు బిత్తరపోయాడు. ఇంతగా ఎప్పుడూ ఈయన ఉండగా చూడనేలేదు తను! 'ఏం జరిగిందసలు? అడిగితే... ఊహూ.. ఆయనే చెప్తారు' అనుకొన్నాడు.

ఫోన్ పెట్టాక మనసులో కొంత కక్ష తీరిందనిపించింది రాంబాబుకు. కానీ ఏం జరిగిందసలు? నిజానికి ఏముందీ- తను తీసుకున్న చర్యవల్ల జరిగేదేమీలేదు. తనకు స్క్రిప్టు మాత్రం సున్నాయే!

"సూర్యం... ఈ హోటల్లో ఎవరైనా రైటర్స్ఉన్నారేమోచూసిరా! రేపొద్దునకు మనకు రెండు సీన్లు కావాలి. ఎంతయినా సరే ఇద్దాం. వెళ్ళి కొంచెం జాగ్రత్తగా ఎంక్వయిరీ చేసిరా! ఇక్కడ లేకపోతే అటూ ఇటూ హోటళ్ళుకూడా వెతికిరా. ఎవడైనా సరే, ఒకడిని పట్టా చాలు! వెళ్ళు!''

రాంబాబు చెప్పింది విని సూర్యం కదిలాడు. డోర్ దాకా వెళ్ళి వెనక్కొచ్చాడు. చిన్న అనుమానంతో "ఈ సంగతి డైరెక్టర్‌గారికి చెప్పమంటారా?''

"వద్దులే. రేపొద్దున్నకు సీన్లు రెడీ అయితే సరే. కాకపోతే అపుడే ఆలోచిద్దాం! వెళ్ళి తలకుమాసిన వాడెవడైనా సరే ఒకణ్ణి పట్టా''

సూర్యం బయటకు కదిలాడు. రూం తలుపు మూతపడింది.

గదిలో రాంబాబు ఒక్కడు.... మనసంతా ఎంతో ఆందోళనగా ఉంది. అట్నుంచి రామదాసు వచ్చేస్తే...వచ్చి సీన్లు రాస్తానంటే ఏ గొడవ ఉండదు. వడ్లగింజలో బియ్యపు గింజ. టీకప్పులో తుఫాను. అంతే! అన్నీ మర్చిపోవచ్చు. కానీ రామదాసు పస్తే...?

రూం తలుపు మీద చిన్నటాప్ వినబడింది.

రాంబాబుకు అది రామదాసే అనిపించింది. సరే, సారీ చెప్పటానికి వచ్చాడు.

 

సారీ అనేస్తే సరే!

"కమిన్" అన్నాడు రాంబాబు.

వచ్చింది రామదాసుకాదు. ఎవరో కొత్తవ్యక్తి. ఎక్కడో చూసినట్లే ఉంది. కానీ గుర్తుకు రావటంలేదు.

ఎవరు మీరన్నట్లు చూశాడు రాంబాబు.

''నమస్కారమండీ! నన్ను మీరెరుగరు. నాపేరు నాగరాజు. నేను మిమ్మల్ని చాలా బాగా ఎరుగుదును''

"ఆహా రండి, కూర్చోండి" అన్నాడు రాంబాబు. తన దగ్గరికి ఎందరో వస్తూ పోతూ ఉండటం చాలామామూలైన సంగతి. కొందర్ని చూసి ఏ పనిమీద వచ్చారో చెప్పటం తేలిక. అందమైన అమ్మాయి లయితే సినిమాలో ఛాన్సుకోసం. మొదట హీరోయిన్ పాత్ర దగ్గర బేరం మొదలు పెడతారు. కాలంగడిచేకొద్దీ కిందకు జారి ఆఖరికి ఎక్స్ట్రాగా స్థిరపడతారు. మరీ అందమైన అమ్మాయి అయితే, ఫొటోజెనిక్ ఫేస్, మంచి లుక్స్ ఉంటే ఎలాగో తామే ఆమెను ఎన్నుకుంటారు. ఫిగర్–ఆ సంగతి అవకాశం బట్టి, అవసరాన్నిబట్టి నిర్ణయించుకోవచ్చు. అందమైన అమ్మాయికి ఫిగర్ లేకపోతే ఏదో ఫాల్సీలు పెట్టించచ్చు. అబ్బాయిలు వచ్చారంటేనూ కారణం అదే, సినిమాలో ఛాన్సు.

కానీ వచ్చింది ముప్ఫయి ప్రాంతాల పడ్డవ్యక్తి. చూస్తోంటే సరైన అభిప్రాయం ఏదీ ఏర్పడదు. ముఖంలో జుట్టు చిందరవందరగా–జీవితంపట్ల నిర్లక్ష్యాన్ని ప్రకటిస్తున్నట్లుగా ఉంది. కళ్ళల్లో జీర మనసులో ఉండే చెత్త ఆలోచనలతో ఎర్రబారినట్లుంది. ఎత్తుపళ్ళు, గారపట్టిన పళ్లు నవ్వినపుడు అసహ్యంగా కనిపిస్తున్నాయి. స్థూల కాయం.

రాంబాబు వచ్చిన నాగరాజు శరీర పరిశీలన పూర్తిచేశాడు. ఇతను సినిమాల్లో ఛాన్సుకోసం వచ్చి ఉండడు. మరి అయితే ఇతను ఏ అభిమానో అయి ఉంటాడు. కానీ అలాటి వ్యక్తులు ఎవరైనా వస్తే రిసెప్షనిస్టు ఫోన్‌చేసి అడిగి తను పంపమంటే మరీ పంపుతుంది. అంటే ఇతను...?

ఎవరు?

తెలీటంలేదు.

"చెప్పండి. ఏం పనిమీద వచ్చారు?"

"నేను చెప్పాగదా నా పేరు నాగరాజు. మీ సినిమా రైటర్ రామదాసుగారి దగ్గర అసిస్టెంట్‌ను"

రాంబాబు ఉలిక్కిపడ్డాడు. రామదాసు దగ్గిర అసిస్టెంటా? రైటర్‌కు అసిస్టెంట్ ఏమిటి? తనెప్పుడూ వినలేదు.

"అసిస్టెంట్ అంటే ఏం చేస్తారు మీరు?" అని అడుగుతూ ఆగి– "పుచ్చుకుంటారా?" అని గ్లాసు చూపించాడు రాంబాబు.

''అబ్బే వద్దండీ! ఇందాక మీరు రామదాసుగారితో గొడవపడుతోంటే విన్నాను. ఆ విషయమై వచ్చాను" అని ఆగాడు నాగరాజు.

"చెప్పండి"

''మీరేమీ అనుకోకపోతే, అభ్యంతరం లేకపోతే ఆ సీన్లేవో నేను రాస్తాను"

"మీరా? రామదాసుగారు పంపారా మిమ్మల్ని"

''లేదండీ! నా అంతట నేనే వచ్చాను. గొడవ విన్నాక పోనీ మిమ్మల్ని వెళ్లి కలుస్తే అనిపించి వచ్చాను''

"మీరప్పుడు ఎక్కడ ఉన్నారు?"

''ఆ గదిలోనే''

''రామదాసు వేరే స్క్రిప్టు రాస్తున్నారా?''

నాగరాజు క్షణం ఏమీ మాట్లాడలేదు. కానీ అవకాశం వస్తోంది, అందుపుచ్చుకోమంటోంది మనసు. ఒక్క క్షణం అడ్డొస్తున్న ఆత్మను చంపేసి అన్నాడు-''అవునండీ''

"అనుకున్నాను. సరే కానీండి. అనుభవిస్తాడు''

''రామదాసుగారు రూం ఖాళీ చేస్తున్నారు. ఇపుడే మీరు పెట్టిన కబురు అందింది. అందుకే...''

''మరి మీరు వెళ్లలేదేం?''

''మిమ్మల్ని ఒకసారి కలిసి వెడదామని ఇటువచ్చాను. ఇంతక్రితం కొన్ని నాటకాలూ అవీ రాశాను. సినీ రంగంలో ప్రయత్నించాలని ఇలావచ్చాను. వచ్చి రామదాసుగారి దగ్గర చేరాను''

''అసిస్టెంట్ అంటే ఏం పనిచేస్తారు మీరు?''

"స్క్రీన్‌ప్లే తర్వాత ఫస్ట్‌కాపీ డైలాగ్ రాస్తున్నాను. దాన్ని రామదాసుగారు కొంచెం మార్పులూ చేర్పులూ చేస్తారు" తడుముకోకుండా చెప్పాడు నాగరాజు.

రాంబాబుకు ఇదంతా కొత్తగా ఉంది. రామదాసుగారు కాదనటం, అతనికో అసిస్టెంట్ ఉండటం!...ఏమిటిదంతా? ఇండస్ట్రీలో కొత్త పోకడలకు నాందీ వాక్యాలా? 'కానీ ఏం జరుగుతుందో చూద్దాం' అనుకున్నాడు రాంబాబు.

తలుపును తోసుకుంటూ సూర్యారావు లోపలికి వచ్చాడు. "చచ్చాంబాబూ! ఎవ్వరూ ఒక్కరంటే ఒక్కరు కూడా దొరకలేదు నాకు. రామదాసుగారు టాక్సీ తెప్పించుకొని సామాను ఎక్కిస్తున్నారు వెళ్లిఉండమని చెప్పమంటారా''

''వద్దు''

''కానీ రేపు...''

"సర్లే. ఆ సంగతి నాకు వదిలెయ్" అని ఆగి "రిసెప్షన్‌కు ఫోన్‌చేసి నూట ఆరో నెంబర్ గది రిజర్వేషన్ మనమీద ఉంచమనిచెప్పు. సర్లెండి చూద్దాం. మీ పేరేమిటి అన్నారు"

"నాగరాజు"

"నాగరాజుగారూ! వెళ్లండి నూటఆరో నెంబర్ రూం. ఇతని పేరు సూర్యారావు. ప్రొడక్షన్ మేనేజర్. సూర్యం!ఇతను నాగరాజని మనకు ఇకపై స్క్రిప్టు రైటర్''

నాగరాజు తలెత్తి సూర్యాన్ని చూసి చనువుగా నవ్వాడు. సూర్యం ఇంకా ఆ షాక్‌నుంచి తేరుకోలేదు. ఇతను....ఇతన్నెక్కడో చూశానని అనిపిస్తోంది సూర్యానికి. కానీ గుర్తురావటంలేదు.

"సూర్యం! వెళ్లి ఈయనకు కావల్సిన ఏర్పాట్లు చూడు! చూడండీ- మీరేంచేసినా సరే రేపటికి సీన్లు రెండూ నాకు సిద్ధంగా ఉండాలి! ఓకే'' రాంబాబు అన్నీ ఆర్డర్లీగా చెప్పాడు.

సూర్యంకు గుర్తొచ్చింది- ఇతను రామదాసుగారి దగ్గర ... అదే చెప్పబోయాడు. తలెత్తిచూస్తే నాగరాజు నవ్వుతూ కనిపించాడు. ఆ నవ్వులో ఎన్నో అర్థాలు కనిపించాయి. వాటిని క్షణంలో చదువుకోగలిగాడు సూర్యం.

"రండి" అన్నాడు సూర్యం. నాగరాజు మరోసారి రాంబాబుకు థాంక్స్ చెప్పి బయటకు కదిలాడు.

నూటఆరో నంబర్‌గది తలుపుతీసిన వెంటనే నాగరాజు సూర్యాన్ని దగ్గరకు తీసుకుంటూ అన్నాడు-"ఒక్కరోజు... ఒక్కరోజు నీకు తెలిసిన సంగతి మనసులోనే ఉంచుకో! నీ మేలు మర్చిపోను. రేపు సాయంత్రం షూటింగు పూర్తయ్యే సరికి రాంబాబుగారిచ్చేదాంట్లో సగం




నీది, సగం నాది''

సూర్యం బిత్తరపోయిచూసి తర్వాత తేరుకొని పకాలున నవ్వాడు.




మర్నాడు షూటింగ్ జరిగిపోయింది. నాగరాజు రాసిన 'మాటల'తోనే! రాంబాబుకు ఆమాటలు నచ్చాయి. తూర్పు తెల్లవారగానే నాగరాజు వచ్చి తనురాసిన మాటలను వినిపించాడు. హీరోహీరోయిన్ల మధ్య ఘర్షణ ఒకసీను, పశ్చాత్తాపం మరో సీను. ఎవరో అమ్మాయితో హీరోను హీరోయిన్ చూస్తుంది. అలా ఎందుకు చేశావని అడగటం మొదటి సీను. ఆ అమ్మాయి చెల్లెలు అని తెలిసి 'సారీ' చెప్పటం రెండోసీను. సగటు తెలుగు సినిమాసీన్లు అవి. అయినా అదే సీను రామదాసు రాసిఉంటే దానిఅందం వేరేగా ఉండేది. నాగరాజు మాత్రం తను అంత క్రితం చూసిన అయిదారు తెలుగుసినిమాలలో వచ్చిన అలాటిసీన్లనే దృష్టిలో ఉంచుకొని చిలకపలుకుల్లాగ వాటినే తిరిగి జాగ్రత్తగా అప్పజెప్పినట్లు కాగితంమీద రాసిచ్చాడు. అప్పటికే రామదాసు దగ్గర పనిచేసిన కారణంగా డైలాగ్ ఎలావలకాలి, మాడ్యులేషన్ ఎలావుండాలి యాక్షన్‌కు ఎక్కడ ఎలా అవకాశం ఇవ్వాలనే సంగతి కొంత తెలిసింది.

ఇంకేముంది! నాగరాజు మాటలురాసేసాడు. సీనుకు తగ్గట్లుగా ఉన్నాయని హీరో బాబూరావు సెట్లో అంటూ ఉంటూ అన్నాడు.

"నాకూ అలాగే అనిపించిందండీ! మాటలన్నీ మామూలుగానే ఉన్నాయి. సమోసాలేవీ లేవుంచా" అంది ఇందిర—హీరోయిన్ — ఏమీ అనకపోతే బాగుండదనే ఉద్దేశంతో.

"సమాసాలు కాదండీ. సమాసాలు" అని ఎవరో సరిదిద్దారు సెట్ మీద.

"సమాసాలో, సమోసాలో — అలాటి పదాలుఉంటే నవమాసాలు మోసినట్లుగా భారంగా ఉంటుంది. అసలు సినిమాలకు ఇలాటి తేలికభాషే అవసరం. మనం తీసేది మాస్‌పిక్చరా, క్లాస్‌పిక్చరా — అదీ పాయింటు. ఇది మాస్‌పిక్చర్ అయితే ఇందులో సమాసాలు, సమోసాలు ఉండకూడదు. అదీ నాథియరీ" అన్నాడు హీరో బాబూరావు

హీరోగారు ఇంతగా మెచ్చుకొన్నది రామదాసుగారినే అని అందరూ అనుకొన్నారు. కానీ హీరోగారన్నది పూర్తి అయ్యాక ప్రొడ్యూసర్ రాంబాబు కలగజేసుకొంటూ అన్నాడు — "ఈ మాటలు రాసింది ఎవరనుకొంటున్నారు?"

"ఎవరేమిటి, మనకవి రామదాసుకదా" అన్నాడు బాబూరావు.

"అసలు ఆయనే అనుకోండి. కానీ ఆయనకు ఈ సీన్స్ కుదరకపోతే ఇదిగో ఇతనిచే రాయించాను!" అంటూ రాంబాబు నాగరాజును పిలిచి పరిచయం చేశాడు. "ఇతని పేరు నాగరాజు! కుర్రాడు బుద్ధిమంతుడు. సీన్స్ బాగానే రాశాడని మీరు అంటున్నారు. కొంచెం ఎంకరేజ్‌మెంట్ ఇస్తే చాలు"

"గుడ్ — గుడ్. ఇదేనా మొదటిసారి

రాయటం?" అనడిగాడు బాబూరావు.

"అవునండీ"

"వెరీగుడ్. ఫస్ట్ అటెంప్టే ఇంత బాగుంటే - గుడ్ - యూవిల్ కమ్ అప్ బ్రదర్" అన్నాడు హీరో బాబూరావు.

నాగరాజు సవినయంగా నమస్కరించాడు.

బాబూరావు మరోసారి దీవిస్తున్నట్లు, ప్రోత్సాహం ఇస్తున్నట్లు భుజంమీద చేతులువేసి తట్టాడు. "గుడ్. నేను కూడా ఒకరిద్దరు ప్రొడ్యూసర్లతో మీగురించి చెప్తాను. ఇలాంటి కుర్రాళ్ళకు ఎంత ప్రోత్సాహం అయినా ఇవ్వాలండీ మనం! వియ్ నీడ్‌దెమ్ బాడ్‌లీ!"

షూటింగ్ మేకప్ అయిపోయాక అందరూ తిరిగి హోటల్ రూంకు తిరిగి వచ్చేశారు. రూంలోకి రాగానే రాంబాబు సీసాలోంచి తీసి గ్లాసులో పోసుకున్నాడు.

"నాగరాజూ - అయాం గ్లాడ్. ఈ రోజు నన్ను రక్షించావ్. నా పరువు నిలబెట్టావ్. నువ్వు లేకపోతే చాలా ఇబ్బంది పడిపోయేవాడిని. రాసింది రెండేసీన్లు. అయినా బాగారాశావ్. ఇదిగో ఇది..." అంటూ పర్సుతీసి నోట్లుతీస్తూ ఆగిపోయాడు. "వద్దు వద్దు. మొదటిరోజే బ్లాక్ ట్రాన్సాక్షన్ వద్దు. మొదటిరోజు లావాదేవీలు వైట్‌లోనే చేద్దాం! ఒరే సూర్యం- ఆ చెక్‌బుక్ అందుకో" అన్నాడు రాంబాబు.

సూర్యంవెళ్ళి చెక్‌బుక్ తెచ్చాడు.

"నాగరాజూ! చెప్పు. ఏంపేరురాయాలి ఇక్కడ? అంటే నీ పూర్తిపేరేమిటి? నీకు ఇచ్చే పారితోషికంను ఇది చెక్. చెప్పు, ఏంపేరు రాయను?"

నాగరాజు క్షణం ఆలోచించాడు. చెప్పినా చెప్పకపోయినా, తనుఒప్పుకొన్నా ఒప్పుకోకపోయినా రామదాసు తనగురువు.



ఆయన నేర్పిననిద్య ఇది. ఆయస పెట్టిన బిష ఇది. దాసుగారి పుణ్యమా అని... అదే బాగుంది! దాసు నాగరాజు!

"దాసు నాగరాజు" అని రాయండి అన్నాడు నాగరాజు.

రాంబాబు చెక్ మీద ఏదో అంకెవేసి సంతకంచేసి ఇచ్చాడు.

నాగరాజు ఆ చెక్ అందుకునిచూశాడు. దానిమీద వెయ్యిరూపాయలు అని ఉంది. ఉలికిపడ్డాడు. బిత్తరపోయాడు. ఒకే ఒక్క రోజు సంపాదన అది! రెండేరెండు సీన్లకు అది ప్రతిఫలం!! అంటే రామదాసు ఎంత తీసుకొంటూ ఉండి ఉంటాడు ఒక్క సినిమాకు....?

నాగరాజు ఆలోచనల్ని అడ్డుకొంటూ అన్నాడు రాంబాబు-"వెయ్యిరూపాయలు రాశాను దాంట్లో! ఈరోజు రెండుసీన్లకు రెండువందల రూపాయలు. నా పరువు కాపాడినందుకు మూడొందల రూపాయలు! ఇక మిగిలిన అయిదొందలూ-నా తర్వాత సినిమాకు నువ్వు రాయబోయే డైలాగ్స్‌కు అడ్వాన్స్. ఓకే....?"

నాగరాజు తుళ్ళిపడ్డాడు.

ఏమన్నాడు. 'నా తర్వాత సినిమాకు నువ్వు రాయబోయే డైలాగ్‌కు ఇది అడ్వాన్సు'. అంటే...?

గుండెలొక్కసారి ఆగి తిరిగి కొట్టుకో నారంభించాయి నాగరాజుకు.

అంటే?

అంటే తను కూడా సినీ రచయిత అవుతున్నాడన్న మాట!

ధైర్యం చేసి చేసిన ప్రయత్నం ఫలించటం అదృష్టం. ఈ అదృష్టం ఇంకొంత కలిసి వచ్చి ఈ సినిమా కనుక హిట్ అయితే రాంబాబుకు తనమీద గురి పెరుగుతుంది. ఎలాగూ ఇప్పటికే తనను



మరో చిత్రానికి మాటల రచయితగా ఎన్నుకొన్నాడు. అది రామదాసు మీద కక్షే కావచ్చు. కానీ అది తనకు కలిసి వచ్చిన అదృష్టం. దీన్ని జాగ్రత్తగా కాపాడుకోవటం తప్పనిసరి!

తనకేసి చూస్తున్న సూర్యంను చూసి నాగరాజు చిరునవ్వు నవ్వాడు. ఆ నవ్వులో అనేక అర్థాలు సూర్యానికి కన పడ్డాయి. జవాబుగా మందహాసం చేశాడు.

ఎలా నిలబెట్టుకోవాలి ఈ అదృష్టం? ఏ పథకాలు వేసి ఇక్కడ రాణించాలి? ఎవరి సహాయంతో ఇక్కడ నిలబడాలి?? నాగరాజు మనసులో రకరకాల ఆలోచనలు.

"మంచి కథేదైనా చూడండి నాగ రాజుగారూ! కథ మీదే అయితే ఇంకా పసందుగా ఉంటుంది. మీ మాటలు ఇంకా బాగుండొచ్చు. ఆ ప్రయత్నంలో ఉండండి మీరు. ఏమైనా సరే-వచ్చే సిని మాకు మీవి కథా, మాటలు అయితీరాలి. ఆ రామదాసును దెబ్బతీయటానికి ఇదే దారి" అన్నాడు రాంబాబు.

'రామదాసు కథ సమాప్తం' అను కొన్నాడు సూర్యారావు మనసులో. ఇది ఊహించని పరిణామం. ఒకే ఒక్కరోజు- ఒకేఒక్క రోజులో ఎన్ని మార్పులు! నిజానికి తప్పు తనది. షూటింగు ఉందని తనకు తెలిసినా, 'అనివార్య కారణాల' వల్ల వెళ్ళి ఆ సంగతి రైటరు రామదాసుతో చెప్పలేకపోయాడు. అనివార్య కారణాలంటే ఏమీ లేదు. కొత్త అమ్మాయి ..సినిమాల్లో ఛాన్సు కావాలి. ఆ ఛాన్సు తనకు తగి లింది. అందరు ఆడవాళ్ళలా ఈ పిల్ల హీరోయిన్ కావాలని రాలేదు. ఏదైనా ఫర్వాలేదు. ఇలాటి చిన్న ఆశల అమ్మా యిలను తను చూసుకోవచ్చు. ఆ అమ్మాయి ఏమీ అభ్యంతరం పెట్టలేదు. ఒళ్ళు దాచుకోకుండా పనిచేసే తత్వం. దానికి తగ్గట్లుగానే తన దగ్గర నడుచు కొంది. ఆ సమయంలో బిజీ అయి వెళ్ళి తనే రైటర్‌తో చెప్పడం మరిచిపోయాడు. రామదాసు కొంత తలతిక్క మనిషి కాబట్టి తన పబ్బం గడిచింది. లేకపోతే నిజానికి ఈ కంపెనీలోంచి ఉద్వాసన తనకు జరగాల్సి ఉండేది. అదృష్టం కలిసి వచ్చి ఏదో గండం గడిచింది.

వెయ్యి రూపాయల చెక్ చూశాక నాగరాజు బుర్ర చురుకుగా పనిచేయ నారంభించింది.

అందుకే - గదిలోకి తిరిగివచ్చాక సూర్యాన్ని మనసారా కౌగిలించు కొన్నాడు. "ఇది నా అదృష్టం గురూ గారూ! మీ కంపెనీలో మీ చలవవల్ల రైటరును కాగలిగాను. రేపు ఈ చెక్ మార్చాక ... పండగ చేసుకొందాం" అన్నాడు నాగరాజు.

సూర్యం తెల్లముఖంవేసినట్లు ఇదేమి టన్నట్లు చూశాడు. నాగరాజు అది అర్థం చేసుకుంటూ అన్నాడు- "పండ గంటే ఆ పండగ కాదు. లెక్కప్రకారం న్యాయంగా మీకు రావాల్సిన సగం ఇచ్చే స్తాను! ఈ సినిమాకు నాకు వచ్చింది అయిదొందలు. అందులో సగం మీకు. ఓకే ...?"

సూర్యం సమ్మతించాడు.

ఇనుము వేడిగా ఉండగానే దాన్ని తీర్చిదిద్దుకోవాలనే తత్వం నాగరాజుది. అందుకే ఆ సంపట్లోనే అన్నాడు- "ప్రొడ్యూసర్‌గారు కొత్త సినిమాకు కథ చూడమన్నారు. కథా, మాటలూ అన్నీ నావే అయితే బాగుంటుంది అన్నారు. ఇంక ఆ ప్రయత్నంలో ఉండాలి"




"కొట్టారు గురూ! ఛాన్సు అంటే మీదే! సినిమాకు కథేమిటండీ? ఏదో నాలుగు కథల్ని చదివి ఒక కథ తయారు చెయ్యండి చాలు! మొదటి సినిమా ఇది. కొత్తగా ఉండే ప్రయత్నాలేమీ చెయ్యొద్దు. మామూలు కథలైతేనే బెస్టు"

"కానీ....కథ మనసులో తయారైనా దాన్ని చెప్పడం కొంత కష్టం కదా"

"అదేమిటండీ-చిన్నప్పుడు కథలేమీ వినలేదూ! అనగనగా ఓ రాజు....అంటూ అలాగే చెప్పండిసార్ కథ. దాన్ని దర్శకుడు, ప్రొడ్యూసర్ కలిసి స్క్రీన్‌ప్లేగా చేస్తారు. ఆ తర్వాత మన మాటలు"

నాగరాజుకు కావాల్సిన సంగతులు ఏవీ ఇంతవరకూ తెలీలేదు. అయినా పట్టిన పట్టు విడవకూడదనే ధ్యాసతో అన్నాడు- "కథ ఒకటి రెడీగానే ఉంది. కానీ.... అది సినిమాకు పనికి వస్తుందో లేదో అదే తెలీటం లేదు"

సూర్యం నవ్వాడు - "గురూ! అపుడే పెద్ద రైటర్ అయినట్లుగా పోజు కొట్టేయకండి! మనం అంతా ఇంతే. కథ రెడీ అని అంటున్నారు. నిన్న రాత్రివరకు మీరు రైటర్ అవుతారని ఊహించే ఉండరు. మరి కథ ఎప్పుడు రెడీ చేశారు?''

నాగరాజు నవ్వాడు చిన్నగా. "సూర్యం! ఒక్క మాట చెప్తా. అసలు నేనెవర్నని నీ అభిప్రాయం? సినిమాల్లో రైటర్‌గా చేరాలనే వచ్చాను. కానీ ఎలా రాస్తారో తెలుసుకోవాలంటే, ఎవరు చెప్తారు చిట్కాలన్నీ? అందుకే రామదాసు గారి దగ్గర చేరాను. ఆయన నన్ను ఏపేరు పెట్టుకుని అయినా పిలవనీ! నేను మాత్రం ఆయనకు అసిస్టెంటుగానే పనిచేశాను. అందుకే ఎప్పటినుంచో మనసులో మెదులుతున్న కథ ఒకటి సిద్ధంగానే ఉంది అంటున్నాను" నాగరాజు అన్నది విని సూర్యానికి కొంత నమ్మకం కలిగింది.

నిజమే అయిఉండొచ్చు. లేకపోతే రెండు సీన్లు-అదీ బాబూరావుగారికి నచ్చేలా రాయడం కష్టం. ఆ పని నాగరాజు చేయగలిగాడంటే అతనికి కొంత ప్రతిభ స్వతహాగా ఉందన్న మాట! అయితే "ఒక పని చెయ్యండి సార్! ప్రొడ్యూసర్ గారితో కొన్ని రోజులు ఆగి చెప్పండి, కథ రెడీ అని. ఆయన డైరెక్టర్ గారి గురించి అప్పటికి నిర్ణయించుకొని ఉంటారు. డిస్కషన్‌లో ఎలాగోలా కథ అదే బాగుపడుతుంది. అంతవరకూ ఆ కథ గురించి కొంత ఆలోచిస్తూ ఉండండి"

సూర్యం ఇచ్చిన సలహా నాగరాజుకు నచ్చింది. కథ గురించి ఆలోచించాలని నాగరాజు నిర్ణయం తీసుకున్నాడు. కానీ ఆలోచించడం ఎలా?

ఇంతకాలం తలకాయ ఉన్నందుకు దాని పనంతా ఉబుసుపోక కబుర్లకే పరిమితం చేశాడు. కానీ ఇకపై...

ఎలా??

అన్నది నాగరాజును ఆవరించిన ప్రశ్న-వేధిస్తున్న సమస్య.




డబ్బుతో కొనలేనిది ఏదీలేదు అన్న జీవిత సత్యం గురించి నాగరాజుకు ఎవరూ

చెప్పనక్కర్లేదు. తన దగ్గర డబ్బు ఉంది. అయిదొందల రూపాయలు! సూర్యానికి అతని వాటా ఇచ్చేయగా మిగిలింది. ఆ అయిదొందలతో తాను తన ఆదాయానికి పునాది వేసుకోవాలి.

సినిమాకు కథ కావాలి! కొత్త కథ కావాలి! ఎక్కడా దొరికే వస్తువుకాదది. అయినా దాన్ని నాగరాజు కొన్నాడు.

సూర్యారావు వెళ్ళిపోయిన తర్వాత నాగరాజు చాలా సేపు ఆలోచించాడు- ఏం చేయాలా అని. ఉన్నట్లుండి ఫ్లాష్‌లా తట్టింది ఒక ఆలోచన!

మర్నాటి పేపర్లో ప్రముఖంగా వేయించాడొక ప్రకటన- "సినిమాకు కథ కావాలి. కొత్తగా చలనచిత్ర నిర్మాణం చేపడుతున్న ఒక సంస్థకు కొత్తరకం కథ కావలెను. ఉత్సాహవంతులైనవారు సంప్రదించండి!" అంటూ అడ్రసు ఇచ్చాడు.

అనుకొన్న రోజున ఓ అయిదారు మంది రానేవచ్చారు. అందులో ఒకరిద్దరు పేరు ప్రఖ్యాతులున్నవాళ్ళు కూడానూ! సినిమా ఎంత గొప్ప ఫీల్డ్. ఎలాటి వాళ్ళనైనా ఆకర్షించగలిగే శక్తి ఈ రంగానికి ఉంది. లేకపోతే ఇలాటి ప్రముఖులు రావటం ఏమిటి తను వేసిన ప్రకటనను చూసి! నాగరాజుకు నవ్వొచ్చింది.

కాఫీ తాగేవారికి కాఫీ, డ్రింక్స్ తాగే వారికి డ్రింక్స్-అన్నీ సిద్ధం చేశాడు. వచ్చేవారు చెప్పేకథల్లో మంచి పాయింట్స్ గుర్తుంచుకోనారంభించాడు. అంతా విని 'సారీ అండీ! మేం కొత్త రకం కథ అని వేయనే వేశాం కదా! ఇలాటి కథలతో, ఇలాటి సంఘటనలతోనే ఇప్పటికే ఎన్నో కథలు వచ్చాయికదా! ఏమీ అనుకోకండి. వచ్చేసారి వీలైతే మళ్ళీ పిలిపిస్తాం! అపుడు వచ్చే ప్రొడక్షన్‌కు మీ కథ ఆలోచిస్తాం!' అనో, కాకపోతే-'అబ్బో! కథ చాలా అద్భుతంగా ఉంది. ఎటొచ్చీ ఇలాటి కథను భారీగానే తీయాలి తప్ప ఇలాటి బడ్జెట్‌తో తీయకూడదు. ఇపుడు మేము బడ్జెట్ పిక్చర్‌ను తీయాలను కొన్నాం గనుక, నెక్స్ట్ టైం మీ కథ గురించి ఆలోచిస్తాం!' అనో చెప్పి పంపేసాడు.

నాగరాజు ఇచ్చిన ట్రీట్‌మెంట్‌కు, అతని అతిథి సత్కారాలకు అప్పటికే పొంగిపోయే కథారచయితలు 'కనీసం వచ్చే చిత్రానికైనా అంగీకరిస్తున్నారు కదా' అనే ఉద్దేశంతో బయటపడేవారు.

నాలుగు కథలు విని, మరో నాలుగు పుస్తకాలు చదివి, ఇంకో అయిదు సినిమాలు చూసి ఆఖరికి నాగరాజు ఒక సినిమా కథను తయారుచేశాడు. ఇక ఎటొచ్చీ డైరెక్టర్, ప్రొడ్యూసర్ల చేర్పులు మార్పులు విని, అవి చేసుకొని ఇక మాటలు రాయటమే మిగిలింది!

'ఎప్పటికయ్యేది ప్రస్తుతము' అనే తత్వం అలవాటు చేసుకోవటంలో తొలి మెట్లు విజయవంతంగా అధిరోహించేశాడు నాగరాజు!

ఆ రోజు రాత్రే నాగరాజు సూర్యాన్ని పిలిచి పండగ చేశాడు. పండగ అంటే మరేమీలేదు- పది సీసాలు, ఇరవై కోళ్ళు అనే లెక్క! సూర్యారావు తనకు జరిగిన ఆ అపూర్వ పానాభిషేకానికి పులకించిపోయాడు. జీవితంలో అంతక్రితం ఎవరూ అతన్ని అంత ఆప్యాయంగా కానీ, అంత ఘనంగా కానీ సన్మానించిన పాపానపోలేదు.

మందు తలకెక్కిపోయాక సూర్యం

 

నాగరాజు అడగని వరాలు ఎన్నో దానం చేశాడు. 'మీకెందుకు, ఇంక చూసుకోండి. రామదాసు పని అయిపోయింది. ఆయన స్థానం మీదే' అన్నాడు. 'ఈ సినిమా ఫీల్డులో ఏముందండీ! అంతా మౌత్ పబ్లిసిటీయేగదా!' అన్నాడు. 'మీకెందుకు ఇంక, అన్నీ నేను చూసుకొంటా' నన్నాడు. అవన్నీ ఏదో తలతిక్క మాటలని నాగరాజు మొదట్లో అనుకొన్నాడు కానీ...

కానీ—

ఓగంట తర్వాత 'ఇపుడే వస్తా'నంటూ సూర్యారావు బయటకు వెళ్ళిపోయాడు. 'గురుడు పడిపోయాడు!' అనుకొంటూ నాగరాజు బోలెడంత ధైర్యం తెచ్చుకొన్నాడు. తనకథ ఎలాగైనా ఉండనీ ఆ క్షణాల్లో. తను తన కథను రాంబాబు గారికి చెప్పేటపుడు ఒకరిద్దరు వంది మాగధులు అక్కడ వుండటం ఎంతైనా మంచిది! తనుచెప్పే సంఘటనకు 'ఓహో' అనేవారు ఒకరైతే, 'ఆహా' అనేవారు మరొకరు ఉండటం అవసరం. దీనివల్ల కథకు లేని 'హంగు' సమకూరుతుంది. పైగా వాళ్ళు తెలిసోతెలియకో చెప్పే సంఘటనలు కథకు పనికొస్తాయి. ఇలాటి సూర్యంగాడిని ఒక్కడిని వల్లోవేసుకుంటే కథకువచ్చే గతుకుల్ని సరిచేసుకొంటాడు, తన పద్ధతిని సరిచేస్తూ ఉంటాడు. అంత కన్నా ఇంకేమికావాలి.

గంట క్రితం వెళ్ళిన సూర్యం గడియారం ముళ్ళు అరవై నిమిషాల కాలం గడిచిందని చెప్పేసరికి తిరిగి వచ్చేశాడు. వస్తూ ఒక్కడూ రాలేదు. కూడా ఓ అందాల బొమ్మను తెచ్చాడు.

నాగరాజుకు అంతా అర్థమయింది. సూర్యం ఋణం ఉంచుకొనేమనిషి కాదన్న మాట! తనకు తోచినరీతిలో, తనకు వీలైన రీతిలో ఎప్పటికప్పుడు అక్కౌంట్స్ సెటిల్ చేస్తాడన్న మాట! ఇలాటివాడు ఉండటం ఒకందుకు మంచిదే!

సూర్యానికి థాంక్స్‌చెప్పి, నాగరాజు గదితలుపు వేసుకున్నాడు.

"మీరు సినిమా తీస్తున్నారంటగదా!" అంది ఆ పిల్ల.

నాగరాజుకు తల తిరిగిపోయింది. ఆ పిల్ల ఏ స్థాయిదో అర్థం అయిపోయింది. ఆ పిల్లకు కావాల్సింది సినిమాఛాన్సు. ఆ ఛాన్సు ఏ రూపంలో ఉన్నా పర్వాలేదు. కానీ ఛాన్సుమాత్రం కావాలి. దానికోసం ఏదైనా ఇచ్చేందుకు, పోనీ సినిమాభాషలో చెప్పాలంటే త్యాగంచేసేందుకు సిద్ధంగా వుంది.

"అనుకొంటున్నాం" అన్నాడు నాగరాజు ముక్తసరిగా.

"అనుకొన్నారంటే తీసినట్లే లెక్క! మరి నన్నుంచుకొంటారా దాంట్లో?"

ఏ బెరుకూలేదు. ఏ కొత్తదనమూ లేదు ఏ సిగ్గూలేదు. వ్యవహారం సూటిగా తనకు కావల్సిన రీతిలోనే నడిపించుకుంటోందా పిల్ల.

నాగరాజుకు చికాకు వచ్చింది. ఆ పిల్లను పంపేద్దామా అనుకొన్నాడు. కానీ అప్పటికిఅప్పుడు ఆరేడు నెలలు గడిచిపోయాయి-ఆడపొందు లేక. అంతక్రితం అయితే పంచాయితీ కచేరీనుంచి రావటం ఏమిటి, ఆబగా కుసుమను ఆక్రమించటం ఏమిటి? ఏదో ఆనవాయితీగా సాగిపోయే మొక్కులా వుండేది – ఆ కార్యక్రమం అంతా ఒక్కరోజు కూడా నాగా లేకుండా!

ఇంట్లోంచి వచ్చేశాక అక్కడ తల కొట్టేసిన మొండెపు బతుకు నడపలేక ఇక్కడికిచేరాక బతుకు మలుపులు తిరుగుతోంది. జీవితాన్ని ఒక స్థిరమైన దారిలోకి

తెచ్చుకోకముందే ఆడగాలికి అలవాటు పడటం మంచిదికాదనే అనుమానం సందేహం ఉన్నా, ఇపుడు పక్కనేవున్న పిల్లగాలి తగులుతోంటే కాదనుకోలేక పోయాడు.

మనసులో కుసుమతలెత్తి తిరుగుబాటు చేస్తున్నా, కుసుమను పక్కకుజరిపి పక్కనే ఉన్న పిల్లపై దృష్టి నిలిపాడు.

"నాకు వేషం ఇస్తున్నావా లేదా?" మళ్ళీఅడిగింది ఆ పిల్ల.

"నీ పేరేమిటి?" అనడిగాడు నాగరాజు నెమ్మదిగా రంగంలోకి దిగుతూ.

"ధనలక్ష్మి"

"బాగుంది నీ పేరు!"

"పేరు బాగుంటకపోతే మాత్రమేంలే! కావాలంటే పేరు వేరేది ఎట్టుకొంటాను. కానీ వేషం ఇస్తున్నావాలేదా?"

క్షణం ఆగాడు నాగరాజు. ఆ పిల్లకేసి పరిశీలనగాచూశాడు. ఇరవైలోపుఉంటుంది వయసు. ఆ వయసులో ఉండేపిల్లకు ఉండాల్సిన అందాలు, వంకాలు, పొంకాలు అన్నీ ఉన్నాయి. ఎటొచ్చీ భాషఒకటి కొంచెం మార్చుకోవాలి. ఆ అవసరమూ ఉండదు. అసలు మాటలులేని వేషం ఇస్తే? ఏదో ఒక సీన్లో ఎక్కడో ఎక్స్ట్రాలా ఉండ మంటే దానికి అదే పదివేలు. అయినా ఇప్పుడ్ని ఆరోజు తనసినిమా మొదలయ్యే రోజున ఆలోచించుకోవచ్చు. అప్పటి సంగతి ఇప్పుడు ఆలోచిస్తూ కాలం వృథా చేయటం తెలివితక్కువతనం. పైగా ఇలాటి వాళ్ళతో వ్యవహారాలు అన్నీ ఎంత గుట్టుగా, ఎంత త్వరగా తెమిలిపోతే అంత మంచిది. పొరపాటున తనీ వ్యవహారంలో ఉండగా ఏ రాంబాబుగారో వస్తే కథ అడ్డంతిరుగుతుంది. చేతికిఅందినది...పోతే





అందనున్న అపరంజి పాత్ర ముక్కలు అవుతుంది.

నాగరాజు ఇంక సమయాన్ని వృథా చేయదల్చుకోలేదు.

"ఇంకా ప్రొడ్యూసర్ గారితో మాట్లాడాలికదా!" అన్నాడు నాగరాజు.

"కథకూడా మీదేనంటగదా! సూర్యం గారు చెప్పారు. నాకో సెకండ్ హీరోయిన్ రోలయినా...."

'అమ్మ దీని సిగతెగగొయ్య' అనుకున్నాడు. అన్ని వివరాలు సేకరించే వచ్చింవన్నమాట.

"నేనేనసుకో. కానీ..." అంటుండగానే ఆ పిల్ల ధనలక్ష్మి ఉలిక్కిపడి చూసింది.

"కానీ గీనీ కుదరు. వేషం ఇస్తానంటే దేనికైనా... లేకపోతేలేదు"

"సర్లే" అన్నాడు నాగరాజు ఆ క్షణానికి అది తప్పుకునే ఊహలో.

ధనలక్ష్మి చిన్నగా నవ్వింది. నేసింత రెడీ అన్నట్లుగా చూసింది.

నాగరాజు ధనలక్ష్మిమీద చెయ్యి వేశాడు. తనలో ఇది రెండో పతనం. తనకే తెలుస్తోంది ఆ సంగతి. ఊళ్ళో ఉండగా ఎపుడూ తాను 'మందు' కొట్టిన పాపాన పోలేదు. తనకున్న పెద్ద దుర్వ్యసనం అల్లా పేకాడటం-రాత్రీపగలు తేడా లేకుండా పేకాడటం. కాని ఇపుడు ఇక్కడకొచ్చాక మందుకొట్టాడు. ఇపుడు ఇంకో మెట్టుదాటి మగువ దగ్గరికి చేరాడు. సినిమాలంటే ఇంతేననీ, ఈ పరిశ్రమలో పడికట్టుకుని ఉండటం అసాధ్యమనీ అనుకొనేందుకు క్షణం ప్రయత్నించాడు. కాని వీలుకాలేదు. ఎక్కడో మనసు పొరల్లోంచి కుసుమ అడ్డొస్తోనే ఉంది. ఒక్కక్షణం ఓపికపట్టి కుసుమ గురించిన ఆలోచన పీకనొకసారి నొక్కి, తన మనసునొకసారి హత్యచేసి, ధనలక్ష్మి

వైపు మళ్ళాడు నాగరాజు

* * *

నాగరాజుకు పట్టపగ్గాలు లేనంత సంతోషంగా ఉంది జీవితంలో అనుకోని మలుపు తిరిగి అందలం ఎక్కే అవకాశం లభిస్తోంది. దీన్ని వదులుకోకూడదు. కానీ ఏంచేయాలో తోచనిస్థితి ఏర్పడిపోయింది. తను అనుకున్న కథంతా దాదాపు సిద్ధం. కానీ అది సినిమాకు పనికివస్తుందో రాదో అర్థంకావటంలేదు. రాంబాబుగారికి 'కథ' అంటూ వినిపించేముందొకసారి తానే ఎవరైనా పెద్దలకు చూపిస్తే వారు ఇచ్చే సలహాలు, సూచనలు తీసుకుని మరీ అపుడు వెళ్ళొచ్చు రాంబాబుగారి దగ్గరికి. ఆలస్యంగా తట్టినా మంచి ఊహే తట్టిం దనుకున్నాడు నాగరాజు

ఆ రోజు రాత్రే రామదాసుగార్ని కలుసుకున్నాడు. ఆయన నాగరాజును ఆప్యాయంగా ఆహ్వానించాడు.

"ఆరోజు అలా వచ్చేసారేమండీ!" అనడిగాడు నాగరాజు ముందు ప్రశ్నలకు ఉపోద్ఘాతంలాగ.

రామదాసు నవ్వాడు. ఏమీ జవాబు ఇవ్వలేదు.

నాగరాజే కొంచెం ధైర్యం తెచ్చుకుని మళ్ళీ అన్నాడు "మీరు నాకన్నా పెద్దవారు. అనుభవజ్ఞులు. అన్నీ తెలిసినవారు. నేను మీకు సలహాలు ఇచ్చేంత యోగ్యత ఉన్నవాడినికాను. అయినా మీరేమీ అను కోనంటే ఒక్కమాట చెప్తాను"

''చెప్పండి"

''ఎలా చెప్పటమా అని ఆలోచిస్తు న్నాను. చెప్పానుకదా–నేను ఇలా అనటం కానీ, ఇలా చేయటంకానీ తప్పు అయితే క్షమించండి" అన్నాడు నాగరాజు మళ్ళీ.

"చెప్పమన్నానుకదా"

''ఆరోజు మీరు వచ్చేసాక నేను రాంబాబుగారి దగ్గరకు వెళ్ళాను. ఏదో కోపంలో రామదాసుగారు అలా అన్నారు కానీ నిజానికి అలాఅనే తత్వం కాదని నిజం చెప్పేశాను! కవిగారంటే ఏమిటి, కథా, మాటలు, పాటలు అన్నీ ఎడమచేత్తో రాయగల సమర్థులు. ఎటొచ్చీ ఆయనకు ఆ క్షణంలో మూడ్‌లేదు. మీరొచ్చి మీ సీన్స్ ఇవ్వమనటం భావ్యంగాదని చెప్పి చూశాను''

నాగరాజు చెపుతున్నది వింటూంటే రామదాసుకు చిత్రంగా అనిపించింది. కథ కొత్తగా వినిపిస్తోంది. తానుచూసిన దృశ్యమేఅయినా ఇపుడు కొత్తగా కని పిస్తోంది.

"ఏమన్నారు?''

"ఏమంటారు చెప్పండి ? అసలు ఆయన రాంబాబుగారే కానక్కరలేదు, ఎవరయినాసరే సరిగ్గా చెపితే అర్థంచేసు కొంటారనేది నిజం! నేను ఆ ప్రయత్నమే చేశాను. ఫలితం దక్కింది!''

"అంటే?''

''అంటే ఏముందండీ! ఆరోజు రాత్రి నేను ఆ సీన్స్ రెండూ రాసిచ్చాను! మీరు బిజీగా ఉన్నారని చెప్పి, ఆ కంగారులో ఆయన ఏమన్నా పట్టించుకోవద్దని చెప్పి మరీ నేనే ఆ పనికి అటెండ్ అయ్యాను. నా అదృష్టమో, మీ ఆశీర్వాదమో గానీ సీన్స్‌రెండూ బాగావచ్చాయి! రాంబాబు గారికి నచ్చాయి. పనిజరిగింది. ఆయనకదే సంతోషం! మీకు మాట రాకుండా పని జరపగలిగాను. నాకదే సంతోషం''

రామదాసుకు నమ్మబుద్ధికాలేదు. రాంబాబుగారు అంతగా ఇంప్రెస్ అయ్యారా నాగరాజు చెప్పింది విని!

''మీకు ఇంకో సంగతి చెప్పాలనీ

వచ్చాను నేను. మీరు ఏమంటారో కూడా ఆలోచించకుండానే, నా అంతట నేనే మీ తరఫున మాట ఇచ్చేశాను—వారి వచ్చే సినిమాకు కూడా మీరే పనిచేస్తారని''

''నేనా?''

''అవునండీ! అసలు మీరే చెప్పాల్సిన మాట అది! కాని మీరేమో కోపంగా వచ్చేశారు. దాంతో ఇక లాభం లేదనుకొని మీ తరఫున నేనే ఊ అనేశాను. కొత్త ప్రొడక్షన్ గురించి రాంబాబుగారు మాట్లాడుతోంటే, నేనే అడిగాను రైటర్ ఎవరని ఆయన ఆ విషయమే ఏం చెయ్యాలో తోచటంలేదని అన్నారు. అపుడు నేనే కలుగజేసుకొని చెప్పాను. మీరుండగా ఇంకోరు రాయటం తగదని!''

రామదాసుకు తమాషాగా అనిపించింది. చేతిలోంచి జారిపోయిందనుకొన్న మణి పూస మళ్ళీ చేజిక్కుతున్నట్లు అనిపించింది. అసలు ఆ ప్రొడక్షన్, ఆ బానర్ తనవే! తనుకాకుండా ఆ బానర్‌కు వేరే రైటర్ రాయటం అంటే తను జీవితంలో ఎంతో కోల్పోయినట్లే లెక్క!

మనసులో మాట పైకి అన్నాడు రామదాసు – ''నాగరాజు గ్గారూ! చాలా థాంక్సండీ! ఆవేళ నేనే అనుకున్నాను పొరబాటు జరిగిపోయిందని! అంతగా పట్టు పట్టకుండా ఉండాల్సింది. కానీ ఏదో గ్రహపాటు, తొందరపడ్డాను''

''పోన్లెండి అంతా సర్దుబాటు చేసేశా కదా! ఇక మిగిలిందంతా ఒకటే. అన్నట్లు ఇంకోటి! మీరు నాకు చెప్పకుండా మాత్రం రాంబాబుగారితో ఈ ప్రసక్తి తేవద్దు. అన్నీ నేనే సర్దుకొస్తాను! సరేనా?''

''అలాగేకానీ. ఇందులో కొంప మునిగేది ఏముంది?'' అన్నాడు రామదాసు.

నాగరాజు నిట్టూర్చుతూ అన్నాడు

 

"అమ్మయ్య. మీరు ఏమంటారోనన్న భయంతో సగం చచ్చిపోయాను నేను. ఇపుడు కొంచెం శాంతిగా ఉంది మనసుకు. బతికిపోయాను''

రామదాసు నవ్వుతూ అన్నాడు. ''ఇందులో అంత అనుకోవల్సింది ఏముంది ? నా బదులుగా నా పనిని చేసి పెట్టారు. నిజానికి నేనే ఋణపడి ఉన్నాను మీకు''

నాగరాజు నవ్వేశాడు "ఇందులో ఋణాలవరకు వెళ్ళాల్సింది లేదులెండి! అన్నట్లు చెప్పుతూ మర్చిపోయాను. కొంచెం చనువు తీసుకొని చేసిన పనే అనుకోండి ఇది! రాంబాబుగారు అడిగారు కదా,అన్నారు కదా అని ధైర్యం చేసి కొత్తసినిమాకు కథ ఒకటి సిద్ధంచేశాను. అఫ్‌కోర్స్. మీ పేరుమీదనే అనుకోండి, మీరూ విని ఊ కొడితే ఆతర్వాత రాంబాబుగారికి మీ కథగానే చెప్పి..ఓ.కే. చేయించుకొందాం!"

రామదాసు నాగరాజు అన్నది విని ఈసారి నిర్ఘాంతపోయాడు ! ఏమిటీ, తనకు ఘోస్ట్‌రైటర్ కూడానా?

నవ్వు వచ్చింది, నాగరాజు చిన్నతనానికి!

"కథ చెప్పండి, బాగుందేమో చూద్దాం! బాగుంటే మాత్రం అది మీ పేరు మీదే వేయిద్దాం! మీ కథ అది. మీ పేరు మీద రావటమే సమంజసం. పైగా కృషి మీదైతే, ఫలితం నాది కావటం నాకు సరిపడని పద్ధతి ! ఇలా అంటున్నానని ఏమీ అనుకోవద్దు! నా పద్ధతి అది! కొత్తవారని రాంబాబుగారు ఏమైనా అంటారని అనుకోవద్దు. ఆయనతో నేను చెప్పి అన్నీ సరిచేస్తాను"

నాగరాజు నివ్వెరపోయాడు. క్షణంలో

తేరుకొంటూ అన్నాడు- "సర్లెండి! మీరన్నట్లే చేద్దాం. కానీ, మొదట ఏంటే.."

"చెప్పండి!" అన్నాడు రామదాసు.

నాగరాజుకథ చెప్పటం ఆరంభించాడు. అంతక్రితం తను సిద్ధం చేసుకొన్న కథ, దానికి ప్రఖ్యాత రచయితలు అందించిన మెరుగులతో, దానికి మరింత పాతకాలపు సినిమాల కథలలోని మంచిని కొంత కోడించి...కథ పూర్తి చేశాడు.

కథ అంతా వినేంతవరకు రామదాసు ఏమీ అనలేదు. కథ పూర్తి అయ్యాక మాత్రం క్షణం ఆగి అన్నాడు-"మీరు ఫీల్డుకు కొత్త. కనుక ఏదో కొత్త కథ చెప్తారనుకొన్నాను! మీరు చెప్పింది చాలా పాత చింతకాయ పచ్చడి కథ"

నాగరాజు ముఖం వివర్ణమయింది.

అది రామదాసు గుర్తిస్తూ అన్నాడు. "ఇలా అన్నానని ఏమీ బాధపడొద్దు. మనం రాసిన కథ ఏదైనా అది మనకు బాగానే అనిపిస్తుంది. కాకిపిల్ల కాకికి ముద్దు అని కదూ అన్నారు! ఇదీ అంతే! అయితే మన కథను రేపు కోట్లమంది ప్రజలు చూస్తారు. వాళ్ళకు ఈ కథ ఎలా నచ్చుతుందనే అంశం గుర్తు పెట్టుకోవాలి మనం! మనం ఇదే కథను తెర మీద చూస్తే మనకు ఏం అనిపిస్తుందని అనుకోవాలి! క్షణక్షణం ప్రశ్నించుకొంటూపోవాలి! ఏ ప్రశ్నకైనా మనకే నచ్చని జవాబు వస్తే అపుడు మళ్ళీ కథ ఆలోచించుకోవాలి! అన్ని ప్రశ్నలకు సంతృప్తి ఇచ్చే సమాధానం ఇచ్చుకో గలిగితే అపుడా కథ మనకే కాదు, ఇతరులకూ నచ్చుతుంది! ఇది మీరు నేర్చుకోవాల్సిన మొదటి పాఠం" నవ్వుతూ అన్నాడు రామదాసు.

"అయితే... మరి..." ఆగిపోయాడు నాగరాజు. అప్పటికే అతని విశ్వాసం బాగా దెబ్బతినేసింది. అయినా అదృష్ట వంతుడు తను! ఏకంగా ఈ కథను ఇలాగే రాంబాబుగారికి వినిపించకుండా ఇక్కడికి తెచ్చాడు. ఇదీ ఒకందుకు మేలే! ఇక్కడీ కథకు పదునుపెట్టి ఆ తర్వాత తీసుకెడితే మరీ మంచిది! తనకు ఏదో కథ అల్లడం వచ్చిందేకానీ, దానికి సానపట్టటం రాలేదు. అదీ నేర్చుకొని వెళ్ళటం మంచిది. ఇపుడు తన కథలో లోపాలు తెలిసి, వాటిని ఇక్కడే సరిదిద్దు కొంటే కథ మరెన్ని అందాలు సంతరించు కొంటుంది కథ మరింత పట్టుతో వస్తుంది.

"మీ కథలో ప్రతిపాత్రా సజీవంగా ఉందా అని ఆలోచించండి! ఏ పాత్రలో సజీవమైన లక్షణం ఉండదో ఆ పాత్రకు నిండుదనం ఉండదన్నమాట! ఏ పాత్ర అయినాసరే నిజజీవితంలో మీరు, నేను ఎలా ప్రవర్తిస్తామో అలా ప్రవర్తిస్తు న్నాయో లేదోనని ఆలోచించండి. మీకు సరేనని జవాబు వస్తే మీరు ముందు కెళ్ళచ్చు! ఇది రెండో భాగం. అంటే- మొదట కథ నిండుగా ఉండాలి. రెండు- పాత్రలు సజీవంగా ఉండాలి"

నాగరాజు అన్నిటినీ బుర్రలోకి ఎక్కించుకొంటున్నాడు. నేర్చుకొంటున్న వాటి విలువ తెలుస్తోంది. వీటిని అశ్రద్ధ చేస్తే ఇక జీవితంలో ముందుకుపోయే అవకాశాలు ఉండవు. లభించే బంగారు జీవితాన్ని చేజేతులా నాశనం చేసుకోకూడదని నాగరాజు నిర్ణయించుకొన్నాడు.

"ఇక తర్వాత అంశం-కథ పూర్తయింది కదా, పాత్రలన్నీ సిద్ధంగదా. వీటిలో ఏ పాత్ర అయినా గతంలో వచ్చిన ఏ సినిమా





లోని పాత్రకైనా దగ్గర పోలికల్లో ఉందేమో చూడండి! మీ సినిమాకథ విన్న వాళ్ళకు పాత కథలేమైనా గుర్తుకొచ్చాయంటే అపుడు మీరు ఫెయిలయినట్లే లెక్క. అలా దెబ్బతినేయకూడదు కథ. అందుకే చెప్పేది అన్ని అంశాలూ సరిజూసుకొని ముందుకువెళ్ళాలి. అంతా రెడీ అయ్యాక అపుడుచెయ్యాల్సినపని-సింగిల్ లైన్‌లో కథ రాయటం! అంటేతెరమీద కథ ఏ అంశం తర్వాత ఏ అంశం చెప్తున్నాం అనేదిదృష్టిలోఉంచుకొనిరాసేదన్న మాట. మొదట ఏ అంశం చెప్తాం, తర్వాత ఏం అంశం చెప్తాం అవన్నీ వరుసలో రావాలి. మీరు ఎక్కడ ఏ రకమైన సస్పెన్స్ ఉంచుతున్నారు-ఎక్కడ ఏ రకమైన థ్రిల్ పెడుతున్నారు. అన్నీ ఇక్కడే చూసుకోవాలి! ఇదయ్యాక మీ కథ అవుట్‌లైన్స్‌తో సిద్ధం అన్నమాట. ఈ స్టేజిలో కథ చదివితే మనకు సీన్స్ ఎక్కడ పడేదీ తెలిసిపోతుంది! ఇదయ్యాక నెక్స్ట్ స్టెప్-కథను స్క్రీన్‌ప్లేకు సిద్ధం చెయ్యటం. సన్నివేశాల కూర్పు అన్నమాట. దీంట్లోనే అంతా ప్రాణంవుంటుంది సినిమాకు. ఇది సరిగ్గా లేకపోతే ఇటు కథ, అటు సినిమా కూడా దెబ్బతినేస్తాయి గుర్తుంచుకోండి"

రామదాసు చెప్తున్న ఏ అంశాన్నీ నాగరాజు మర్చిపోవటం లేదు. ఒక్కోదాన్నీ పదిలంగా హృదయంలో దాచుకొంటున్నాడు.

అలా చెప్పాల్సినదంతా చెప్పాడు రామదాసు.

నాగరాజుకు సినిమాకథ అంటే ఇన్ని జాగ్రత్తలు తీసుకోవాలని తెలీదు.

ఇప్పటి సినిమాలనుచూస్తోంటే అవన్నీ ప్రొడ్యూసరో, ఆయన బామ్మరిదో రాసిన కథల తాలూకులానే కనిపిస్తున్నాయి. కానీ వాటివెనుక ఇంత కృషీ, ఇంత కష్టమూ ఉందని తోచటంలేదు

అదే అనేశాడు నాగరాజు.

రామదాసు నవ్వాడు. "ఎదుటివారు చెప్పేకథ ఎలాఉంటోంది అని ఆలోచించకూడదు మనం! మనం చెప్పేది ఎలా ఉంటోంది అని ఆలోచించటమే అవసరం. మన ఆలోచనలన్నీ ఎదుటివారి కంటే ముందున ఉన్నంతకాలమూ మనదేగెలుపు. కాకుంటే... పాతకథల పుట్టలాగ నిల్చిపోయి, స్థిరంగా ఒకేచోట ఉండిపోతాం మనం"

నాగరాజు అంతా విని రామదాసుకు కృతజ్ఞతలు చెప్పాడు మనస్ఫూర్తిగానే.

రామదాసు వాటిని నవ్వుతూ స్వీకరించాడు. నాగరాజు వెళ్ళిపోతోంటే వెనక్కి పిలిచాడు రామదాసు. "నాగరాజుగారూ! ఒక్క విషయం చెప్దామని వెనక్కి పిలిచాను. ఇందాక మీరన్నారు-ఈ కథ నా పేరుతో చలామణీ చేయిస్తానని! ఒకటి-అలాటిది వద్దు. అది నాకు ఇష్టం వుండదు. ఇక రెండోది ఇపుడీకథ మీది. కాబట్టి దీని మీద మీకు హక్కుఉండటమే సరైంది! పోతే ఆకర్న చెప్తున్నా-ముందే చెప్పాల్సిన విషయం ఇది. రాంబాబుగారి దగ్గర నా గురించి చెప్తానన్నారు. ఇపుడు వెళ్ళి మీరే చెప్పండి-ఆ ఛాన్సు నాకువద్దని! ఒకసారి ఒకరితో గొడవపడ్డాక మళ్ళీ వారిదగ్గర పనిచేయటం బాగుండదనిపిస్తోంది నాకు. గతంలో ఎపుడూ ఇలాటి అనుభవంలేదు. కాబట్టి ఇంత ఆలోచించాను. ఎంత ఆలోచించినా ఇపుడు నేను తీసుకొన్నది సరైన నిర్ణయమని నా నమ్మకం"

"అంటే మీరు రాంబాబుగారికి..."

రామదాసు నాగరాజు అంటున్నదాన్ని కట్‌చేస్తూ అన్నాడు "అంతే! పోతే,

మరోసలహా-వీలైతే రాంబాబుగార్ని మీకే ఈ ఛాన్సు ఇమ్మని అడగండి! బహుశా ఆయన ఇస్తారనే నా నమ్మకం"

నాగరాజు ఉలిక్కిపడ్డాడు.

కొంపదీసి రామదాసు తను ఆవలించకముందే పేగుల్ని లెక్క పెట్టేయలేదు కదా అనుకొన్నాడు.

ఆతర్వాత ఆ ఆలోచన మనసులోకి వచ్చినతర్వాత నాగరాజు ఇంక అక్కడ ఎక్కువసేపు ఉండలేకపోయాడు.




రాంబాబుగారికి కథ నచ్చటం నాగరాజుకు ఆశ్చర్యాన్ని కలిగించలేదు. ఒక వేళ కథ నచ్చలేదని రాంబాబుగారు అని ఉంటేనే నాగరాజు ఆశ్చర్యపోయి ఉండేవాడు.

ఎంత కష్టపడ్డాడని తను! ఒక్కళ్ళా ఇద్దరా? ఎందరు...ఎందర్ని అడిగాడు? ఎందరితో కథ డిస్కస్ చేశాడు? ఎందరు చెప్పిన మలుపుల్ని, విరుపుల్ని దృష్టిలో ఉంచుకొని మరీ ముందుకెళ్లాడు? మరింక లోటెక్కడ ఉంటుంది కథకు! పైగా... ఆఖరికి తను రామదాసుగార్ని సైతం అడిగాడు. నిజం చెప్పుకోవాలంటే ఈ కథకు అందాలన్నీ రామదాసుగారి చెయ్యిపడ్డాకే వచ్చాయి. ఏదైతేనేం, కథ తనది, మాటలు తనవి. ఇంక అంతకన్నా కావాల్సింది ఏముంది! వెండితెరమీద అచ్చంగా అక్షరాలతో తన పేరే పడుతుంది- 'కథ, మాటలు-నాగరాజు' అని.

జీవితంలో ఎన్నో మెట్లు చాలామంది కన్నా ముందే అధిరోహించగలిగాడు తను!

గెలుస్తున్నాడు తను. అదృష్టం తనను అందలం ఎక్కిస్తోంది. తను అలా ఆ అదృష్టం ఆసరాతో అలా ఎక్కి ఎక్కి తారల మధ్యన నిలుస్తాడు! అదే తన లక్ష్యం. జీవితంలో సాధించాల్సింది అదే- ఆకాశంలో తనకో ప్రత్యేక స్థానం!

అయినా జీవితం ఎంత చిత్రంగా మారిపోతోంది. రెండేళ్ళ క్రితం ఎవరైనా తనతో 'నువ్వో సినిమా రచయితవు అవుతావు' అని అంటే పకాలున నవ్వేవాడు తను. కానీ ఇపుడో..? అదే నిజమయింది!

కాలవ ఒడ్డునో, పంచాయితీ అరుగుల మీదో పేకాడుతూ కాలం గడపాల్సిన తను ఇపుడు అక్షరాలను పదును పెడుతూ. వాటిని అటూ ఇటూ పేరుస్తూ, వాటికి కొత్త అందాలు చేర్చుతూ... ఓహ్, ఎంత బాగుందో కథారచన! అయినా ఇది ఇంత తేలికా? ఏం కష్టపడ్డాడని తను! ఓ రెండు పాత్రల్ని మనసులో అనుకొన్నాడు- అవయినా ఆ రోజు ఇంటర్వ్యూ అంటే వచ్చి ఇచ్చిన రచయితలవే! వాటికి కొంత మాంసం, మరికొంత రక్తం చేర్చి ఇచ్చారు మిగిలినవారు-ముఖ్యంగా రామదాసుగారు. జీవితంలో రామదాసుగారి మేలు మాత్రం మర్చిపోకూడదు! ఏదెటు పోయినా, తనెంత ఎత్తుకు ఎదిగినా రామదాసుగారి ఎడల మాత్రం కృతజ్ఞతతోనే ఉండితీరాలి!

రాంబాబుగారు కథ ఓకే చేశాక, 'ఇక మీదే ఆలస్యం' అని చెప్పారు




డైరెక్టర్ నారాయణగారితో.

నారాయణగారు అప్పటికే ఇరవై సినిమాల్ని తెలుగు ప్రేక్షకులకు అందించారు. ఇరవై అంటే ఇరవయ్యీ కాకపోయినా వాటిలో చాలావరకు ప్రేక్షకుల మన్ననల్ని అందుకొన్నాయి. అందుకే ఆయనకు ధైర్యం. రాంబాబుగారి ప్రొడక్షన్, తన దర్శకత్వం ... సినిమాహిట్ కావాలంటే ఇది చాలు. కానీ దీనికితోడు ఇందిరను, బాబూరావును బుక్ చేసుకొంటే హీరోయిన్‌గా ఆవిడకూ, హీరోగా బాబూరావుకూ ఉన్న గ్లామర్‌తో సినిమా సూపర్ హిట్ అవ్వాలి. ఏటొచ్చీ కథ కొత్తరచయితదిట! అయినా ఉన్నంతలో మలుపులూ, ఛెళుకులూ అన్నీ బాగానే ఉన్నాయి. నారాయణగారు సంతృప్తి చెందారు.

స్క్రిప్టు వర్క్ పూర్తిచేసే యజ్ఞం రోజూ జరుగుతోంది. పగలంతా డిస్కషన్ స్టోరీ గురించి, నిన్న రాసిన సన్నివేశాలలో మాటల గురించి!

ఇదంతా పరీక్షలాగ అనిపించింది నాగరాజుకు. నెగ్గటం కష్టంగానూ తోచింది. కానీ నెగ్గకపోతే ఎలా అనే పట్టుదల నాగరాజుకు కొత్త మార్గాల్ని అన్వేషించి పెట్టింది.

రోజూ ఉదయం, ఆరోజు రాత్రి ఏ సన్నివేశాలు ఎలా తీయాలో, ఎలా ఉంటే బాగుంటుందో డిస్కషన్ జరిగేది. ఆ డిస్కషన్‌లోనే కథలో ఆ సన్నివేశానికి ఏ మాటలు రాయాలో స్పష్టం అయిపోయేది. అయినా నాగరాజు తను మాత్రం మాటల్నిరాత్రిపూటే రాస్తానని చెప్పేవాడు. సాయంత్రం తనరూంలోకి చేరాక, శుభ్రంగా మందుకొట్టేసి ఆ తర్వాత రాతకోతల్లో పడేవాడు. ఎదురుగా నమ్మినబంటు సూర్యం! అక్షరంలో సగంరాసి, ఆప సార్లు చదువుకొని ఆఖరికి ఒక కొలిక్కి తెచ్చేవాడు ఆ మాటల్ని నాగరాజు! మర్నాడు డిస్కషన్ టైంకు ఆ మాటల్ని వినిపించి అక్కడక్కడ ఎదురయ్యే విమర్శలు, కామెంట్స్ గుర్తుపెట్టుకొని వాటిని మళ్ళీ మాటల్లోకి చేర్చి-మొత్తానికి గండం గడిపించుకొనేవాడు నాగరాజు.

కానీ ఈ పద్ధతిలో తనకు కాలం గడవదని నాగరాజుకు స్పష్టపడింది. ఎంత అవస్థపడ్డా ఒక్క సినిమాకు స్క్రిప్టు పూర్తిచేయటం గగనం అయిపోతోంది తనకు! అలాటిది ఈ చిత్రసీమలో పది కాలాలపాటు ఉండాలంటే తను వేరేపద్ధతి ఆలోచించుకోవాలి! తనకు ఈ చిత్రసీమలో పునాది కాదు, ఏకంగా తను పాతుకునిపోయే పద్ధతిఅయిఉండాలి అది. ఆ పద్ధతి ఏమిటో నాగరాజుకు తోచటం లేదు కానీ ఏదైనా ఒకమార్గాన్ని అన్వేషించుకొని తీరాలని నిర్ణయించుకొన్నాడు నాగరాజు.

* * *

నాగరాజు రాసిన కథ 'మూడు తరాలు' పేరుతో సినిమా పూర్తయి విడుదల అయింది. కథ చాలా మామూలు కథ. తండ్రి తన తండ్రిని నిర్లక్ష్యం చేస్తే కొడుకు ఈ తండ్రిని నిర్లక్ష్యం చేయటం. నువ్వు ఏపనిచేస్తేనీకు దానికి తగినఫలితమే లభిస్తుందని చెప్పే కథ. మధ్యలో ఓ చిట్టెమ్మ ప్రేమకథ. కొంత సెక్సుతో, కొంత బూతుతో, మరికొంత డాన్సులతో నిండిన ఆ సినిమా ప్రేక్షకులకు ఎందుకు నచ్చిందో, ఎలా నచ్చిందో తెలీదు. సినిమా విడుదల అయ్యాక పత్రికలన్నీ 'కథ బాగుంది' అని ఆ పత్రికల సమీక్షల కాలమ్‌లో రాశాయి. ఆ ఒక్కవాక్యమే

గతంలో ఎందరో చేయలేనంత కీడును చిత్రపరిశ్రమకు చేసేశాయి. ఆ సంగతి తెలిసేసరికి ఆ పత్రికలన్నీ కలిసి ఆకులు పట్టుకొన్నా లాభం లేని స్థితి ఏర్పడిపోయింది.

పత్రికల సమీక్షలలో 'కథబాగుంది' అన్నవాక్యం రావటంతో రాంబాబుగారికి నాగరాజు అంటే ఇష్టం పెరిగింది. తెర వెనుక, తన వెనుక నాగరాజు ఆ కథ కోసం ఎంత గడ్డి కరిచాడో ఆయనకు తెలీదు. ఒకవేళ తెలిసినా పట్టించుకొనే వాడు అవునో కాదో కూడా ఈరోజు చెప్పలేం.

సినిమా విడుదల అయిన మొదటి మూడు రోజులు రాంబాబుగారు పంపిణీ దార్లతో కలిసి థియేటర్లన్నీ చెక్‌చేసుకొని వచ్చారు. అన్నిచోట్లా జనరల్‌గా సినిమా బాగుందనే టాక్‌వుంది. కథ విషయం కొన్నిచోట్ల అనుకొంటున్నారు. కొన్ని చోట్ల అదేమీ అనకపోయినా, బాగలేదని అనకపోవటం ఆయనకు సంతృప్తిని కలగజేసింది.

తిరిగిరాగానే రాంబాబుగారు నాగరాజు కోసం కబురుపెట్టారు. కథ బాగుందని అందరూ అనుకొంటున్నది చెప్పాలని ఆయనఉద్దేశం. కొత్తరకం కథకాకపోయినా అందర్నీ ఆకట్టుకొందని రాంబాబుగారు చెప్పారు.

నాగరాజుకు అందలమెక్కినంత సంబరంగా ఉంది. పడ్డ అవస్థ పడ్డాడు. కానీ ఫలితం దక్కింది. ఈ పునాదిమీదే తను నిలబడితే అంతకన్నా కావాల్సింది ఏముంది. రాంబాబుగారు ఆదరంగా అభినందిస్తొంటే నాగరాజు తృప్తిగా నిట్టూర్చుకున్నాడు.





"డైరెక్టరుగారు మొదటే చెప్పారను కోండి-బాగానే ఉంది కథ అని! అయినా ప్రతిసారీ భయంభయంగానే ఉంటుంది. ఇదోరకం పరీక్షకెళ్ళే పిల్లాడి మన స్తత్వం. ఎన్ని పరీక్షలు రాసినా తర్వాత పరీక్షకు నెర్వస్‌నెస్ రావటం. నా చేతిలోంచి ఎన్ని సినిమాలు తీసినా నాకు కొత్త సినిమా అంటే భయమే మళ్ళీ. ఇపుడు పరీక్ష పాసయినంత ధీమాగా ఉంది! టాక్ బాగుంటే పర్వాలేదు అదే పదివేలు" రాంబాబు తన మనసులోది దాచుకోకుండా చెప్పారు.

నాగరాజు క్షణం ఆగి అన్నాడు. "ఉన్నంతలో బాగానే వచ్చిందనుకోండి! కానీ ఇంకా బాగా తీసి ఉంటే బాగుండేది"

"అంటే?" రాంబాబు ఆశ్చర్యంగా అడిగారు.

"అంటే .." నాగరాజుకు ఏం చెప్పాలో తోచలేదు. త్వరపడి అన్నాడు. తన కథకు మరింత మంచి దర్శకుడు లభించి ఉంటే- అని అర్థం వచ్చేసింది ఆ మాటకు. అయినా అదీ మంచిదే-కథ ఇంకా బాగుండేది. ఇంకా బాగా తీస్తే అనే తను అని ఉంటే బాగుండేది.

ఈసారీ నాగరాజు ఏమీ అనక పోవటం చూసి రాంబాబు అన్నారు కలుగజేసుకొంటూ "మాటవరసకే అను కొందాం- ఇదే కథను ఇంతకన్నా బాగా తీసే అవకాశం ఉందా?"

"లేకేమండీ! తీసిన కథనే ఎంతో అందంగా తీయచ్చునని ఎందరో గతంలో మనకు చెప్పనే చెప్పారు. అయినా ఇది కొత్తరకం కథ. తరాల మధ్య అంతరాల గురించి చెప్పే కథ. ఇంకా పకడ్బందీగా తీయచ్చు దీన్ని."

"అంటే ఒకవేళ మీరే డైరెక్టరు అను కోండి. ఇంతకన్నా బాగా తీసేవారా

మీరు?"

నాగరాజు ఉలిక్కిపడ్డాడు రాంబాబు అన్నది విని! విన్నది సరిగ్గానా? ఎటు పోతోంది సంభాషణ? సరే పో.

"త్రీసేవారా అంటే ఊ ఛే చెప్పాలి. కథ నాది. మాటలు నావి.ఇవి మీకు చెప్పి, మీరు వాటిని ఆం చేసుకుని వాటికి న్యాయం చేయం వేరు. నా అంతట నేనే ఆ పాత్రలకు ప్రాణప్రతిష్ట చేయటం వేరు. ఖచ్చితం నేను గనుక ఆ కథను తెరకెక్కిం ఉంటే అది ఇంతకన్నా బాగుండేదనా అభిప్రాయం. అయినా..." ఆగిపోయాడు నాగరాజు.

రాంబాబు క్షణం ఆలోచిస్తూ ఉండి ఆ తర్వాత అన్నారు నెమ్మదిగా "మీ ఆత్మవిశ్వా నాకు నచ్చింది! మీకు డైరెక్షన్‌లో ఏబీసీడీలు రావు. అయినా మన డైరెక్టరుగారికన్నా మీరు ఈ చిత్రాన్ని బా తీయగలిగేవాడివని అంటున్నారు"

"ఏబీసీడీ రానక్కర్లేదు. సరైన అవగాహన ఉంటే, సరైన అసిస్టెంట్ దొరికితే చిత్రాన్ని ఇంతకన్నా బాగా తీయటం కుదురుతుందనే నా నమ్మకం"

"ఒకవేళ మీకే నేను అవకాశం ఇచ్చానుకోండి మీరు ఇంతకన్నా మంచి చిత్రం తీయగలరనే మీ నమ్మకమా?"

"తప్పకుండానూ. కథ, మాటలు, దర్శకత్వమూ నాదే అయితే తప్పకుండా చిత్రంఇంతకన్నా బాగుంటుంది. నా ఆలోచనల్ని నేను తెరకెక్కించటం వేరు. మీరో నా ఆలోచనలకు రూపం కల్పించటం వేరు"

సరే, చెప్పాకదా — మీ పద్ధతి నాకు నచ్చింది. మీరొచ్చి ఆత్మవిశ్వాసంతో మాటలు రాస్తానన్నారు. అవి నాకు నచ్చాయి. సినిమా కథకు మీకు ఛాన్సు ఇచ్చాను. అదీ నాకు నచ్చింది. ఇపుడు ఇక సినిమాకు కూడా డైరెక్టర్ అవ్వండి. మీరో కథ ఆలోచించండి. బాగుంటే తీద్దాం దాన్నే"

"కానీ..." ఆగిపోయాడు నాగరాజు చెప్పాలా వద్దా అని. కానీ ఆ తర్వాత చెప్పటమే మంచిది అనిపించింది. రేపెప్పుడో నిందల పాలయ్యేకన్నా ఇపుడు ఇక్కడే తన సంఘర్షణని చెప్పేస్తే మంచిది అనుకొన్నాడు. అనుకోవటం తడవు అనేశాడు "ముందే చెప్పానుగదా, నాకు డైరెక్షన్‌లో ఏబీసీడీలు రావు. మంచి అసిస్టెంట్స్‌ను పెట్టుకొంటాను. నాకు నాలాగే కష్టించి పనిచేసేవాళ్ళంటే ఇష్టం! అలాటివాళ్ళను కొందర్ని ఎన్నుకొంటాను. మీరు ఊ అంటే ఇంతకన్నా అందమైన సినిమా తీసి ఇస్తాను"

రాంబాబు సరే అన్నారు.

నాగరాజుకు కోటలో పాగా వేసినట్లు అనిపించింది. ఇప్పటికి ఒక్క కథకు ఎలాగో తంటాలు పడి రూపం కల్పించగలిగాడుతను. ఆ కథ ఎవరెవరు వేసిన భిక్షోగానీ తన కడుపు నిండింది. తన అదృష్టం బాగుండి కథగా పదిమందికి నచ్చింది. ఇపుడు రెండో కథ. ఈ కథా ఇదే పద్ధతిన సంపాదించుకుంటూపోతే సరి. ఎటొచ్చీ దానికి సూర్యం సలహా సంప్రదింపులు, సహకార సహాయాలు అవసరం. వాటిని సంపాదించుకోవటం పెద్ద కష్టమైనపనేమీకాదు. ఈ సంగతి ఇప్పటికే తెలిసిపోయింది.

ఒకసారి దొంగతనం చేసేంతవరకే భయమూ, ఆందోళనానూ. ఆ తర్వాత రెండోసారి దొంగతనం చేసేటపుడు ఈ భయాందోళనలు అదేనిష్పత్తిలో ఉండవు.

కొంత తగ్గుతాయి. కాలం గడిచేకొద్దీ నేర్పు అధికమవుతుంది. చాకచాక్యం పెరుగుతుంది. ఒకనాటి చిన్నదొంగ గజదొంగ అవుతాడు.

నాగరాజు కథా ఇంతే అయింది. మొదటిసారి కథకోసం పడ్డన్ని అవస్థలు రెండోసారి కథకు పడలేదు. పైగా ఒక సినిమాను హిట్ చేసిన కథారచయితగా ఇపుడు కొంత పేరు కూడా వచ్చింది. ఇంక వెనక్కు తిరగాల్సిన అవసరం ఏముంది? ఒకవేళ ఈ దొంగతనం బయట పడ్డా ఎవరు చెప్పగలరుదాన్ని? ఎవరు అన గలరు దాన్నిగురించి? కీర్తి ప్రతిష్టలు సంపాదించుకొనేంతవరకే కష్టంకానీ ఆ తర్వాత ఎన్ని బేవార్సు పనులైనా వాటి వెనుక దాచిపెట్టుకోవటం తేలికేననిపిం చింది నాగరాజుకు.

రెండోసారి సినిమాకు కూడా కథ సిద్ధం అయిపోయింది. ఇదీ మామూలు కథే. నిత్యం ఇళ్లల్లో జరిగే కథే ఇది. సంసారం అనేది ఓ సాగరమని, దీనిలో నౌక నడిపేవాడు జాగ్రత్తగా ఉంటేతప్ప అవతలితీరం చేరటం కష్టమని చెప్పే కథ ఇది'జీవిత సాగరం' అన్న పేరుతో కథ సిద్ధ అయిన తర్వాత రాంబాబుగారి దగ్గరికి వెడు.

రాంబాబుగారు స్క్రిప్టు ఓకే చేసే సారు. "చ్చాగదా డైరెక్షన్ మీదేనని! మూడుతరాల బాబులాగ రావాలి ఈ చిత్రం. మీకెర్ని కావాలో వారిని అసి స్టెంట్స్‌గా తీకోండి. చిత్రం రిచ్‌గా రావాలి. బానర్‌పేరు నిలబెట్టాలి. మీరు సిద్ధం అంటే ఓటనే మొదలుపెట్టేద్దాం! రేపటెల్లుండిలో పోదాం లొకేషన్స్‌చూసి వచ్చేందుకు. ఓకే అన్నారు రాంబాబు గారు.

ఎలా తప్పించుకోవాలి ఈ గండాన్ని? అయినా రోట తలదూర్చి దెబ్బలకు వెరిస్తే ఎలా?



సూర్యం కోసం కబురుపెట్టాడు. సూర్యం రాగానే అన్నాడు-"పెద్ద అవసరంలో పడ్డానయ్యా నేను" అని నాగరాజు తన బాధ వెళ్లగక్కాడు.

"చెప్పండి ఏం చేయాలో, ఎలా చేయాలో నేను చేసిచూపిస్తాను" అన్నాడు సూర్యం.

నాగరాజు నవ్వాడు. "ఏం చేయాలో నేను చెప్తానుకానీ, ఎలా చేయాలో అనే విషయాన్ని మాత్రం నాకే వదిలెయ్. అన్నట్లు మీ ధనలక్ష్మి ఏదీ కనపడ్డం లేదు" అని అడిగాడు నాగరాజు విషయాన్ని కదుపుతూ.

సూర్యం నవ్వేశాడు "నాకు తెలుసు మీరు ఇది అడుగుతారని. కానీ ఆ ముండ చెక్కేసింది నిన్ననే! నన్ను అడిగింది వెళ్లనాఅని. షూటింగుకు ఇంకా టైముంది గదా, పోతేపో అన్నాను. పోయింది. అవునూ షూటింగు ఎప్పటినుంచి మొదలు పెడతారు? రాంబాబుగారు ఏమన్నారు?"

నాగరాజుకు మత్తు అంతా దిగిపోయింది. మళ్లీ రేపటి లొకేషన్ సెలక్షన్ గుర్తొచ్చింది తల పట్టుక్కూర్చున్నాడు. సూర్యం నవ్వుతూ అడిగాడు- "ధనలక్ష్మి పోయిందనగానే అంత విచారపడితే ఎలా చెప్పండి" అన్నాడు వేళాకోళంగా.

"నా బాధ అదికాదు బాబూ! రేపు లొకేషన్స్ చూసిరావటానికి వెడదామన్నారు రాంబాబుగారు.నాకుదానిగురించి సరైన అయిడియాయేలేదు. ఏం చేయాలా అని ఆలోచిస్తున్నాను"

సూర్యం నవ్వేశాడు పకాలున. "ఇంతేనా! ఇంతమాత్రానికే ఇంత ఆలోచిస్తున్నారా మీరు. నాకు వదిలెయ్యండి. అన్నిటినీ నేను సరిచేస్తాను. ఎటొచ్చీ..."



ఆగిపోయాడు సూర్యం.

"చెప్పు. ఫర్వాలేదు"

"నేను వెళ్ళి మన కృష్ణన్‌తో మాట్లాడి వస్తాను. ఆయనే మనకు ఫొటోగ్రాఫర్ కాబట్టి ఆ విషయమంతా ఆయనే చూసుకునేటట్లు ఏర్పాటుచేస్తాను. ఎటొచ్చీ మనం దానికి కొంచెం ఖర్చుపెట్టాల్సి ఉంటుందేమో"

నాగరాజుకు కొంచెం ఊపిరి చిక్కింది. డబ్బు ఇస్తే పని జరుగుతుందంటే ఇంకేం. ఊ అంటేసరి. కానీ ఒకటే షరతు—కృష్ణన్‌తో ఒప్పందం బయటపడకూడదు. పైగా ఇచ్చేదేదో ఇపుడుకాదు తనకు తన పారితోషికం ముట్టాకనే.

సూర్యం షరతులన్నీ పర్వాలేదన్నాడు. ఇలాటివన్నీ ప్రొడ్యూసర్‌గారి వరకు వెళ్ళవు. వెళ్ళటం మనకెంతమంచిది కాదో, అటు కృష్ణన్‌కూ అంతే! మీరేమీ బెంగపెట్టుకోకండి! ఎటొచ్చీ రేపు రాంబాబుగారు లొకేషన్‌లకు వెడదాం అంటే కెమెరామన్‌కూడా వెంటరావాలని చెప్పండి! మిగిలినదంతా నేను చూసుకొంటాను"

సూర్యం ఇచ్చిన ధీమాతో నాగరాజుకు కొండంతబలం వచ్చింది. ఎలాగయినా నెగ్గగలననే ధీమా కలిగింది. సూర్యం పక్కన ఉంటే ఏమైనా చేసేయగలననే నమ్మకం కలిగింది.

ముందుగా సూర్యం, ఇపుడు కృష్ణన్...ఏం నేర్పుతున్నారు వీళ్ళు తనకు? డబ్బు అటుపడేస్తే ఇటు వాళ్ళు తన పనిచేసి పెడతారు. కష్టం వాళ్ళది. పేరు తనది. మొదట్లో ఇపుడు ఖర్చుపెడుతున్నదంతా తన పెట్టుబడి! ఇదే పద్ధతిని మరికొంత విస్తరిస్తే... అందర్నీ ఆకట్టుకోవటం తేలిక. ఒకసారి వాళ్ళను దారిలోకితెచ్చుకొంటే, ఆ తర్వాత వాళ్ళను టాకిల్ చేయటం కష్టమేమీ కాదు.

ముందుగా తన పబ్బం గడవాలి. ఇపుడు పెట్టుబడితో ముందు తాను కాలూనుతాడు. ఆ తర్వాత... ఆ తర్వాత..

నాగరాజుకు భవిష్యత్తు అంతా అందంగా కనపడింది. ఆ సంబరంలో జోరుగా మరింత మందుకొట్టాడు.

తెల్లగా తెల్లారిపోయింది ఉదయం లేవగానే కనపడని కోటిదేవుళ్ళకు దణ్ణం పెట్టుకొన్నాడు—తనకు ఈ పరీక్షలోనూ విజయం లభించేలా చూడమని!

రాంబాబు కబురుపెట్టారు—లొకేషన్లకు వెడదాం సిద్ధంకమ్మని! నాగరాజు సూర్యానికి కబురుపెట్టాడు—అంతా ఓకే చెయ్యమని! అటునుంచి జవాబుగా సూర్యమే వచ్చేశాడు—అంతా సరేనని!

అంటే గండం గడిచినట్లేలెక్క!

కారు బయలుదేరబోతుంటే కృష్ణన్ కూడా కారులోకి రావటం చూస్తూ ఆశ్చర్యపోయారు రాంబాబు. ఆ ముఖంలో ప్రశ్నను అర్థంచేసుకొన్నట్లుగా అన్నాడు సూర్యం— "కృష్ణన్‌గారుకూడా వస్తేనే బాగుంటుందని డైరెక్టర్‌గారు అనుకొంటున్నారండీ!"

రాంబాబు నవ్వి సరేనన్నట్లుగా ఊరుకొన్నారు. కారు కదిలింది.




సినిమా పూర్తయింది. 'కథ, మాటలు,




స్క్రీన్‌ప్లే, దర్శకత్వం' అంటూ అర మైలు పొడవుండేటట్లుగా టైటిల్ కార్డులో పదవులన్నీ నాగరాజుకే సంక్రమించాయి. వాటి అన్నిటికిందా 'దాసు నాగరాజు' అని పెద్దపెద్ద అక్షరాలు ఉండేలా చూసుకొన్నాడు. చిత్రం సెన్సారుకు వెళ్ళి వచ్చింది. అక్కడా ఇక్కడా ఏవో మైనర్ కట్స్ వేశారు తప్పితే పెద్ద బాధేమీ లేకపోయింది వాళ్ళతో. డిస్ట్రిబ్యూటర్స్ విడుదలతేదీకూడా నిర్ణయించారు. ఆ రోజు దగ్గరపడుతున్న కొద్దీ నాగరాజుకు బ్లడ్ ప్రెషర్ పెరిగిపోసాగింది. జీవితంలో అనుకోని అవకాశం లభించింది. తెలిసో తెలియకో ఈ రంగంలో కాలు పెట్టాడు. అక్షరం అనేది ఒక్కటిసరిగ్గా ఉత్తరంలో నయినా రాయకపోయినా, ఇప్పటికి ఓ కథా, దానికి మాటలూ కూడా రాసే స్థితికి ఎదిగాడు. ఈ చిత్రం విషయములో కొంచెం జాగ్రత్తపడితే అటు పబ్లిసిటీకి, ఇటు ఇతర విషయాలకీ తగినంత ఖర్చుపెట్టేస్తే...పర్వాలేదు అనిపించింది. ఈ ప్రయత్నంలో భాగంగానే రాంబాబుగారితోచెప్పి ప్రీమియర్ షో ప్రెస్‌వాళ్ళకి వేరుగావేసి చూపిద్దాం అన్నాడు. ప్రివ్యూకూడా ఏర్పాటయింది.

ప్రివ్యూథియేటర్‌లో సినిమా జరుగుతుంటే బయట లాన్స్‌లో నాగరాజు పరిస్థితి దయనీయంగా ఉంది. ఎలా ఉందని అంటారో ఏమోఅన్న భయం పెరిగిపోసాగింది. తెలిసో తెలియకో జీవితం తీసుకొన్న ఈ మలుపును సుస్థిరం చేస్తారో లేకపోతే మరోమలుపు తిప్పి మళ్ళీ పల్లెటూరికి చేరుస్తారో అంతా పేళ్ళనుబట్టే ఉంది. పత్రికల వాళ్ళలో ఉన్నది ఉన్నట్లు రాసేవాళ్ళు బహు తక్కువ. ముఖ్యంగా సినిమాల పత్రికలు! గాలివాటంగా ఉన్న చిత్రాన్ని సైతం 'సూపర్బ్' అంటూ పొగిడి దాన్ని ఆకాశంలోకి తీసుకొనివెళ్ళగలరు. లేకపోతే, ఏం కొంచెం నచ్చకపోయినా ఆ చిత్రాన్ని అధోలోకాలకూ దింపివేయగలరు – అనుకొన్నాడు నాగరాజు.

సినిమా సగంపూర్తయ్యాక బయటకు వస్తున్న ఆహ్వానితబృందం ముఖాలలోకి చూశాడు నాగరాజు. ఆ ముఖాలు దేంట్లోనూ ఏ రకమైన భావమూ వ్యక్తం కావటంలేదు. మరి సినిమావారికి నచ్చినట్లా, నచ్చనట్లా? అర్థం కావటంలేదు.

అందరూ టీ తాగుతోంటే నాగరాజు వ్యక్తిగతంగా ఒక్కొరి దగ్గరికి వెళ్ళి ప్రత్యేకంగా ఆహ్వానించాడు– మర్నాడు తానుఇచ్చే డిన్నర్‌కు కూడా హాజరవ్వమని! సినిమా ఎలాఉందని అడుగుతోంటే కొందరు విలేకరులు నవ్వేశారు. మరి కొందరు నవ్వి ఊరుకొన్నారు. ఇంకొందరు ఏ జవాబు చెప్పకపోతే బాగుండదన్న ధోరణిలో 'ఫర్వాలేదులెండి' అన్నారు మొహమాటపడుతూ.

'సూర్యం ఉండిఉంటే బాగుండేది' అనుకొన్నాడు నాగరాజు. ఇపుడిపుడే తెలుస్తోంది తాను ఎన్నో విషయాలలో పూర్తి అజ్ఞానంతోనే ఉంటున్నాడని. మెలుకువలు తెలిసినవ్యక్తి ఒకడిని పూర్తిగా నమ్మటం మంచిదనికూడా అనుకొన్నాడు.

ఈసారికిలాకానిస్తే... వచ్చేసారికి...

కానీ... వచ్చేసారనేది ఉంటుందా అనేది అనుమానంగానే తోస్తోంది. తను చూసుకొంటే సినిమా బాగానే ఉందని పిస్తోంది. ఇలాఅనిపించటం కాకిపిల్ల కాకికి ముద్దుఅన్న ధోరణిలోనా, లేకపోతే నిజంగానే బాగుందాఅనేది నాగరాజుకు అర్థం కావటంలేదు.

చూస్తూ ఉండగానే సినిమా పూర్తయి పోయింది కూడానూ! కొందరు విలేకరులు వచ్చి "బాగాతీశారండీ" అనిచెప్తూ షేక్ హాండ్ ఇచ్చి వెళ్లిపోయారు. మరికొందరు "మొదటిపిక్చర్ గదా, కొంచెం బెరుకు కనిపిస్తోంది" అనీఅన్నారు. నిష్కర్షగాను, నిక్కచ్చిగానూ చెప్పినవాళ్ళెవరూ కనపడలేదు నాగరాజుకు.

'ఎందుకిలా?' అనుకొన్నాడు మనసులో. అదే ప్రశ్న నాగరాజు సూర్యాన్ని మర్నాడుఅడిగాడు. సూర్యం నవ్వాడు. "ఈలోకంఅంతా అంతేనండి. కొందరిది మనకెందుకు అనేధోరణి. మరి కొందరిది ఎలాగూ రాస్తున్నాం కదా, ఇంకా చెప్పేదేమిటి అనే ధోరణి.అయినా ఏపద్ధతి మనుషుల్ని అయినా లొంగబచ్చు కొనేందుకు కొన్ని పద్ధతులున్నాయి. కాంత కనకం అన్నారు పెద్దలు. మీరు ఒప్పుకొంటే...."

"కానీ సూర్యం! వీళ్లు లొంగుతా రంటావా?"

"ఎంతవారలైనా.. అని ఊరికే అనలే దండీ బాబూ! మీరు ఊఁఅనండి.మిగతాది నేను చూసుకొంటాను" అన్నాడు సూర్యం.

నాగరాజు 'ఊఁ' అన్నాడు.

కానీ అలా అనటంతో తనకు దాదాపు నాలుగైదు వేల వరకు ఖర్చుఉంటుందని ఊహించుకోలేదు నాగరాజు. సూర్యం మొదట డిన్నర్ అన్నాడు. ఆ తర్వాత పార్టీ అన్నాడు. ఆతర్వాత ప్రెస్ జనానికి అంతా ప్రెజెంటేషన్స్ అన్నాడు. నాగ రాజుకు దిక్కు తోచలేదు. తెలీక దిగాడు ఈ రొంపిలో. ఇపుడు ఇరుక్కొంటు న్నాడు. నెమ్మదిగా సూర్యం తనను ఊబి లోకి దింపేస్తున్నాడని తెలిసినా ఏమీ చెయ్యలేనిస్థితిలో ఉండిపోవాల్సి వస్తోంది. ఎవరికి ఏం ఇస్తున్నాడో, ఎవరితో ఏ ఒప్పందం చేసుకొంటున్నాడో సూర్యం చెప్పనేలేదు.

"వ్యవహారం అంతా నా నెత్తిన పడె య్యండి. మీరన్న పేరు బయటికి రానీయ కుండా అంతా నేను సజావుగానడిపిస్తాను. మీరే రంగంలోకి దిగితేబాగుండదు" అని చెప్తూ ఆంక్షల్ని సైతం కనపడనీయకుండా పెట్టేశాడు సూర్యం.

సూర్యంచెప్పినట్లు డబ్బు అందించటం ఒకటే కనపడింది నాగరాజుకు. అంతా అయిపోయింది. సినిమా విడుదల కూడా అయ్యాక వివిధపత్రికలు, రివ్యూలు, అభి ప్రాయాలు-పాఠకులకు నచ్చని, నచ్చిన సన్నివేశాలు అంటూ వేశాయి. అవన్నీ ప్రతి సినిమాగురించీఉండేవే. ప్రత్యేకంగా తనగురించి రాసినట్లు ఏముంది ఇందులో అనుకొన్నాడు నాగరాజు.

అనుకొని ఊరుకోకుండా అదే సూర్యాన్ని అడిగేశాడు.

"బాగుంది మీ ప్రశ్న! ఆమాత్రం ఖర్చుపెట్టాంకాబట్టి ఈమాత్రంఫేవరబుల్ రివ్యూస్ వచ్చాయి. లేకుంటే ఏ పత్రికా ఒక్క అక్షరమూ రాసివుండేది కాదు"

"అదేమిటి సూర్యం. సినిమాపత్రికల వాళ్ళు కనీసం వాళ్ళకోసమే అయినా రాసుకోవాలి కదా" అనడిగాడు నాగరాజు.

సూర్యం నవ్వాడు. "సర్లెండి.ఆ ఇరవై, పాతిక పేజీల్లో ఏదోఒకటి రాసుకోగల రండీ వాళ్లు. నిజమే! అలాటపుడు అక్కడ మీ గురించే రాయాలని ఏముంది? అలా రాశారంటే దానికి కారణం మనమే" అన్నాడు.

సూర్యం అన్నది నాగరాజుకు సంతృప్తిగా అనిపించలేదు. నాగరాజు





ముఖంలో ఇంకా పైకికనిపిస్తున్న ప్రశ్నను గుర్తిస్తున్నట్లుగా అన్నాడు సూర్యం కొంచెం చికాకుగా, కొంచెం ఇబ్బందిగా- "ఇంతకీ మీరనేది ఏమిటండీ - డబ్బు నేను తినేశాననా? ఆ సంగతి పైకే అనండి అనే టట్లయితే!"

నాగరాజు ఆ సంగతి పైకి అనలేదు. కానీ మనసులోమాత్రం అనుకొన్నాడు. పత్రికలవాళ్ళలో అసలు ఇలాటి వాటికి లొంగే జనం, ఇలాటి చిన్న చిన్న ఆశలకు ఆశయాలకు నీళ్ళొదిలే జనం ఉంటారా అని!

గుండె అంతరాంతరాల్లోంచి ఎక్కడో ఉండరన్న జవాబు అతనికే వినిపించింది. అయినా గుండెలోని అలజడిని క్షణంసేపు నొక్కిపెట్టేశాడు నాగరాజు.




రిసెప్షన్ నుంచి వచ్చిన ఫోన్ అందుకుని నాగరాజు ఆశ్చర్యపోయాడు- తనకోసం ఎవరో వచ్చారట! ఎవరో ఫామిలీలేడీస్‌లా ఉన్నారుట!

ఎవరై ఉంటారు? తనకోసం ఎవ రొచ్చి ఉంటారు? సినిమాలో వేషంకోసం అయివుంటుంది. ఇలాటి వేషాలు వేయ టానికి వచ్చేవారు ఏ వేషమైనా వేసారు. ఆఖరికి 'ఫామిలీలేడీస్' వేషం కూడా వేసెయ్యగలరు! ఎవరికి తెలీదని వీరి వేషాలు! వేషం వేసేది ఏదైనా ఆఖరికి కావాల్సిందిమాత్రం ఆ వేషమే! ముఖం మీద రంగులు వేసుకోటానికి ముందుగానే మనసుకు రంగులు వేసుకోవటం వీరికి పరిపాటి.

క్షణం ఆలోచించాడు నాగరాజు. పైకిరమ్మనటమా, లేకపోతే లేనని చెప్ప మనటమా? పోనీ వెళ్ళివస్తే? వచ్చింది నిజంగానే ఫామిలీ లేడీసే అయితే అలాటి వాళ్ళను అవమానించటం మంచిది కాదు. ఏ పుట్టలో ఏ పాము ఉంటుందో చెప్పటం కష్టం. పోయి చూసివస్తేనే మంచిది!

నాగరాజు మెట్లుదిగి రిసెప్షన్‌దగ్గరికి వెళ్ళాడు. నాగరాజును చూడగానే రిసెప్షన్‌లో ఉండే అమ్మాయి లేచి నిలబడి చూపుడు వేలుతో ఒకవైపునకు చూపించింది.

నాగరాజు అటుచూశాడు. ఉలిక్కిపడ్డాడు!

కుసుమ!!

కుసుమ ఇక్కడికెందుకు వచ్చింది? ఎలావచ్చింది? ఎవరు ఇచ్చారు తన అడ్రసు? ఇపుడీ అనుకోని రాకఏమిటి? ముందుగా తెలియపర్చి వచ్చి ఉండొచ్చు కదా!

చికాకొచ్చింది నాగరాజుకు. అయినా ముఖంలోని రంగుల్ని బయటకు కనపడ నీయకుండా మళ్ళీ రిసెప్షనిస్ట్ వైపే చూసి అన్నాడు "ప్లీజ్ బుక్ ఎ డబుల్‌రూమ్ ఫర్ మీ!"

ఆవిడను చూసీ చూడగానే నాగరాజు డబుల్‌రూం బుక్ చేయించటం రిసెప్షన్ లోని అమ్మాయికి ఆశ్చర్యాన్ని కలిగించింది. కానీ ఇలాంటివెన్నో చూసిన అనుభవంతో ఏమీ మాట్లాడలేదు ఆ అమ్మాయి. లెడ్జర్స్ తిరగేస్తూ ఉన్నట్లుగా నటిస్తూ, నాగరాజునే పరీక్షగా చూస్తూ

ఉండిపోయింది ఆమె. నాగరాజు నవ్వుతూ కుసుమ వైపు నడిచాడు. ముఖం మీద నవ్వు పులుముకొంటూ అడిగాడు– "ఎపుడొచ్చావ్ ఇక్కడికి?"

నాగరాజు రాగానే కుసుమ లేచి నిలబడింది. ఆమెముఖంఅంతాకోపంతో జేగురు రంగుతో నిండిపోయింది– "మీరు చెప్పక పోతే రాలేననా మీ అభిప్రాయం ?" అనడిగింది.

నాగరాజుకు చికాకొచ్చింది. దాదాపు ఏడాదిన్నర రెండేళ్ళతర్వాత కనిపిస్తున్న భర్తతో మాట్లాడేపద్ధతి ఇదా? ఇంకేమీ మాట్లాడలేదు నాగరాజు. మళ్ళీ వెనక్కి వచ్చేశాడు రిసెప్షనిస్టు దగ్గరికి. లాంజ్ లో ఇలా గొడవ పడటంఇష్టం లేదన్న పద్ధతిలో విసుగ్గా అడిగాడు–"రూం బుక్ చేసివెంటనే లగేజ్ అక్కడికి పంపండి!"

రిసెప్షనిస్టు కంగారు నుంచి సర్దుకొని రూం నెంబర్ చెప్పింది.

"మేం పైకి వెడుతున్నాం. బాయ్ ద్వారా లగేజ్ పంపండి" అంటూనే నాగరాజు కుసుమ దగ్గరికి వెళ్ళి "రా!" అన్నాడు ముభావంగా.

కుసుమ లేచింది. పక్కనే సోఫాలో ఉన్న నాలుగేళ్ళ కుర్రాడిని పిలుస్తూ అంది–"రారా!"

నాగరాజు ఒక్కసారి అటు కుసుమనూ, ఇటు కొడుకునూ చూశాడు. ఆ ఇద్దరూ లోపలికి నడిచివస్తోంటే తనకు కష్టాలన్నీ ఏకకాలంలో కలిసివస్తున్నట్టుగా అనిపించింది.

అతనికన్నాముందు కుసుమే మెట్లు ఎక్కుతోంటే,నాగరాజుకు చికాకొచ్చింది. 'ఏమిటీపద్ధతి?' అనుకొన్నాడు. కానీ పైకి అనలేదు. మొదటి నుంచీ ఇదేపద్ధతి అయిపోయింది. ఆస్తిఉన్న పెళ్ళాం కావటంతో తనూ ఆమె అడుగులకు మడుగులు వొత్తక తప్పలేదు ఇన్నాళ్ళూ. కానీ ఇపుడు..ఇపుడెందుకా ఖర్మం?

ఇపుడు కుసుమే తన కాళ్లదగ్గరకొచ్చి పడింది.

ఏమాత్రం పిచ్చి వేషాలు వేసినా, తనమీద అథారిటీ చలాయించే పద్ధతిని చూపించినా తను సహించడు. ఇంతకాలం ఆస్తితో తన్ను కాలరాసింది. ఇకపై తాను మగవాడిననే అహంకారంతో ఆమెను కాలరాస్తాడు అనుకొన్నాడు నాగరాజు మనసులో. నాగరాజు మనసులో కొడుతున్న బుసలేవీ కుసుమకు వినిపించటం లేదు. అందుకే ఆమె ఆఖరి మెట్టుమీద నిలబడి అంది "ఎటు వెళ్ళాలోచెప్పరేం"

నాగరాజు ఉలిక్కిపడ్డాడు. ఏమిటిది ఇలా ఇంతగా అథారిటీ చలాయిస్తోంటే ఊర్కుండిపోతే...కుదరదు. గదిలోకి వెళ్ళగానే చెప్పేస్తాడు. ఇక్కడి పరిస్థితి అంతా చెప్పి ఎలా నడుచుకోవాలో చెప్తాడు. అంతేకానీ ఇలాంటి అడపెత్తనాన్ని ఇక్కడ చెల్లుబాటు చేయించడు.

గదిలోకి వెళ్ళీవెళ్ళగానే కుసుమ అక్కడున్న సోఫాలో కూలబడింది. రెండు కళ్ళూ పైకెత్తిపెట్టి భర్తకేసి నిరసనగా చూసింది. "ఇక్కడింత రాజభోగాలు అనుభవిస్తూ ఇంటికో కార్డుముక్క రాసి పారేస్తేనేం! నేనూ వచ్చేదాన్ని గదా" అంది క్షణం తర్వాత.

నాగరాజు ఏమీ అనలేదు. అతని మనసంతా కుతకుతలాడిపోతోంది. ఎందుకొచ్చింది పులిమీద పుట్ర? ఎలా వదుల్చుకోవాలి? భార్యగా వదుల్చుకోవటం ఎలాగూ కుదరదు. కనీసం ఇక్కడినుంచి వదుల్చుకోగలిగితే....

బజర్ నొక్కిన చప్పుడయింది.




"కమిన్" అన్నాడు నాగరాజు.

లోపలికి బాయ్‌వచ్చి సామానంతా సర్దిపెట్టాడు. బాయ్ ఉన్నంతసేపూ నాగరాజు, కుసుమ ఏమీ మాట్లాడుకోలేదు. బాయ్ వెళ్ళిపోతోంటే నాగరాజు ఆ బాయ్‌తో బేరర్ని పంపమన్నాడు. బాయ్ బయటకు వెళ్ళగానే మళ్ళీఅడిగింది నాగ రాజును కుసుమ—"ఎంత వచ్చింది ఇంత వరకు?"

'అంటే? అపుడే డబ్బు లెక్కకూడా మొదలుపెట్టించన్న మాట' అనుకున్నాడు.

మళ్ళీ బజర్ చప్పుడయింది. బేరర్ వచ్చి రక్షిస్తున్నాడురా అనుకొన్నాడు నాగరాజు. కానీ వచ్చింది బేరర్ కాదు. సూర్యం!పళ్ళు ఇకిలించుకొంటూ వచ్చాడు. "ఎవరో వచ్చారంటే చూసిపోదామని వచ్చా" అన్నాడు.

నాగరాజుకు అరికాలిమంట తలకెక్కింది. కానీ సూర్యం...సూర్యం దగ్గర నోరు జారటంమంచిదికాదు. వాడు దౌర్భాగ్యుడు.

"నా భార్యే..." అని ఆగిపోయాడు నాగరాజు.

సూర్యం "నమస్తే" అన్నాడు. కానీ ఆ పలుకుల వెనుక వాడు తన భార్యను పరిశీలించి చూస్తున్నాడన్న సంగతి నాగ రాజుకు ఎవరూచెప్పనక్కర్లేదు. పెళ్లాన్ని అంతక్రితం ఎన్నోసార్లు చూసినా మరో సారి సూర్యం చూసే పద్ధతిలో చూశాడు నాగరాజు. కుసుమ అందంగానే ఉంది. చామనఛాయకన్నా ఒక ఛాయ ఎక్కువే. నుదుట అందంగా దిద్దిన కుంకుమ. కళ్ళకు కాటుక. ఆ కాటుక కళ్ళలో కనపడని కోరిక. ఎత్తైన వక్షాలు....నిజం చెప్పు కోవాలంటే కుసుమ అచ్చంగా శోభనానికి తయారై వచ్చిన పిల్లలావుంది. నాగరాజు భార్యనుచూస్తే ఇదివరకు కోరిక. కదలాడేది. ఇపుడు ఇబ్బందిగావుంది. ఇక్కడి వాతావరణం ఇపుడిపుడే అర్థం అవుతోంది అతనికి. ఇదో పెద్ద విష వలయం. యమకూపం. ఇక్కడ నీ నా పర తారతమ్యాలు లేవు—ముఖ్యంగా ఆడ వాళ్ళ విషయంలో. మగాళ్లు ముఖ్యంగా పెద్దాళ్లు ఏమీ పట్టించుకోకుండా అన్నిటినీ సర్దుకొనిపోగలరు. అదీ ఆడవిషయంలో నైతే ఇక చెప్పనక్కర్లేదు. అలాటిది ఇక్కడికి కుసుమ వచ్చింది అంటే ఇక్కడి జనంతో ఆమె తన భార్యేనని చెప్పినా సరే వాళ్లు నమ్మరు. నమ్మినట్లు నటించినా నమ్మరన్న సంగతి తనకు తెలీంది కాదు.

నాగరాజుకు ఇబ్బందిగా అనిపించింది సూర్యం ఇంకా అలాగే చూస్తోంటే. ఏం చేయాలో తోచలేదు. ఏంచెప్తే సబబుగా ఉంటుందో కూడా అర్థంకాలేదు

ఏవో ఒకటిరెండు మాటలు మాట్లాడి సూర్యం వెళ్ళిపోయాడు. "ఎవడాడు?" అనడిగింది కుసుమ విసురుగా.

"సూర్యం అని....మనోడే...." అని ఊరుకున్నాడు నాగరాజు—ఇంకా ఏం చెప్పాలో తోచక.

"సర్లేకానీ ... అడిగిందానికి జవాబు చెప్పరేం? ఇక్కడి వాటం చూస్తోంటే మీకేం అంతా బాగున్నట్లేఉంది. అక్కడ నన్ను అలా వదిలేసివస్తే ఏమనర్థం దానికి?" నిలదీసి అడిగింది కుసుమ.

వచ్చినప్పటినుంచీ ఇదేవరస. ప్రశ్నలు ప్రశ్నలు వేసి ఇబ్బంది పెట్టేస్తోంది, ఏ ప్రశ్నకూ సరైన సమాధానం లేదు నాగ రాజు దగ్గర.

"ఇపుడేకదా వచ్చావు. అపుడే అంత తొందర దేనికి? చెప్తాకదా. అవతల నాకు సిట్టింగ్ ఉంది. అందరూ నాకోసం చూస్తుం టారు. వెళ్తాను. నీకొకవేళ ఏమైనా కావాల్సి

వస్తే ఇదిగో ఈ బజర్ నొక్కు. బేరర్ వస్తాడు. ఏం కావాలో చెప్తే వాడు తెచ్చి ఇస్తాడు..." అని జవాబుకోసం ఎదురు చూడకుండా కదిలాడు నాగరాజు.

డోర్ వేస్తోంటే మళ్ళీ అనిపించి వెనక్కి వెళ్ళాడు—"వాడితో అనవసరంగా ఏమీ అనకు! నేను ఇంట్లోంచి పారిపోయి వచ్చానని, నీకు చెప్పలేదని, ఇపుడు నీ అంతట నువ్వే వచ్చావని అసలు చెప్పకు! నేనే రమ్మంటే వచ్చానని చెప్పు. అయినా బేరర్‌లాటి వాళ్ళతో అసలు మాట్లాడాల్సిన పనేమీ పెట్టుకోవద్దు. అర్థమవుతోందా? నువ్వేదైనా నోరు జారితే నేను బజారున పడాల్సి వస్తుంది"

"అంటే, నిజం చెప్పకూడదంటారా?"

"నిజమో, అబద్ధమో ఏదీ ఇక్కడ ఎవరితోనూ చెప్పొద్దు" అని కదిలాడు నాగరాజు.

* * *

"ఏం నిర్ణయించుకొన్నారో చెప్పండి" అన్నాడు నాగరాజు రామదాసును చూస్తూ.

రామదాసు ఏమీ అనలేదు చాలా సేపటి వరకు. ఆయనకు జీవితం పట్ల అసహ్యంగా ఉంది. జీవించాలంటే బాధగా ఉంది. ఈ దేశంలో ఎలాగైనా బతికి పోవచ్చు. ఓ రాజకీయ నాయకుడుగా వేషం వేసుకొని వీధుల్లో పట్టపగటి వేళల్లో ఆందోళనల పేరిట దోపిడీలు చెయ్యొచ్చు — దానికి తర్వాత కాలంలో మంత్రి పదవి బహుమతిగా లభించవచ్చు; ఓ కార్మిక నాయకుడుగా నినాదాలు వల్లిస్తూ, నగరాలకు నగరాల్నే తాము ఆక్రమించేసుకొని, ఆ ఆక్రమణలకు 'దానం' పేరు పెట్టి లక్షలకు అమ్ముకోవచ్చు. దానికి బహుమతిగా కనీసం రాష్ట్రమంత్రి





వర్గంలోనైనా మంత్రి పదవి లభించ వచ్చు. పొరపాటున ఎవరైనా ఆవిషయాన్ని బయటపెట్టి బండారాల్ని గుట్టువిప్పితే క్షణానికోసారి 'రాజీనామా మంత్రాన్ని' పఠిస్తూ పీఠం మీద శాశ్వతంగా ఉండి పోవచ్చు. పైనుంచి కింద వరకూ ఒకే రకపు అవినీతి అల్లుకుపోయిన ఈ దేశంలో, ఈ ప్రజల మధ్య ఎలాగైనా బతికిపోవచ్చు.

కానీ–

రచయితగా బతకటం కష్టం. రచయితగా బతకటమంటే రామదాసుకు ఇష్టం. కానీ ఈ దేశంలో రచయితలుగా బతికినవాళ్లు అరుదు. దాదాపు లేరు. చచ్చిపోయాక ఎన్నో అవార్డులు, సంస్మరణ సభలూ జరుగుతాయి కానీ బతికి ఉన్నపుడు మాత్రం బతకటానికి అవకాశం ఉండదు.

ఏదో విధంగా బతుకు వెళ్ళబుచ్చటం ఒక్కటే ఆఖరికి మిగులుతోంది. రచయిత పట్ల దేశం తనకున్న బాధ్యతలను నిర్వహించటం లేదు. కానీ రచయిత మాత్రం తన కుటుంబం పట్ల ఉన్న బాధ్యతలను విస్మరించలేదు. అందుకే నాగరాజు వంటివాడి వద్ద తలవంచటానికి సిద్ధం కావాల్సి వచ్చింది రామదాసుకు.

ఆనాడు రాంబాబు వద్ద ఎదురు తిరగటంతో జీవితం కూడా ఎదురు తిరిగినట్టయింది. రాంబాబు ఎవరితో ఏం చెప్పాడో తెలీదుకానీ రామదాసుకు కష్టాలు ఆరంభమైనాయి. ఎలా ఎదుర్కొని బతకాలన్నా వీలుపడని పరిస్థితి.

అందుకే ఆఖరికి నాగరాజు వద్ద ఆశ్రయం కోరాల్సిన దౌర్భాగ్యం పట్టింది. ఇంట్లో రెండు పూటలా కంచాలు లేవా

లంటే, పొయ్యిలో పిల్లి కాకుండా పుల్లలే ఉండాలంటే తప్పనిసరి అయిపోయింది. రోడ్డు మీద స్పృహతప్పి ఉన్నవాడికి ఆశ్రయం ఇచ్చిన తాను ఇపుడు మరొకరి ఆశ్రయం కోరాల్సి వచ్చింది. అక్షరాలు నమ్ముకొని బతికిన తాను ఇపుడు అక్షరాలను అమ్ముకోవాల్సి వస్తోంది– అదీ ఇలాటివాడి దగ్గర...అక్షరాలతో బతుకు తెరువుకాక వ్యాపారం చేసుకొంటున్న వాడి దగ్గర. ఆ వ్యాపారమూ అలాటి దిలాటిదా?

నాగరాజు చెప్తోంటేనే రామదాసుకు కంపరం పుట్టింది. "ఇలా అంటున్నానని ఏమీ అనుకోకండి. ఇది పక్కా వ్యాపారం. ఎవరు ఏపని చేసినా అది ధనార్జనకో, పొట్టకూటికో అయిఉంటుంది. అంతేకదా? మీరు పొట్టకూటికి వచ్చారు. మీకు నెలకు సరిపడ జీతం ఇస్తాను. మీరు నా కోసం సినిమాలకు కథలు సిద్ధంచేసి పెట్టండి. వాటిని నేను నా పేరు మీద చలామణీ చేసుకొంటాను" అన్నాడు నాగరాజు.

నాగరాజు సూటిగానే మాట్లాడాడు. కానీ చెయ్యమంటున్నది మాత్రం తన వల్ల కానిదని. 'ఘోస్ట్‌రైటర్'గా బతకటం– అదీ ఇలాటి అనామకుడికి! ఏముందని వీడికి? పొట్టకోస్తే అక్షరమ్ముక్కలేదని తనకు తెలీంది కాదు. తాను రాసిన అక్షరాలను చూసి రాయటానికి వచ్చినవాడు ఆఖరికి తన అక్షరాలను ఆక్రమించుకొని తన జీవితాన్ని శాసించగలిగే స్థితికి ఎదగటం చిత్రం. చలనచిత్ర పరిశ్రమలో ఇది చిత్రమేకాదు, దౌర్భాగ్యం కూడానూ. ఇపుడు వీడి నీడన తను బతకటం.... కుదరదు.

ఆమాటే అనేశాడు రామదాసు.

"నావల్ల కాదు..."

"అది మీ ఇష్టం"

"నాగరాజూ – నేను అడిగేది ఓ అవకాశం. నీ సినిమాకు రైటర్‌గా వీలయితే నన్ను తీసుకోమని. అంతేకానీ, నీకు ఘోస్ట్‌రైటర్‌గా పని చేయటం నాకు...."

"అంత పెద్ద మాటలనకండి అనవసరంగా. నేను మీకు ఇస్తున్నదీ ఓ అవకాశమే. నా సినిమాకు మీరు కథను స్కెలిటన్ తయారుచేస్తే చాలు. ఊర్కే అవుట్‌లైన్స్ ఇస్తే చాలు. ఆ కథకు అవసరమైన అలంకారాలన్నీ నేను చూసుకొంటాను"

"సరే పోనీ అలాగే అనుకొందాం. కథకు అవుట్‌లైన్స్ ఇస్తాను. క్రెడిట్ నాకే ఇస్తారా?"

నాగరాజు నవ్వేశాడు. "గురూగారూ! మీకు తెలుసు. ఇక్కడ మీకు తెలీంది ఏదీలేదు. ఇపుడిపుడే నాకు కెరీర్ ఇక్కడ సెటిల్ అవుతోంది. ఇలాటపుడు రిస్కు తీసుకోవటం తెలివైన లక్షణం కాదు. నేనా పనీ చెయ్యను. ఏదో నాకు టైం లేదుగనుక మిమ్మల్ని నా తరపున ఆలోచించి పెట్టమంటున్నాను. అంతే!"

"అంటే..."

"అంటే ఏముందీ, కథ మీరు నాకు అందించినందుకు పారితోషికం అనుకోండి. పారితోషికం మీకు ఇస్తున్నాను కనుక ఆ కథ నాది అని చెప్పుకొనే హక్కు నాకు ఉంటుంది"

"దీన్ని చౌర్యం అంటారు" అన్నాడు రామదాసు.

"మీ ఇష్టం. మీరు ఏ పేరు పెట్టుకొన్నా అది మీ ఇష్టం. దీనికి నేను మాత్రం ఉద్యోగం అనే పేరే పెడతాను. మీరోచోట ఉద్యోగానికి చేరారనుకోండి.

'అక్కడ ఉత్తరప్రత్యుత్తరాలన్నీ ఎవరి పేరు మీద జరుగుతాయి? ఇదీ అంతే! మీకు నెలకు నేనిచ్చే జీతానికి మీరు నాకు కథల్లల్లి పెడతారు. అంతే" అన్నాడు నాగరాజు-ఇక ఇదే నా అంతిమ నిర్ణయం అన్నట్లు.

ఇక నిర్ణయం తీసుకోవాల్సింది మీరే నని కూడా చెప్పాడు.

"ఆలోచించండి. మీకు అభ్యంతరం ఉంటే మానెయ్యండి. మీరొచ్చి అడిగారు మీ పరిస్థితి బాగులేదని! ఆదుకొందామని చెప్పాను. మీరు నన్నొక రోజున ఆదు కొన్నారు. ఈరోజున మిమ్మల్ని ఇలా ఆదుకోగలనేమో ననిపించింది. నా ఆఫర్‌ను ఒప్పుకోటం, ఒప్పుకోకపోవటం మీ చేతుల్లోనే ఉంది".

"ఇది పూర్తి వ్యాపారంలాగ ఉంది"

"వ్యాపారమే! కాదని నేనంటేకదా చిక్కు? మీకు కావాల్సింది ఈ రోజున జీవితానికి ఓ ఆధారం. నాకు కావాల్సింది కొన్ని ఇంపైన కథలు. ఆ కథలు మీరు అల్లిపెట్టండి. మీకు నెలకు ఇంత అని ఇచ్చేస్తాను"

"ఒకవేళ నేను ఏదైనా ఓ నెల కథను సిద్ధం చెయ్యలేకపోతే..."

"పర్వాలేదు.నాకు తెలుసు.ఇది శారీరక మైన పనికాదని. ఆలోచనలతో నిండిన ఉద్యోగం ఇది. ఒక్కోసారి మీరు ఏకథ అల్లలేకపోయినా నష్టం లేదు. ఆ తర్వాత నెలలోనైనా ఏదో ఫలితం ఉండకపోదు కదా?"

రామదాసు నాగరాజు ఎంత ఎత్తులకు ఎదిగాడో అర్థం చేసుకునే ప్రయత్నం చేస్తున్నాడు.

"ఒకవేళ ఆ తర్వాత నెలలోనూ ఏపీ సిద్ధం కాకపోతే....?"

నాగరాజు నవ్వేశాడు. "అయినా నష్టంలేదు. ఒక్కవిషయం చెప్తా వినండి. ఈ దేశంలో ఇంకా ఎక్కడైనా కొంచెం అయినా నీతీ నిజాయితీ బతికి ఉన్నా యంటే అది రచయితల దగ్గరే అని నా నమ్మకం. పైగా మీ గురించి నాకు ఎవరూ ఏమీచెప్పనక్కర్లేదు. మీపట్లనాకు పూర్తిగా విశ్వాసం ఉంది. నెలకాదు, ఆర్నెల్లు కానీండి, ఏడాది కానీండి-మీరు ఆలోచిం చండి. కథ ఎపుడు సిద్ధం అయితే అపుడే కానీండి. ఈలోగా మీరు నెలనెలా మీ జీతం అందుకొంటూనే ఉండొచ్చు.అయినా ఏ రచయితా కష్టపడకుండా మోసం చేసి సొమ్ము చేసుకోవాలని భావిస్తాడని నేను అనుకోను" అన్నాడు నాగరాజు.

రామదాసు నాగరాజుకేసి పరీక్షగా చూశాడు. నాగరాజు నవ్వుతూ ఉన్నాడు. ఆనాడెప్పుడో శ్రీకృష్ణుడు నోరు తెరిచి ఒక్క ప్రపంచాన్నేమిటి పూర్తి విశ్వాన్ని చూపించగలిగాడట. ఇపుడు ఈ నాగరాజు నవ్వుతోంటే రామదాసుకు ఆ సంగతి గుర్తొచ్చింది. ఎటొచ్చీ ఆ శ్రీకృష్ణుడు కేవలం పధ్నాలుగు భువనాల్ని తన నోట్లో చూపించాడు. కానీ ఇప్పటి ఈ నాగరాజు నవ్వుతోంటే అతను పూర్తి చిత్రపరిశ్రమంతా డబ్బు ఎరగా చూపి స్వాహా చేయగలి స్థోమత ఉన్న వ్యక్తిగా రామదాసుకు అనిపిం చింది. ఉలికిపడ్డాడు.

నిజమే. చలనచిత్రపరిశ్రమలో తనకు చాలాకాలం నుంచీ స్థానం ఉంది. కాదు... గతంలో ఉండేది. నాగరాజు ఏ క్షణంలో తన జీవితంలో ప్రవేశించాడో కానీ అపుడే తనకు స్థాన చలనం కలిగింది. పతనం ఆరంభమయింది. తన వద్ద చేరి, తనవద్ద అక్షరాలు నేర్చుకొని, ఇపుడు తన

స్థానాన్ని ఆక్రమించుకొని, ఆఖరికి తనకు స్వంతంగా పేరు సైతం లేకుండా చేస్తున్నాడు నాగరాజు. తనను నామరూపాలు లేకుండా నాశనం చేస్తున్నాడు. ఇన్నేళ్ళూ ఈ పరిశ్రమలో ఇలాటి విపరీత పరిణామంలేదు. డబ్బుకోసం కక్కుర్తి పడటం ఉంది. వెయ్యి ఇస్తామని చెప్పినచోట వంద ఇచ్చిన సంఘటనలుఉన్నాయి. కానీ ఇలా ఎదుటివాడి కాంతిలో వెలిగిపోవాలనే దురాలోచన ఎవరికీ ఉండేదికాదు. ఇదో విషపరిణామం. ఎదుటివాడిని నామరూపాలు లేకుండా చేసే ఈ స్వార్థం ఇంతకు ఇంతై పెరిగి ఆఖరికి ఎంత వరకూపోతుందోనని రామదాసు మనసొకసారి వణికింది. తను ఇలాటి నరమేధానికి, మేధావుల మేధలను కొనేసే ప్రయత్నానికి బలికాడు.తను ఈదౌర్భాగ్యపు పరిశ్రమలో చెడుపోకిళ్లకు శ్రీకారం చుట్టడు.

ఆ మాటే అందామని అనుకున్నాడు రామదాసు.

కానీ ఇంట్లో పరిస్థితి ఆయనకొక్కసారి గుర్తొచ్చింది. ఆశయాలను నమ్ముకొని ఆకలితో కాపురం చెయ్యటంకన్నా, ఆశయాల గురించి మర్చిపోవటమే మంచిది. రామదాసు ఓడిపోవటానికే సిద్ధపడ్డాడు.

తలవంచుకుని ఆ మాటే చెప్పాడు రామదాసు. ఆరోజు తర్వాత మళ్ళీ ఎపుడూ తన పేరు తెలుగుతెరమీద కనపడదన్న సంగతి ఆయన అపుడు ఊహించుకోలేకపోయాడు.

* * *

నాగరాజుకు ఈరోజు చిత్రసీమలో పరిస్థితి అంతా కొట్టిన పిండి అయింది. కొంచెం చాకచక్యం ఉంటేచాలు-ఇక్కడ ఓనమాలు రానివాడు సైతం రాజులాగ చలామణీ అవుతాడు. బతకటం వచ్చినవాడైతే తానొక్కడేకాదు, మరో నలుగుర్ని బతికించగలడు. సొంత తెలివి అనేది కాసింతయినా లేకుండానే అసాంతం కీర్తి సొంతం చేసుకోవచ్చు. తను చేస్తున్న పనీ అదే! గతంలో ఎవ్వరూ అనుసరించని- కనీసం వాళ్ళకు తోచని విధానాలను సైతం తానిపుడు అమలులో పెడుతున్నాడు.

ఎంతగా మార్చగలిగాడు తాను ఈ పరిశ్రమ పద్ధతులను? గతంలో కేవలం ఒక్క సినిమా తీయటానికి ఏడాదికాలం పైనే పట్టేది! ఇపుడు తాను ఏక కాలంలో ఆరు చిత్రాలకు దర్శకత్వం వహిస్తున్నాడు. మరో డజను చిత్రాలకు వివిధ స్థాయిల్లో జరుగుతున్న నిర్మాణాన్ని పర్యవేక్షిస్తున్నాడు. కొన్నిటికి మాటలు, మరి కొన్నిటికి పాటలు ఏకకాలంలో తన ఫ్యాక్టరీలో తయారవుతున్నాయి ఇంత జరుగుతున్నా తాను ఏం చేస్తున్నట్లు? కేవలం నాలుగైదు అక్షరాలనో, అయిదారు డైలాగ్‌లనో అటూఇటూ మార్చటం-అంతేకదా.

బతకగలిగినవాడికి పదివేల మార్గాలు అన్న సంగతి అతనికిపుడు అవగాహన అయిపోయింది.




నాలుగు. గంటలకు ఇంకా తూప్పు




తెల్లవారమునుపు లేస్తాడు నాగరాజు. నిద్ర లేచీలేవగానే ఓ అరగంటసేపు కాలకృత్యాలకు కేటాయించుకుంటాడు. ఆ తర్వాత నీటుగా డ్రెస్ చేసుకొని అయిదుగంటలకు రెడీఅయిపోతాడు 'పని చేసుకునేందుకు' అప్పటికే స్క్రిప్టు అసిస్టెంట్స్ రామదాసు, రాజు, ధర్మమూర్తి సిద్ధంగా ఉంటారు. అది స్టోరీ డిస్కషన్ సెషన్ అన్నమాట. గతంలో తమకోసం ఆలోచించి, ప్రజల కోసం మంచి కథల్ని సిద్ధంచేయగలిగిన ప్రసిద్ధ రచయితలు వీళ్లు ముగ్గురూను! కానీ ఇపుడు అవతారం మార్చేశారు. పూర్తి వ్యాపార విలువలతో ఉండే ప్రేమకథల్ని తయారు చేయటం వీరి డ్యూటీ.

రామదాసు ఒక కథ సిద్ధంచేసి తెస్తే దాన్ని మరోరకంగా ఆలోచించి ఇంకోకథ తయారుచేస్తాడు రాజు. ఆ రెండు కథలనూ కలిపి ధర్మమూర్తి మూడోకథ తయారుచేస్తాడు. వాటి మీద మళ్లీ చర్చలు, మెరుగులు దిద్దటం - ఇలా ఉంటుంది ఈ స్టోరీడిస్కషన్ సెషన్. కథాచర్చ అని మొదలుపెడతారు సంభాషణలను. రామదాసు తాను సిద్ధంచేసిన కథను ఎలా తీస్తే బాగుంటుందో, ఒక్కో పాత్ర ఎలా రూపొందుతోందో, పాత్రస్వరూపం ఎలా ఉంటుందో అన్నీ వివరంగా చెపుతూ పోతాడు. దానికి తోటి రచయితలయిన రాజు, ధర్మమూర్తి మెరుగులుదిద్దుతూ వుంటారు. అపుడపుడు ఏమీ అనకపోతే బాగుండదనే పద్ధతిలో నాగరాజు 'పోనీ ఇలా చేస్తేనో...?'అని ఏదో ఓ సూచన నిస్తాడు. దానిమీద కొంతసేపు చర్చించి ఆఖరికి ఆ సూచనను అమలుచేస్తే ఉండే ఇబ్బందులు, కథ పాడయ్యే అవకాశాలు ఉంటాయని నిర్ణయిస్తారు. దానితో నాగరాజు 'సరే, మీరు అనుకొన్నట్లే కానివ్వండి' అంటాడు. కథమీద మళ్లీ చర్చలు కొనసాగుతాయి ఇలా ఓ వారం రోజులుకథను డిస్కస్ చేస్తారు. అప్పటికి ఆ కథకో స్వరూపం వస్తుంది. ఆ తర్వాత దాన్ని తెరమీదకు అనువదించే స్క్రీన్‌ప్లే గురించి ఆరంభం అవుతుంది. కథను ఎలా చెపితే తెరమీద రక్తికడుతుందో అది మరో ఇద్దరుముగ్గురు అసిస్టెంట్స్ చూస్తారు. దానికోసం వేరే సెషన్స్ ఉంటాయి. ఇదంతా దాదాపు ఉదయం ఏడు - ఎనిమిది గంటలవరకూ సాగుతుంది.

అపుడు మరో అరగంట కాఫీ, బ్రేక్ ఫాస్ట్ కోసం బ్రేక్ తీసుకొంటాడు నాగరాజు. ఆ తర్వాత షూటింగుకు బయలుదేరటం! కారు వెడుతోంటే కార్లోనే రికార్డయిన పాటలు వినటం, ఆ పాటలకు పిక్చరైజేషన్ ఎలా ఉంటే బాగుంటుందో అసిస్టెంట్ డైరెక్టర్స్‌తో చర్చించటం..ఉండే హోటల్ నుంచి షూటింగు జరిగే స్టూడియోవరకో, కాకపోతే లొకేషన్‌వరకో జరిగే ప్రయాణ సమయంలోనే ఈ పిక్చరైజేషన్ డిస్కషన్ జరుగుతుంది. అప్పటి విశేషాలన్నీ వీలయితే రాసుకోవటమో, లేకపోతే రికార్డుచేసుకోవటమో జరుగుతుంది.

స్టూడియోకు చేరుకొనేసరికి తొమ్మిదిన్నర, పది అవుతుంది. ఒకసారి సెట్లోకి తొంగిచూడటం- తీసే సీన్ ఏదో నిర్ణయించి ఉంటుంది గనక ఒక్కసారి సిద్ధమైన స్క్రిప్టుని చేతపట్టుకొని, ఓసారి చదివి అక్కడక్కడ చెయ్యి చేసుకొని, 'సరే ఇపుడే వస్తా చూస్తూండండి' అని చెప్పి ఏ స్టూడియో ఓనర్‌తోనో, కాకపోతే వచ్చిన మరో

నిర్మాతతోనో ఒప్పందంకోసం చర్చలలో పడటం, ఈలోగా 'అంతా రెడీసార్' అని సెల్లోంచి కబురువస్తే మరోసారి లోపలకు తొంగిచూడడం, అసిస్టెంట్ కు చెప్పి మళ్ళీ వెనక్కురావడం మామూలుగా జరిగేపని. 'తమకు ఇలాగయినా ఛాన్స్ లభిస్తోందిగదా' అని అసిస్టెంట్స్ తృప్తి పడుతోంటే తనపని జరుగుతోందిగదా అని నాగరాజు సంబరపడటం మామూలు విషయం. ఒకే దెబ్బతో రెండు పిట్టలు: 'అసిస్టెంట్స్‌కు నాగరాజు ఇచ్చేంత స్వతంత్రం మరే దర్శకుడు ఇవ్వడు' అనే మరో పబ్లిసిటీకూడా కోరకుండానే వచ్చి పడుతోంటుంది.

ఇలా ఉంటోంది నాగరాజు జీవితంలో ఓ దినచర్య.

ఓపక్క స్టోరీ డిస్కషన్, మరోపక్క స్క్రీన్‌ప్లే సిద్ధంచేయటం, ఇంకోపక్క కాస్ట్యూమ్స్, ఇంకోవేపు మ్యూజిక్ సిట్టింగ్, మరోవేపు బిజినెస్ డీల్స్ ... 'రోజుకు పద్దెనిమిది గంటలు, ఇరవైగంటలు పని చేస్తున్న పనిరాక్షసుడు' అనిఓ పత్రికరాస్తే మరోపత్రిక 'పరిశ్రమకు కొత్తహోప్' అంటోంది. నాగరాజును పొగడని పత్రిక అంటూ ఉండటంలేదు. నాగరాజును కీర్తించని సంఘంఅంటూ ఉండటంలేదు. ఎవరి అవసరం వారిది. 'పత్రికలలో తన గురించి ఎంత అధికంగా ప్రచారంఉంటే అంతమేలు తనకు' అని నాగరాజుకు తెలుసు. ప్రజలలో తన గురించి బాకాలు పట్టేవాళ్ళున్నంతకాలమూ తనకు ఢోకా లేదని నాగరాజుకు తెలుసు.

అందుకే పత్రికా విలేఖరులకు గోష్ఠులంటూ జరుపుతాడు. 'గోష్ఠి' అంటే



తాగుడు పార్టీ అని అందరికీ అర్థం అయిపోయింది. గతంలో ఇలావుండేవి కాపు ప్రెస్‌మీట్‌లు. తమ చిత్రంగురించి కొంత చెప్పేవారు, కొన్ని విశేషాలు తెలియజేసేవారు. ఒకటి రెండుపాటలు వినిపించేవారు. ఇపుడో-అదంతా ఒన్‌మాన్‌షో!ఒకేమనిషి చలనచిత్రరంగంలో ఎంతటి గొప్ప స్థానానికి చేరుకున్నాడో చెప్పటం అధికం. ఒకే మనిషి మరలా అన్నిరంగాల్లో రాణించగలుగుతున్నాడో చెప్పటం అధికం- ఆఖరికి తాము చెప్పింది రేపోమాపో పత్రికలలో అక్షరాల రూపంలోకి రావటానికి వీలుగా ఏదో ఓ కానుక అందించేవారు. ఒకసారి పెన్‌సెట్, ఓసారి బ్రీఫ్‌కేస్, ఓసారి ఫుల్ ఫిల్మ్ కాసెట్స్... ఇలా ప్రలోభాలు పలురకాలు!

ఇంతయినా నాగరాజుకు ఇంకా అసంతృప్తిగా ఉంటోంది. ఏదో బాధ అతన్ని ఎక్కడినుంచో తొలిచివేస్తోంది. ఆ బాధ ఏమిటో, ఎందుకలా తనను బాధపెడుతోందో గుర్తించే ప్రయత్నాలు నాగరాజు చేస్తూనే ఉన్నాడు.

ఆరోజు నాగరాజు ఇంటికి వెళ్ళేసరికి కుసుమ ఓ డ్రైవరుతో మాట్లాడుతోంది. నోట్లో కారా కిళ్ళీ, పైటను నిలువనీయమంటున్న పక్షాలు,తల్లో బంతెడుపూలు- అచ్చం నాయకురాలులాగా ఉంది! చూడగానే నాగరాజుకే చికాకుగా అనిపించింది. ఏమిటా డ్రైవర్‌గాడితో మాటలు అనిపించింది.

ఆ డ్రైవర్ వెళ్ళిపోయాక అడిగాడు నాగరాజు భార్య కుసుమను- ఏమిటా మాటలు అంటూ.

కుసుమ నవ్వింది-చిన్నగా, గర్వంగా.

"ఏమిటంటే చెప్పకుండా ఏ మి టా నవ్వులు?" అడిగాడు నాగరాజు.

"శంకర్‌గాడికి ఎక్కిస్తున్నాను"అంది కుసుమ అంతా చెప్పేశాననట్లు. నాగరాజుకు ఏమీ అర్థంకాలేదు.

"ఏమిటి ?"

"నిన్నపొద్దున వచ్చాడు నీకోసం. నువ్వులేవు. సర్లే సాయంత్రం వచ్చిపో ఓసారి. ఆయనలేకుంటే నాకుకొంచెం బజారులో పని ఉందన్నాను. రాలేదు వాడు. అదే అడుగుతున్నాను" అంది కుసుమ.

"ఏమిటా బజార్‌లో పని?"

"ఏదో ఒకటి. వెళ్ళి నాలుగైదు చీరలు కొనాలనుకున్నాను. ఈ పెద్ద డైరక్టరుగారి పెళ్ళాన్ని నేను. నా వాటం ఏమో పనిమనిషి పద్ధతి. అందుకే ఓ నాలుగైదు పట్టుచీరలుకొంటే పని జరుగుతుందనుకొన్నా. ఏదీ వాడు రాందే...."

నాగరాజు క్షణం భార్యకేసి చూశాడు. ఆ క్షణంలోనే అర్థంఅయింది. పెళ్ళాంకు లేనిహుందా రావాలంటే పట్టుచీరలు ఉంతటమే శరణ్యం అనుకొన్నాడు.

"ఎందుకు రాలేదుట?"

"అదే అడిగాను. ప్రొడ్యూసర్‌గారి పనిమీద వెళ్లాడట. అక్కడే అర్ధరాత్రివరకూ అయిపోయిందట. అందుకని రాలేదన్నాడు"

"ఇందులో ఏమిటి ఎక్కడిదీసేది?"

"ఏడిచినట్లేఉంది తెలివి. ఇలాటపుడే చక్కపెట్టుకోవాలి మన పద్ధతంతా. ఇలాంటి చిన్నచితకా వాళ్ళను చేతిలో పెట్టుకొంటే ఇక్కడసలు ఎదురే ఉండదు మనకు దేనికీ. అందుకేఅన్నాను వాళ్లతో 'రాత్రింబవళ్లు అలా పనిచేస్తే ఆరోగ్యం పాడైపోదురా. అయినా మీకూ పెళ్ళాం పిల్లలు లేరూ ? ఇంటికి పోరూ ? ఇలా పద్ధురా అబ్బి. అన్నిటికీ టైం. టైం ప్రకారం చేయాలిరా. రేటు ప్రకారం

కూలీ...పోసీ జీతం. ప్రైం ప్రకారంపని' అని నేర్పాను. ఓ యూనియన్ పెట్టుకోండిరా పిచ్చి మొఖాలూ అని చెప్పాను"

నాగరాజు నివ్వెరపోయాడు.

కుసుమ...కుసుమ ఎంతగా ఎదిగి పోయింది అనుకొన్నాడు.

ఇంకా కుసుమ చెప్తూనేవుంది. "ఓ సంఘం పెట్టుకోండిరా. దానికి కావాలి అంటే నేను ఉంటాను- మీకు వెనుక అండగా, పెద్దగా. ఆలోచించండిరా అన్నాను. అంతే" అంది కుసుమ.

"ఇలాటి అనవసరమైన విషయాల్లో జోక్యం చేసుకోవటం దేనికి?" అన్నాడు నాగరాజు కుసుమతో.

"అనవసరమైన విషయమా? బలే అన్నావులే! ఇలాటి చిన్నచిన్న వాళ్ళని మన చెప్పుచేతల్లో ఉంచుకొంటే పెద్దపెద్ద వాళ్ళంతా అలాగేలొంగివస్తారు. మొక్కై వంగనిది మానై వంగుతుందా?" అని అడిగింది కుసుమ.

నాగరాజుకు నవ్వొచ్చింది. ఎలాటి సామెత ఎలా అయిపోయింది. ఇలాటి మనిషి ట్రేడ్‌యూనియన్ విషయాల్లోకి దిగితే ఇంకేముంది!

అయినా ఇలాటి ఆడవాళ్ళకు ఎంత చెప్పినా అది తలకెక్కదు. ఆ తల వెంట్రుకలు ఏపుగా పెరగటానికేతప్ప ఇంకెందుకూ పనికిరాదు. మహా అయితే, ఎవరో అన్నట్లు నెత్తిమీద నాలుగు చిక్కుడు గింజలు పాతితే వారంతర్వాత కూరకు వెతుక్కో-వల్సిన పనివుండదు.

నెమ్మదిగా అన్నాడు నాగరాజు. "నీ ఇష్టం! ఏదైనా చెయ్యికానీ నా నెత్తిమీదకు తెచ్చిపెట్టకు ఏ పెంటా! సరేనా? ఏదో కడుపులో చల్లకదలకుండా సాగుతోంది కలం. దాన్ని కంగాళీ చేసెయ్యకు"

"అలా అన్నావు బాగుంది. చూడు ఇంక ఎలా తయారుచేస్తానో పిళ్ళను. జనంఅంతా ఒకటేగా చెప్పుకోవాలి నా పేరు. కుసుమ అంటే అందరూ కుర్చీల్లోంచి నిలబడాలి. అలా తయారుచేస్తాను ఈ జనాన్ని"

నాగరాజుకు నవ్వొచ్చింది. ఉట్టికిఎగరలేనమ్మ స్వర్గానికి ఎగరటం అంటే ఇదేననుకొన్నాడు. ఆ మా టే అన్నాడు కూడాను.

కుసుమ నవ్వింది. "సర్లే. నాకు చెప్పు ఇది. నువ్వుమాత్రం ఇక్కడికి దేనికి వచ్చావు? ఇంట్లోంచి పారిపోయి కదూ-పాలేరాడికి క్షమాపణచెప్పి కదూ-ఇపుడు ఇక్కడికివచ్చి నాకు నీతులుచెప్తున్నావ్"

నాగరాజు ఉలిక్కిపడ్డాడు.ఏమంటోంది? అంటే ఇది ఓరకం బ్లాక్ మెయిలింగ్ అన్నమాట. నా రహస్యం చేతిలో ఉంచుకొని నాకే గుర్తుచేస్తోంది. ఇదే అస్త్రం అన్నిచోట్లా ప్రయోగిస్తుందా ఏం కొంపదీసి. పైగా డ్రైవర్లుఅంటే అయ్యగార్ల - అమ్మగార్ల అన్నిరహస్యాలూ స్పష్టంగా తెలిసి ఉండే జనంవాళ్ళు. అలాటివారికి ఇలాటి విద్యమప్పితే..అమ్మో ఈఆడది చక్రాన్ని తిప్పేయగలదు.

ఒక్కసారి నాగరాజుకు భార్యంటే భయంవేసింది. మనసొకసారి వణికింది

• • •

సీతా స్వయంవరం' సీత జీవితంలోనే ఓ గొప్ప ఘట్టం. రామాయణకావ్యం ప్రాణం పోసుకున్నది నిజంగా ఆ ఘట్టంలోనే. స్వ య ం వ ర ం సమయంలో రావణునకే అవమానం జరిగి ఉండకిపోతే, రాముడే ఆ హరుని విల్లు ఎక్కుబెట్టబోతూ పుటుక్కున విరిచెయ్యకపోతే, సీతాసాధ్వి సిగ్గుతో రాముని మెడలో





ఆ వరమాలను వేసి సొంతం చేసుకోక పోతే రామాయణం ఉండేదిగాదు.

కానీ ఈ 'సీతాస్వయంవరం' వేరు. అది వాల్మీకి చేతిలో ప్రాణం పోసుకున్న భారతీయుల పవిత్రగ్రంథం అయితే- ఇది అతుకుల బొంతగా ఆవిర్భవించ బోతున్న ఓ చలనచిత్రరాజం. కార్మికుల జీవితాల్లోకి డబ్బుండేవాళ్లు తొంగిచూస్తే ఎలా ఉంటుందో విప్పిచెప్పేకథ. కడుపు కాలే కష్టజీవుల కథల్లో డబ్బుండే మను షలు ఇమడరు. పీరిది వడ్డించిన విస్తరి. అటుపక్క అలమటింపజేసే ఆకలి. అయినా ఏదో మసిపూసి మారేడుకాయ చేసి నాలుగు డబ్బులు చేసుకోవాలనే ప్రయత్నం. సీత అనే ఓ డబ్బుండే గొప్పింటిఅమ్మాయి రామయ్య అనే ఓ కార్మికుడిని పెళ్లాడటం ఈ చిత్రకథ. సీతా స్వయంవరం కాబట్టి ఆ తర్వాత ఓ రావణుడి పాత్ర అవసరం. అందుకే ఆ పాత్రకు పాంటూ చొక్కా తొడిగి...ఓ నదిఒడ్డున ఇల్లు నిర్మించి...అది లంకా ద్వీపమన్నమాట- అలా సాగుతుంది ఈ సీతాస్వయంవరం కథారాజం.

రామయ్యగార్ని సోషలైజ్ చేస్తున్నాం అంటూనే కథను నాగరాజు సొంతం చేసుకొన్నాడు.

ఆకథలో సీతాదేవి కాంచనమృగాన్ని చూసి పులకరిస్తుంది. భర్తను అది తనకు తెచ్చిఇమ్మని కోరుతుంది, పోరుతుంది. అదేసన్నివేశం ఇందులో ఇంకో విధంగా మారిపోయింది. సీతాదేవి ఓ సుందర భవనాన్ని చూస్తుంది. అది తన స్వంతం కావాలంటుంది. కానీ ఈ రాముడు బీద జనానికి ప్రతినిధి కనుక ఇదంతా ఓ కల అన్నారు.

డ్రీమ్‌సీక్వెన్స్ కూడా కథలోకి నడుచుకొంటూ వచ్చేసింది.

ఎటొచ్చీ ఇక మిగిలింది ఆ సీన్‌కు కావల్సిన అందమైన పాట.

చిత్రరంగంలో కవులెందరో ఉన్నారు. కలంపట్టి పాండీబజారుకుచేరినవారందర్నీ కవులుగానే పరిశ్రమ గుర్తించింది. ఆ గుర్తింపు మాత్రం 'కవీ' అనో, 'కవి గారూ' అనిపిలవటంతోనో ఆగిపోతుంది. అలాటి కవికి పిలిచి ఓగీతం రాసే అవ కాశం మాత్రం ఎవరూ ఇవ్వరు.

రామదాసు ఆ సన్నివేశానికి మంచి పాట రాయగలిగేస్థోమత ఒక్కదేవశర్మకే ఉందని నాగరాజుకు చెప్పాడు.

"ఆయనా? అంత పండుముసలి- ఆయనేం రాస్తాడు ఇలాటిపాట?" అని అనేశాడు నాగరాజు ఈసడింపుగా.

"అలా అనొద్దు. ఆయన సంగతి మీకు తెలీదు. ఆయనను వెంట్రుకలు నెరిసాయే తప్ప, పదాలు ఇంకా యవ్వ నంలోనే ఉన్నాయి. కలంపట్టి క్షణం ఆలోచిస్తే కవిత్వం ఆ కలం వెంట జాలు వారుతుంది. కవితాకన్య ఆయనను స్వాధీనం చేసుకొంటుంది. అక్షరాలన్నీ అందాలు చిందిస్తూ ఆయన కలంవెంట పరుగులుతీస్తూ వస్తాయి"

నాగరాజు నవ్వాడు.

"దాసూ! నువ్వూ కవిత్వం చెప్పే స్తున్నావే!" అన్నాడు.

రామదాసుకు తల కొట్టేసినట్లయింది. 'నువ్వు' అనడమే ఓ అవమానం. పైగా అక్షరాలు నమ్ముకొని బతుకుతున్న తనను 'కవిత్వం చెప్తున్నావే' అని వెక్కి రించటం ఇంకో అవమానం! లక్ష్మి సరస్వతులు ఒకచోట కలిసి కాపురం ఉండవని ఎవరన్నారోగానీవారికిజోహార్లు. నిజంగా అవి కలిసి బతకవన్నమాట!

లేకుంపే తానేమిటి– ఇలా అవమానాన్ని దిగమింగుకొంటూ ఉండిపోవటమేమిటి?

నిజానికి ఈ అవమానం తనదికాదు. అక్షరం రాయగలిగిన ప్రతివాడిదీనూ. డబ్బు పరిశ్రమను పాలిస్తోంది. గతంలోనూ ఇంతేకానీ., అప్పటి పరిస్థితులే వేరు. ఏ ఒక్కరూ పరిశ్రమను ఇలా తోలుబొమ్మలాటలాడించలేదు. ఏఒక్కరి చేతిలోనూపరిశ్రమ ఇలా కీలుబొమ్మ అయి నిలిచిపోలేదు. లక్ష్మితోబాటుగా సరస్వతీ సహజీవనం చేసిందే కానీ ఇలా కాళ్ళమీద పడి అవమానాన్ని భరిస్తూ కాలం గడపలేదు.

రామదాసు క్షణంసేపు అవమానాన్ని భరించి తర్వాత దిగమింగుకొన్నాడు.

“నేను చెప్పేది దేవశర్మగారి సంగతండీ” అన్నాడు రానుదాసు.

“ఏదీ, ఏ సంగతీ చెప్పందే ఇంకా మీరు” మళ్ళీ వేళాకోళం ఆడాడు నాగరాజు.

‘కవీ...ఏమి దౌర్భాగమయ్యా నీది’ అనుకున్నాడు రామదాసు.

ఏం చెప్తాడు తను దేవశర్మగురించి? ఏం చెప్తాడు తను చరిత్ర సృష్టించిన ఆ మహనీయునిగురించి? ఆంధ్ర కవిత్వం దిక్కూదశా లేకుండా కదిలిపోతున్న రోజుల్లో ఓమార్గం చూపినవ్యక్తి దేవశర్మ. దారిపక్కగడ్డిపువ్వులో అందాలున్నాయి. అరక్షణం నిలిచి వాటిని గుర్తించి వెళ్ళమని చెప్పింది దేవశర్మ కవిత్వం. ‘నిన్న కురిసిన మంచు నేటికి అందాలు కురిపించు’ అంటూ గతంలోని అందాల్ని అందంగా చెప్పిన కవి దేవశర్మ. ప్రకృతిలోని అణువణువునా అందం ఉందనీ, ఎటొచ్చీ దాన్ని గమనించే ఓపికా, సమయమూ మాత్రమే నేటిప్రజకు కొరవడిందనీ గుర్తించినవారు దేవశర్మ. చిన్న చిన్న వాటిలో గొప్ప గొప్ప అందాల్ని దర్శించమని చెప్పిన కవి దేవశర్మ. ఆలోచనలన్నీ చెల్లాచెదురైపోతున్న కవులకు ఓ మార్గదర్శనం చేసినవాడు దేవశర్మ. ఆయన చెప్పిన మల్లెపూల కవిత్వం ప్రజలందర్నీ మత్తులో నింపింది. నిన్నటి వరకు ప్రకృతిలో అందాలు ఉంటాయని సైతం గుర్తించని ప్రజ ఇపుడు ఆ అందాలుఉన్నాయని గుర్తించటమే కాదు, ఆ అందాలకోసం అన్వేషణ సైతంచేపట్టనారంభించారు. కవిత్వంలో అందానికి పెద్ద పీట వేసేవాడు దేవశర్మ. నలుగురూ నవ్వితే నవ్వనీ నా గొడవనాది,నా కవిత్వం నాది అనుకుంటూ కవిత్వంచెప్పి దేవశర్మను చూసినలుగురు నవ్వలేదుసరికదా, పదిమందిఆయనను అనుకరించారు.ఆయన చెప్పిందే అసలైన కవిత్వం, లాలిత్యం ఆ కవిత్వం సొమ్ము అనుకొని గర్వపడ్డారు. అలాటి వ్యక్తి గురించి ఏంచెప్తాడు తను? ఎంత చెప్పి ఆయన ఔన్నత్యాన్ని అద్దంలో చూపించగలడు తను??




రామదాసు ఏమీ చెప్పనేలేదు.

రామదాసు మౌనం నాగరాజుకుఎంతో చెప్పింది.

వెంటనే దేవశర్మ కోసం కారు పంపించాడు. దయచేసి వెంటనే రావల్సిందిగా




కబురు పెట్టాడు.

దేవశర్మ రానేవచ్చాడు. ఒంటిమీద శాలువ, శాలువకిందనుంచి జారుగా వేలాడుతున్న కుర్తా, నెత్తిమీద గిరజాల జుట్టు, నోట్లో కావాకిళ్ళీ – వేరే ఎవరూ ఆయన్ను పరిచయం చెయ్యనక్కర్లేదు ఆయన్నో కవి అంటూ – ఆ అవతారం చెప్పేస్తోంది; ఆ ముఖంలోంచి వెలువడుతున్న కవిత్వపు కళ చెప్పేస్తోంది.

"రండి, రండి" అన్నాడు నాగరాజు ముఖంలో నవ్వు పూసుకొంటూ.

క్షణంకిందటపరోక్షంగానో, ప్రత్యక్షంగానో అదేకవిని ఈసడించుకున్న పోలిక ఆ ముఖంలో రవ్వంత అయినాలేదు. కవుల పట్ల ఎంతగౌరవమో ఇతనికి అన్నంత అభిప్రాయంకలుగజేసేలావుందిఆముఖం.

రామదాసుకు నవ్వొచ్చింది. మనిషి అన్న ప్రతివాడు ఒక నటుడేనన్నది ఆయనకు తెలీంది కాదు. కానీ నాగరాజు మటుకు మహానటుడు అనుకొన్నాడు.

'సన్నివేశం ఇది. పాట ఇలా కావాలి' అంటూ రామదాసు దేవశర్మకు అన్నీ చెప్పాడు. ఆ సీన్స్‌లో ఏం చెప్పాలనుకొంటున్నది, ఏయేపాత్రలు ఉంటున్నది, పాత్రలస్వభావం ఏమిటోఅన్నీరామదాసు వివరించి చెప్తోంటే నాగరాజు ఆ వైపు కూర్చుని తల వూపుతూ అవునన్నట్లు, అదంతా తన ఆజ్ఞల పైనే జరుగుతున్నట్లు ఉన్నాడు.

అంతావిన్నాడు దేవశర్మ.

పాట రేపటికి ఇస్తానని చెప్పాడు. రేపు ఉదయం ఎవరిచేతనైనా పాట పంపిస్తానని చెప్పాడు. అయితే అందులో ట్యూన్ పేరిటో, సంగీతం పేరిటో ఓ అక్షరం

కూడా అటూ ఇటూ మార్చరాదని చెప్పాడు. ఏ అక్షరాన్ని మార్చాల్సిఉన్నా అందుకు తననే పిలిపించాలని స్పష్టం చేశాడు.

నాగరాజు అన్నిటికీ నవ్వుతూ అంగీకరించాడు. దేవశర్మ తనకు ఆ పాటకు ఎంత పారితోషికం కావాలో అదీ చెప్పాడు. నాగరాజు దానికీ సరే అన్నాడు.

దేవశర్మ 'పని ముగిసింది కదా' అన్నట్లు చూసి బయటకు నడిచాడు.

నాగరాజుకు మిగిలిపోయిన సమస్య ఒకటే ఉంది ఈ ఒక్కపాటతో సినిమా అంతా స్క్రిప్టువరకూ సిద్ధం అయిపోయి నట్లే. మిగిలిందల్లా నటీనటుల్ని ఎన్నుకొని రంగంలోకి దిగటమే!

సీత పాత్రకు ఎవర్ని ఎన్నుకోవాలనేదే ప్రశ్న. తెలుగు తెరమీద ఆ పాత్రను పోషించగలిగే శక్తి సామర్థ్యాలు చాలా మందికే ఉన్నాయికానీ పాత్రను గ్లామరస్‌గా చిత్రీకరించటం అవసరం అనిపించింది నాగరాజుకు. అదీ రామదాసు ఇచ్చిన సలహాయే.

"పురాణాల జోలికి పోతున్నాం. వాటి పవిత్రతను మంటగలుపుతున్నాం అని ఒక్కరంటేచాలు, సినిమామీద అంటీ పబ్లిసిటీ పెరిగిపోయి సినిమా నాశనం అయిపోతుంది! ఆ గొడవ రాకుండా, ప్రజలకు ఆ ధ్యాసే కలుగనివ్వకుండా సినిమా అంతాగ్లామర్‌తో నింపేస్తేసరి!" అన్నాడురామదాసు.

నాగరాజుకు ఈ సలహానచ్చింది. గ్లామర్‌గా ఉండేపిల్ల ఎవరున్నారని ఆలోచిస్తే అతనికి కుమారి గుర్తుకొచ్చింది.

కుమారి అసలు పేరు రోజారాణి. పెద్దాపురం పెద్ద వీధుల్లో అన్ని కళలకు పెద్ద పీటలు వేసిన కుటుంబంలోంచి వచ్చిన పిల్ల. పిటపిటలాడే వయసు. ఉరకలు తీయించే సొగసు. ఉడికి ఊరించే అందాలు. వీటన్నిటికీ తోడు అంతో ఇంతో నటన కూడా వచ్చు. ఇదీ వంశ పారంపర్యంగా అబ్బిన విద్యే. మనిషి దగ్గర, మనిషికో విధంగా నటించటం ఆమె వృత్తి ధర్మం. ఆ వృత్తి ధర్మాను సారమే కుమారి కూడా నటనను నింపింది.

నాగరాజు ఆ రోజు సాయంత్రమే నిర్మాతతో మాట్లాడాడు. ఫలానా స్టార్ అయితే బాగుంటుందని చెప్పటం వరకే. ఆ తర్వాత బరువు బాధ్యతలంతా నాగరాజువే. నాగరాజుకు ఈ రోజున్న పేరు ప్రతిష్టలు అలాటివి. ఆయన వెళ్ళి అడిగితే కథ ఏమిటి, కాకరకాయ ఏమిటి అని ప్రశ్నించకుండానే నటించేందుకు ఒప్పుకొనేందుకు ప్రముఖ తారాగణం అంతా సిద్ధంగా ఉంటోంది.

అందుకు కారణం ఏమిటంటే ఓ నటుడు 'ఆఫ్‌ది రికార్డ్'గా నిజాలెన్నో చెప్పాడు. "నాగరాజుకు టాలెంట్ ఉందని అనుకోం. బతికేమార్గాలు తెలుసు. ఫిల్మ్‌ను బతికించే పద్ధతులు తెలుసు. అతని దగ్గర నలుగురు అసిస్టెంట్లు ఉన్నారు-స్క్రిప్టు వరకు చెప్తే. వీళ్ళంతా ఎవరికివారు తమ ప్రత్యేక పద్ధతుల్లో ప్రత్యేకంగా సినిమాలకు స్క్రిప్టులు రాసినవాళ్ళు, ఎవరికి వాళ్ళు తమ స్వంత పద్ధతిలో రాసి సినిమాను నిలబెట్టగలిగినవాళ్ళు. అలాటిది నాలుగు బుర్రలు ఏకమైతే ఇక చెప్పేదేముంది? స్క్రిప్టు ఎంత పకడ్బందీగా ఉంటుందోఅలాగే టెక్నికల్‌గాకూడానూ! ఉండే మంచి టెక్నీషియన్స్ అంతా ఆయన గుప్పిట్లోనే కదా! మిగిలిన యూనిట్స్‌లో షూటింగ్ అవటం, డబ్బి

 

రావటం అవన్నీ ఎపుడో జరిగే పనులు. ఎక్కువ మొత్తాలకు సంతకం చేయించు కొన్నా, చెప్పిన మొత్తం సరైన సమయానికి లభించి తీరుతుందనే ఆశ ఈ టెక్నీషియన్లది. అందుకే...." అంటూ బిజీ దర్శకుడు నాగరాజు జీవితంలో విజయాలకు రహస్యాలు చెప్పాడు ఓ నటుడు.

కానీ ఈ పద్ధతివల్ల సాంకేతిక నిపుణులు, కళాకారులు వ్యక్తిగతంగానూ, పరిశ్రమ ఏకమొత్తంగానూ దెబ్బతినవా అంటే "కొత్త పద్ధతి ఇది. గతంలో లేనిదిది. కొంచెం లోతుగా పరిశీలించి, కొంచెం టైమిచ్చి చూస్తేగానీ లోతు పాతులు, లోటుపాట్లు తెలీవు. దేనికైనా కొంచెం టైమిచ్చి చూడడం అవసరం కదా" అన్నాడా నటుడు.

ఈ అభిప్రాయాలు నిజానికి ఒక్క నటుడివే అయినా మొత్తం పరిశ్రమలో అందరి అభిప్రాయాలూ అలానే ఉన్నాయి. అందుకే కొత్తోవింత అనే పద్ధతిలో ఈ విధానానికి ఓ ట్రయల్ కోసం కొంత టైం ఇచ్చారు అందరూ!

నాగరాజు కుమారి ఇంటికి వెళ్ళేసరికి కుమారి అపుడే షూటింగ్‌నుంచి వచ్చింది. అలసటగా ఉంది ఆమె ముఖం అయినా ముఖం మీద రంగులాగే, కొంత ఉత్సాహాన్నీ పులుముకుంది. నాగరాజంతటి డైరెక్టర్ రావటం అంటే తనకూ అది ఛాన్స్. ఇపుడిప్పటి పరిస్థితి చూసుకొంటూంటే ఏమంత ఆసక్తికరంగాలేదు పరిస్థితి. చేతిలో ఉన్న పాత్రలన్నీ కేవలం గ్లామర్ పాత్రలే. రెండు మూడు డ్యూయెట్లు, ఒకటి రెండు ప్రేమ సన్నివేశాలు, ఒకటి రెండు ఫైట్ సీన్లూ-ఇలా ఉండే సినిమాల్లో తన పాత్రలకో వ్యక్తిత్వం ఎలా ఉంటుంది? ఆ పాత్రలు ప్రజలను ఎలా ఆకట్టుకొంటాయి? ఏదో ఒక గాడిలో నడుస్తోంది బండి. ప్రజలకు విసిగెత్తిన రోజున బండి తల్లకిందులవుతుంది. ప్రజలకు తనపట్ల ఉన్న అభిమానం కాస్తా అసహ్యంగా మారిపోతుంది. ఇపుడు తను కనపడితే హాలులో చెలరేగే కేకలు, గోల, తప్పట్లు కొన్నాళ్ళకు ఛీత్కారాలుగా మారిపోయే ప్రమాదమూ ఉంది. దాన్ని ఎదుర్కోవటం తప్పనిసరి. బండిని గాడి తప్పించి ఆఫ్ ది ట్రాక్‌గా చేసుకోవటం అవసరం.

నాగరాజు దగ్గర నలుగురు ప్రముఖులు ఉన్నారు అసిస్టెంట్లుగా. కెమెరా,సంగీతం, ఎడిటింగ్ వంటి వాటిలోనూ పేరున్న నిపుణులే ఉన్నారు. ఇలాటి యూనిట్‌లో పనిచేస్తే, పాత్రకూ తగినంత బలం ఉంది. తనకూ తగినంత ఫలితం ఉంటుంది. ఊక దంపుడు చిత్రాలు పదింటిలో నటించినా, ఇలాటి చిత్రం ఒక్కదానిలో నటిస్తే ప్రజలకు కొంచెం గుర్తుండే వీలుంటుంది. 'గ్లామరొకటేకాదు,కుమారిలో ప్రతిభకూడా ఉంది' అని పత్రికలు ప్రశంసించే అవకాశము ఉంటుంది. ఫలితంగా తాను మరో పది చిత్రాలపాటు నిశ్చింతగా బతికేయవచ్చు-అనుకొంది కుమారి.

నాగరాజుకు డ్రింక్ తెప్పించింది. తనో గ్లాస్‌లో ఆరంజి జ్యూస్ తెప్పించుకొంది.

"అదేమిటి మీరు...?" అన్నాడు నాగరాజు ఆశ్చర్యపోతున్నట్లు

"అబ్బే నేనెపుడూ... నోయే" అంది కుమారి

నాగరాజు నవ్వుకొన్నాడు.

కుమారి మంచి నటి. అటు తెరమీదే కాదు, జీవితంలో సైతం అద్భుతంగా నటించగలిగే స్తోమత ఉన్న నటి. ఇలాటి ప్రజ్ఞ ఉండేవాళ్ళచేత నటింపజేస్తే

తన చిత్రం నిజంగా చిత్రంకాక జీవితం లాగే తయారవుతుంది.

నాగరాజు టూకీగా 'కథ' అంటూ రెండు ముక్కల్లో చెప్పేశాడు లొకేషన్స్ ఎక్కడో చూచాయగా చెప్పాడు. ఇంకా నిర్ణయం కాలేదు కానీ బహుశా అదే ఫైనలైజ్ చేస్తామనీ చెప్పాడు. కథలో సీతపాత్రకు మిమ్మల్ని తీసుకోవాలనుకుంటున్నట్లు చెప్పాడు. షూటింగుటైము అదీ వివరాలు చెప్పాడు. కాల్ షీట్ వరసగా ఇరవయిరోజులపాటు అవసరం ఉంటుందనీ చెప్పాడు. కుమారి అన్నీ వింది. అన్నిటికీ ఊ అంది. కాల్ షీట్స్ విషయం డేట్స్ నిర్ణయం అయ్యాక చెప్తానంది. పారితోషికం విషయమూ సెటిల్ అయిపోయింది.

"అన్నిటిసంగతీ సరేగానీ, ఒకడ్రీమ్ సాంగ్ అందులోఉంది. దానికిమాత్రం కంటిన్యూవస్‌గా డేట్స్ ఇవ్వటం తప్పని సరి. ఎందుకంటే అది బహుశా కాశ్మీర్‌లో పిక్చరైజ్ చేయాలని ఉంది" అన్నాడు నాగరాజు.

కుమారి దానికి సరేనంది. భువిమీది స్వర్గం అంటారు కాశ్మీరాన్ని. దాన్ని ఇలా చూడగలగటం కుమారికి సంతోషంగా ఉంది.

నాగరాజు ఆరోజు రాత్రే నిర్మాతతో అన్ని విషయాలు మాట్లాడేశాడు. జయతో బాటుగా మిగిలిన స్టార్స్ విషయంకూడా సెటిలయిపోయింది. అందరికీ ఆ రోజు రాత్రే వారివారి స్తోమతలు, స్టేటస్‌లనుబట్టి కొందరికి తానే వెళ్ళిచెప్పాడు. కొందరికి అసిస్టెంట్ల ద్వారా కబురుపెట్టాడు. మరి కొందరికి ఫోన్ చేయించాడు.

డ్రీమ్‌సీన్స్ మాత్రం ముందుగా కాశ్మీర్‌లో తీయాలని నిర్ణయించు



కొన్నారు. ఆ తర్వాతే మిగిలిన చిత్రానికి లొకేషన్స్ వెతకటం!

దేవశర్మ రాసిచ్చేపాటకు ట్యూనింగ్, రికార్డింగ్ అయిపోయాక ఓ వారం రోజుల్లో కాశ్మీర్‌కు ప్రయాణం పెట్టుకోవాలని నిర్ణయించుకొన్నారు.

అన్నట్లుగానే మర్నాడు ఉదయం దేవశర్మ పాట రాసితెచ్చి ఇచ్చాడు. రామదాసుకు ఆ పాటఎంతో నచ్చింది. కాశ్మీరంలో కల సీన్ అది. కలకు తగినట్లు ఉన్నట్లుగా కలం పలికిన గీతం అది. పాటలోని ప్రతి మాటలోనూ అందం తొణికిసలాడింది. కవిత్వం కవ్విస్తూ పలకరిస్తోంది. నిజానికి దేవశర్మ గతంలో ఎప్పుడూ ఇంతగొప్ప పాటరాసి ఎరగడని పించింది రామదాసుకు. ఆ మాటే అన్నాడు.

దేవశర్మ నవ్వేశాడు–"మీరూ రచయితలు. అందుకే మీకు అందులో గొప్పతనం కనపడింది. పదం పదం వెనకా నా తపన కనపడింది. మిగిలినవాళ్ళకు ఇంత జ్ఞానం ఎక్కడ ఉంది? మన బాధలెలా తెలుస్తాయి? ఏవో నాలుగుమాటలు రాసో, పేర్చేసో ఇచ్చేస్తే అదే పదివేలు అనుకొంటూ మన ముఖాన అయిదారువందలు పారేస్తారు. అంతేకదా?" అన్నాడు దేవశర్మ.

రామదాసుకు నవ్వొచ్చింది – ఆ అంటున్న పద్ధతికి. అయినా బాధవేసింది ఇప్పటి పరిస్థితికి.

దేవశర్మ అంటున్న దాంట్లో అక్షరం పొల్లులేదు–ఆయన కవిత్వంలో లాగానే! ఇచ్చేది ఎంత అని ఆలోచిస్తారే తప్ప, ఈ నిర్మాతాదర్శకులు రచయిత అందిస్తున్నదెంత అని ఆలోచించరు. ఒక్కపదం–ఒక్కటంటేఒక్కటే–ఒక్కదానికోసం సరయినపదం పడక రచయిత పడేఅవస్థ ఎవరికి తెలుసు? పదం పుట్టుక వెనుక ఉన్న ఆ ప్రసవవేదన ఎందరికి తెలుసు? ఎంతో శ్రమించిరాస్తే ఆఖరికి ఆ 'నాలుగు పదాలకూ' అన్న ట్లుగా 'ఇదెక్కువ'అన్నట్లుగా చూస్తూ ఓ అయిదొందలు పారేస్తారు. అదే మహాప్రసాదమనుకొంటూ ఆ రచయితో,ఆ కవో అంగలార్చుకొని వాటిని అందుకొని మరీ కదులుతున్నాడు. డబ్బు చెప్పినట్లు–పోనీ శాసిస్తున్నట్లు కలాన్ని కదుపుతున్నాడు.

సినీరచయిత ఎంత నిర్భాగ్యమైన స్థితిలో బతుకుతున్నాడీరోజు. ఎవరిదాకానో దేనికి దీనికి... తనో పెద్ద ఉదాహరణ. ఓ అనుభవజ్ఞుడు అన్నాడు గదా– 'సినిమాలకు రాయటం కష్టమే నోయ్! అక్కడ మన సిగరెట్లు మనల్ని కాల్చనీరు. మన తిండి మనల్ని తిననీరు. మననీళ్లు మనల్ని తాగనీరు ఇంతెందుకు, ఆఖరికి మన మాటల్నికూడా మనల్ని రాయనీరు' అని! ఎంతగొప్ప నిజం!

ఎవరో ఏదో చెపుతారు. దాన్ని 'ఇంక్' చేస్తాడు కవి! అంతే, ఆ మాటలమీద ఈ కవిగాడి పేరుంటుంది. రైటర్ వెనుక ఓ గోస్ట్ స్పీకర్...!

రచయితలకు ఇవన్నీ తెలీదా? కానీ కాలే కడుపు వీటిగురించి పట్టించుకో వద్దంటుంది. కాసుల గలగలల ముందు మిగిలినవన్నీ దిగదుడుచుకొనిపోతాయి. కవి నిరంకుశుడన్న ప్రతీతే మిగిలింది కానీ ఈరోజు కవి అందరిచేతిలోనూ కీలుబొమ్మే అయినాడు. ఎవరే భిక్షపారేస్తే అది అందుకొనే అధమ స్థాయిలో ఉన్నాడు కవి!!!

రామదాసు నిట్టూర్చాడు.

కానీ, ఎపుడో ఒకరోజు ఈనాడు

చేతులుకట్టుకొని నిలబడ్డ కలం బలం పుంజుకొని నిలుస్తుంది. తన వ్యతిరేక శక్తుల్ని చీల్చిచెండాడుతుంది! ఆ రోజు కోసం ఎదురుచూడ్డమే మిగిలింది తనకు!!

దేవశర్మ రాసిఇచ్చిన పాటను తీసు కెళ్ళి నాగరాజుకు అందించాడు రామదాసు.

"సరేలెండి. ఉంచండి చూద్దాం" అన్నాడు నాగరాజు నిర్లక్ష్యంగా.

రామదాసుకు ఆ నిర్లక్ష్యం చికాకు కలిగించింది. ఏమిటీ నిర్లక్ష్యం? ఏమిటా తిరస్కార ధోరణి?తను ఎంత బాగుందని అనుకోకపోతే తీసుకెళ్ళి అందిస్తాడు అంత వెంటనే. అయినా నాగరాజు దాన్ని గడ్డిపరకలాగా తీసిపారేశాడు.

రామదాసుకు బాధ కలిగింది.

అయినా బాధ తమాయించుకున్నాడు. గుండెల్లోంచి పొంగుకొస్తున్న కోపం మనసులోనే అణచుకొన్నాడు.

అయిదు రోజుల తర్వాత ఆ గేయం సంగీత దర్శకుడి దగ్గర చేరింది. పాట చదివి ఆ సంగీత దర్శకుడు సత్యమూర్తి "అద్భుతంగా ఉందండీ" అన్నాడు.

"ఇన్నాళ్ళకి మంచి కవిత్వం ఏమిటో చవి చూస్తున్నాం" అన్నాడు.

హార్మనీ ముందు కూర్చుని పైన ఆ కాగితాన్ని పెట్టుకొని కూర్చున్నాడు సత్యమూర్తి. ఎదురుగా ఓ పక్క చిన్న తబలాతో అసిస్టెంట్ రామజోగి. ఏదో తపోనిష్ఠలో పడ్డట్టుగా ఉండిపోయాడు సత్యమూర్తి – తననా ...తననా....అను కొంటూ. అంత గొప్ప పాటకు దీటైన సంగీతం సమకూర్చితే అది అపూర్వ మైన హిట్ అవుతుంది. ఎపుడైనా సరే పదాలను బట్టే పదాల మధ్య ఉండే సంగీ తానికి ప్రాణం ఉండేది. పదాలలోనే జీవం లేకుంటే ఆ పదాలకు మద్దతు ఇచ్చే సంగీ తంలో మాత్రం జీవం ఎక్కడనుంచి వస్తుంది?

ఓ అరగంటకు ఆ గేయానికి ఓ ట్యూన్ సిద్ధం అయింది.

కొన్నిపాటలకు అంతే! క్షణాల మీద ట్యూన్ దొరుకుతుంది. కొన్నిటికి వారం పది రోజులైనా ఏ ట్యూనూ దొరకదు. పాటల బదులు మాటల్ని రాసిస్తే ఇలాగే ఉంటుంది పరిస్థితి. ఆ మాటలకు మధ్య నాలుగు వాయిద్యాల ఘోష నింపేసి ఇస్తాడు తను. ఏం చేస్తాడు? 'వాళ్ళిచ్చే ముష్టి డబ్బులకు ఇది చాల్లెండి' అనేది కొందరు కవుల తత్వం అయితే. కవిత్వం బాగాలేదని చెప్పక ఆ మాటల మధ్యనే సంగీతం నింపే ప్రయత్నం చేస్తాడు తను!

కానీ ఇది అలాకాదు.

అక్షరం అక్షరం వెనుక అంతులేని కవిత్వం ప్రతిబింబిస్తోంది. అణువణువూ పులకరింపజేస్తోంది. అందుకే సంగీతం సైతం తనంతతానుగా సహజంగా జాలు వారింది. అందమైన కవిత్వానికి మరిన్ని అందాలు తొడిగింది.

మొత్తానికి పాట సిద్ధమయింది.

వచ్చి నాగరాజు విని పాటను ఓకే చేశాడు.

ఇక రికార్డింగ్ చేయడం మిగిలింది.




కాశ్మీరం.

భారతదేశానికి . మకుటం లేని సతత హరిత రాష్ట్రం.

చినార్ చెట్ల నీడల్లో చక్కగా వెలుగు నీడలను అందంగా డాల్ సరస్సుల్లోంచి చూసుకొంటూ మురిసిపోయే రాష్ట్రం కాశ్మీరం.

యుగాల తరబడి అది భువి స్వర్గంగా పేరుపొందింది.

కలలకు పుట్టినిల్లుగా విలసిల్లుతోంది. కలల పందిరిగా నిలిచి పిలుస్తోంది. ప్రతి ఋతువూ ఆ రాష్ట్రానికి కొత్త అందాలు తొడుగుతుంటుంది. అందుకే అది ఏడాది పొడుగునా వెలిసిపోని రంగులతో అందంగా దర్శనం ఇస్తూ ఉంటుంది.

ముందుగా వసంతం నెమ్మదిగా అతి నెమ్మదిగా చిగురాకుల్లోంచి చిందులేసు కొంటూ చిన్నగా వస్తుంది. ఆ తర్వాత వేసవి కాలం... ఎండలో తళతళ మెరిసి పోయే కొండలు, పర్వత శిఖరాలు.వాటితో కూడా పలిచి పలకరించే పలురకాల పువ్వులు. ఆ తర్వాత వస్తుంది శిశిరం... చెట్లన్నీ ఎర్రని రంగు పూసుకుంటాయి. శిశిరం కదలకుండానే శీతాకాలం... ఉన్న ట్లుండి రాష్ట్రం అంతా మంచుతో నిండి పోతుంది

ఏకాలమైతేనేం అందాలు విరజిల్లటం కాశ్మీరం ప్రత్యేకత.

ఏ ప్రాంతంవాడైతేనేం సాదరంగా ఆహ్వానించటమూ కాశ్మీరం ప్రత్యేకతే!

డాల్ ప్రాంతంలోని హౌస్ బోట్లలో కాలం గడపటం కొందరికిష్టం. చినార్ చెట్ల నీడల్లో చెలితో చెట్టాపట్టాలు వేసు కుని నడవటం మరికొందరికిష్టం. హిమా లయాల పాదాలచెంత పెద్దపెద్ద గోల్ఫ్ క్రీడాస్థలాల్లో ఆడుకోవటం ఇంకొందరి కిష్టం. స్కైయింగ్‌కు వాచ్చేవారు కొందరు, కాశ్మీర్‌లో గడిపాం అని చెప్పు కోవటానికి వచ్చేవారు మరికొందరు వీరందరితో బాటుగా షూటింగులకు వచ్చే జనం మరికొందరు.

కాశ్మీర్ రాష్ట్రానికి శ్రీనగర్ మరీ అందాన్ని తెచ్చిపెడుతుంది. పధ్నాలుగు వందల సంవత్సరాల నుంచీ శ్రీనగర్ నగర మధ్యలోంచి జీలంనది హుందాగా ప్రవహిస్తూ ఉంది.శ్రీనగర్‌కు మకుటంలా నిలిచే డాల్ సరస్సు నగరం నాలుగు ప్రాంతాల్నీ అందంగాపలకరిస్తూఉంటుంది. ఇటలీలోని వెనిస్‌లోనూ ఇంతే....నగర మధ్యంలోంచి ప్రవహించే జలాలు- వాటిమీద పయనాలు. ఇక్కడ శ్రీనగర్ డాల్ మీద షికారాలు వెనిస్‌లో గొండొలా అంటేఇక్కడ షికారా అని పేరు.జీలంనదికి ఉన్న తొమ్మిది వంతెనల కిందనుంచి పయ నించే షికారాలు హౌస్‌బోటుల వరకూ అన్ని సరుకులూ అందిస్తుంటారు. డాల్ సరస్సు ఒడ్డుకు కట్టిపడేసిన బోట్లు హౌస్ బోట్లు. చిన్న చిన్న గుడిసెల్లాటివి కొన్ని అయితే రాయంచల్లాటివి కొన్ని, రాజ మహల్‌వంటివి కొన్ని. కొన్నిటికి అంద మైన పేర్లు. ఒకటి తాజ్‌మహల్ అయితే- మరొకటి ముంతాజ్‌మహల్. ఇంకోటి ప్రైడ్ ఆఫ్ శ్రీనగర్ అయితే- ఇంకోటి పారడైజ్! నిజానికి అవన్నీ డాల్ లేక్ లోనే ఉంటున్నా, డాల్‌లేక్‌మాత్రం ఒకటికాదు. గాగ్రీబల్, లోకుట్‌డాల్, బోడ్‌డాల్ అనే మూడు కలిసి డాల్ లేక్ అయింది. ఓ హౌస్‌బోట్ అద్దెకు తీసు కొంటే జలద్వీపంలో కాపురం ఉన్నట్లే లెక్క.

కుమారికి పట్టాసంత సంతోషంగా ఉంది.

ఎన్నేళ్ళ కల ఇది! ఇన్నేళ్ళకు పండింది!

చీకటిపడింది. చీకటి అన్న పేరేగానీ

ఇంకా సంధ్య వెలుగులు ఉన్నట్లే ఉన్నాయి. హాల్ లేక్ అంతా దీపాలు పెట్టుకొంది. హౌస్‌బోట్ల మీదనుంచి దీపాలు లేక్ లోని నీళ్ళమీదపడి ప్రతిఫలిస్తున్నాయి.

కుమారి వచ్చి బోటు ముందున్న వసారాలో కుర్చీలో కూర్చుంది. దూరంగా యూనిట్‌వాళ్ళ బోటు సందడిగా ఉంది. ఇపుడింత సందడిగా ఉంటుందిగానీ ఓ అరగంట గడిస్తే ఆ సందడంతా తగ్గి యూనిట్ జనం నిద్రలోకి జారతారు. సాధారణంగా హోటళ్ళలోనే గడపటం అలవాటైనా ఇదో కొత్త అనుభవం కదాని కుమారి హౌస్‌బోటునే అడిగింది. దాంతో అందరికీ అదే అయింది.

దూరంనుంచి నీళ్ళు కదులుతున్న చప్పుడు వినిపిస్తోంది.

అటుకేసి చూసింది. చిన్నగా షికారా ఒకటి కదులుతూ వస్తోంది. కుమారి అటు కేసే చూస్తూ కూర్చుంది.

వేసవికాలం అయినా ఇంకా చలిగానే ఉంది.

ఇదో వింత అనుభూతి. వేసవికాలంలో స్వెట్టర్లు, శాలువలు కప్పుకోవటం అదో తమాషా!

షికారావచ్చి ఈ బోటుముందే ఆగింది. దీపం వెలుగులో కుమారికి షికారాలోంచి దిగుతున్న నాగరాజు కనపడ్డాడు.

'అబ్బ!' అనుకొంది కుమారి.

'ఒంటరితనాన్ని అనుభవించనీయక ఇదేం బాధరా' అనుకొంది. అయినా డైరెక్టర్‌గారు. కదలక తప్పిందికాదు. రావటంచూసికూడా లేచివెళ్ళకపోతే అదో రకం అగౌరవం అనుకొంటే... నాగరాజు ఇప్పటికే పేరున్న డైరెక్టర్లలో ఒకడయి నాడు. ఇపుడు జాగ్రత్తపడటమే సరయిన పని అనుకొంది!

కుమారి లేచి అటు నడిచింది.

నాగరాజు షికారాతో ఏదో చెప్పాడు. షికారా మళ్ళీ కదిలింది.

'అంటే-ఇపుడిపుడే కదలడన్నమాట!' అనుకొంది.

నాగరాజు వచ్చాడు, నెమ్మదిగా "ఎలా ఉంది?" అనడిగాడు.

కుమారి నవ్వింది.

ఎలా ఉందనడగటం దగ్గర ఆరంభం అయిన కుశలప్రశ్నలు అరగంటతర్వాత చాలాదూరం చేరాయి. హౌస్‌బోటు అక్కడే ఉందిగాని ఇద్దరిమధ్యా మాటలు ఎన్నో తీరాలు చేరివచ్చాయి. కుమారికి అంతట్లోనూ ఒకటే అర్థమయింది-నాగరాజు కాశ్మీర్ బేస్‌గా తీసుకొని మరో నాలుగు సినిమాలుతీయదలిచాడని!వాటిలో తనని తీసుకోవాలనుకుంటున్నాడని... కానీ.... దానికి తను మనస్ఫూర్తిగా సహకరించాలని...!?

కుమారికి అంతాఅర్థంఅవుతూనే ఉంది. రాత్రిపూట రావటం, షికారాను పంపి వేయటం, నాలుగు సినిమాలు తీస్తాననటం, అన్నిటికీ తననే అనటం-ఇదంతా దేనికో అర్థం అయిపోయింది!

సినిమాల్లోచేరిన మొదట్లో ఇలాటివి తెలుసుకోవటం కష్టంగా ఉండేవి. ముందుగా తనుచూసి ఆ తర్వాత పాత్ర సంగతి ఆలోచిస్తామనేవారు. కొన్నిచోట్ల తెలిసెరక్కుండగా 'ఊ' అనేసింది. కాని ఆ తర్వాత జాగ్రత్తపడింది. మోజుతీరితే ఇక అడగలివాడు ఇచ్చేదేమీ ఉండదు. రాను పుచ్చుకునేదీ ఉండదు. తననూ, తనకిచ్చినమాటనూ అడగలివాడు మలుపు కాని పోతాడనే సంగతి చాలాసార్లు తెలిసి వచ్చింది! అందుకే జాగ్రత్తపడింది. అన్నిచోట్లా ఊ అనటం పతనానికే దారి

 

తీస్తుందని గ్రహించింది! నటిసవుదామను కొన్న తను ఆఖరికి దేనికీ కొరగాకుండా పోతానని అర్థం చేసుకొంది.

ఆ గ్రహింపు వచ్చేసరికే నటిగా కుమారికి మంచి పేరే వచ్చింది. కాలంకలిసి వస్తోంటే తను శీలం జాగ్రత్తచేసుకోవటం అవసరం అనుకొంది. అలాగే ఉంటోంది.

ఇన్నాళ్ళకు మళ్ళీ నాగరాజు.

చెప్పీచెప్పకుండా కోరిక చెప్తున్నాడు.

కోరీ కోరకుండా తనను కోరుతున్నాడు.

అపుడే చలి అధికమవుతోంది. అలవాటు అయిన ప్రాణం తోడు కోరుకుంటోంది. చలిలో... వెచ్చగా... డాల్ సరస్సు ఉయ్యాల ఊపులకు అనువుగా!

"కుమారీ" అన్నాడు నాగరాజు చిన్నగా.

కుమారి నవ్వింది. ఆ నవ్వులో ఎంతో అర్థం ఉంది. అది నాగరాజుకు అర్థం అయింది.

"చలేస్తోంది, లోపలికి రండి" అంది కుమారి.

నాగరాజు లోపలికి నడిచాడు. డాల్ సరస్సు మీద దీపాల వెలుగు అందంగా కనిపిస్తుందని కుమారి అప్పటివరకు తీసి ఉంచిన కిర్టెన్లు దగ్గరగా మూసింది. ఆ తర్వాత నాగరాజుకు దగ్గరగా చేరింది.

డాల్ సరస్సు చిన్నగా కదిలింది.

ఓ అరగంట తర్వాత నాగరాజు "థాంక్స్" అన్నాడు.

"నేనూ థాంక్సే" అంది కుమారి నవ్వుతూ.

"రేపు మనం..."

"ఎక్కడ షూటింగ్?" అంది కుమారి

"షూటింగ్ షాలిమార్ గార్డెన్స్‌లో. కానీ... మనం.... మనకు మాత్రం

ఇక్కడే..."

"అంటే....?"

"ఏముందీ - హీరో మీద తియ్యే మంటాను అసిస్టెంట్ తో. నేను లొకేషన్ చూడ్డానికి వెళ్తున్నానంటాను. నువ్వు... సారీ, మీరు... ఫర్వాలేదుగదా. నువ్వు షూటింగ్ లేదు కాబట్టి ఇక్కడే ఉండి పోతావ్"

"అమ్మో ఎవరికైనా తెలిస్తే....?"

"పోనీ ఓ పని చెయ్యి. షాపింగ్ కు అని చెప్పి వెళ్ళి మళ్ళీ వచ్చేసెయ్. నేను వచ్చి ఇక్కడే ఉండిపోతా... ఓ..కే..?"

"నాకు భయంగా ఉంది. ఇంత పట్ట పగలా?"

నాగరాజు నవ్వాడు "ఎవడు చూడొచ్చాడు ఇక్కడ? అందర్నీ షూటింగ్ కు పంపేస్తున్నాం కదా!"

కుమారి నవ్వింది "ఏమో, మీరు డైరెక్టర్లు. మీరెంత చెప్తే అంతే"

"థాంక్స్. రేపు ఉదయం అందరూ షాలిమార్ కు వెళతారు. నేను లొకేషన్ లు చూడ్డానికి, నువ్వు షాపింగ్ కు. వాళ్లు లేవు కాబట్టి నీ గురించి పట్టించుకొనే వారుండరు. నేను ఓ అరగంట తిరిగి, తల నెప్పిగా ఉందని ఆగిపోతాను. కారును షూటింగుకు పంపేసాను. ఓ...కే?"

కుమారి ఓకే చేసేసింది. అప్పటికే కుమారి నాగరాజంటే ఓ రకమైన అభిప్రాయం ఏర్పడిపోయింది. ఇప్పటికే చాలా సినిమాలు తీసి పేరుపొందిన డైరెక్టర్. ఈమధ్యగా తనకు ఓ పాత్రా సరైనది దక్కటం లేదు. నటించగలిగే స్తోమత ఉండీ తను పనికిరానిదయి పోతోంది. గ్లామర్ గా చూపిస్తూ నటించేందుకు వీలుండే పాత్ర లభిస్తే, తన సత్తా ఏమిటో తెలుగునాట వెల్లడి చేస్తుంది తను. ఇలాటి స్థితిలో తనకో అండ అవసరం. 'గాడ్ ఫాదర్'లాటివాడు ఓ డైరెక్టర్ అవసరం. అదీ నాగరాజులాటి వాడైతే మంచిది. సరే, కోరినదే దరి చేరినది.

ఇది జీవితంలో ఓ మలుపు అనుకొంది కుమారి.

అనుకొన్నది అనుకొన్నట్లుగా సాగితే అది జీవితం కాదేమో! అన్నీ ఊహించుకో గలిగిన సంఘటనలే అయితే జీవితం థ్రిల్ కోల్పోయి నిస్సారంగా, నిస్తబ్దుగా సాగుతుంది! నాగరాజుతో సంబంధం పెంచుకోవటం మంచిదని కుమారి అనుకొందిగానీ అలా అనుకొంటున్న క్షణంలోనే ఆ విషయం నలుగురి నోళ్ళల్లో పడి తన గౌరవం నీటిపాలు కానున్నదని ఆమె ఊహించుకోలేకపోయింది.

ఊహించుకొని ఉంటే...?

మర్నాడు కుమారి తను షూటింగ్ కు రానని చెప్పి కబురుపెట్టేసింది. నాగరాజు లొకేషన్ల పేరు మీద షూటింగ్ ఎగగొట్టేశాడు. ఇద్దరూ ఆ రోజు భువి మీద స్వర్గంలో కూడా స్వర్గాన్ని దింపుకొన్నారు. ఇద్దరూ అలా ఒకరి కౌగిలిలో ఒకరు ఒదిగిపోయి ఉన్నపుడు జరిగిపోయిందా సంఘటన- వాళ్ళిద్దరికీ బహుదూరంలో.

సినిమాలు షూటింగ్ జరిగే సమయంలో ఆ సినిమా విశేషాల గురించి పత్రికల్లో ప్రచారం కోసం కొందరు విలేకర్లను సినిమా సంస్థవాళ్ళే తీసుకెడుతుంటారు. అలా వెళ్ళిన వాళ్ళల్లో రాజారాం ఒకడు. రాజారాం వ్రాస్తున్న విశేషాలు పడీ పడీ చదువుతారు ప్రజలు. అతని శీర్షికకు ఎంతో పేరు ప్రతిష్టలు లభించాయి.

ఆ రోజు రాజారాంకు ఒంట్లో బాగులేన ట్లుగా ఉండి బోట్‌లోనే ఉండిపోయాడు. మిగిలిన విలేకరులు అందరూ వెళ్ళి పోయారు షూటింగ్ కవరేజ్‌కు. ఒంటరిగా ఉండిపోయాడు రాజారాం బోటులో కూడా తెచ్చుకొన్న ఇంగ్లీషు పుస్తకాలు చదవటానికి యత్నించాడు కానీ మన సక్కడ నిలబడలేదు. వృత్తికి ఏదో చెప్పలేని ద్రోహం చేస్తున్నట్లుగా అని పించింది. ఒంట్లో బాగుండనిమాట వాస్తవమేగానీ అది ఇంట్లోనే ఉండి రెస్ట్ తీసుకోవాల్సినంత కాదు అనిపించి, నెమ్మదిగా బట్టలు వేసుకొని బోటు తలుపు దగ్గరగా వేసి బయటకొచ్చి నిలబడ్డాడు. దూరంగా ఉంది షికారా ఒకటి. రమ్మని కేకేసాడు, చప్పట్లుకొట్టి పిలిచాడు.

అట్నుంచి అది వచ్చేలోగా అటూ ఇటూ చూస్తున్నాడు రాజారాం. అపుడు కనపడ్డారతనికి - కుమారి, నాగరాజులు ఇద్దరూ బోట్ బయట.

ఉలిక్కిపడ్డాడు రాజారాం.

'ఇదేమిటిక్కడ ఉన్నారు ఇద్దరూ! షూటింగ్ ఏమయింది' అనుకొన్నాడు మనసులో. అలా అనుకొని ఊరుకోకుండా కెమేరా క్లిక్‌మనిపించి, 'షికారాలేని హౌస్ బోటు షీతో షికారు' అంటూ చిన్న అయిటంను కూడారాసి ఆ సాయంత్రమే పత్రికకు పంపాలనుకొన్నాడు రాజారాం.

షాలిమార్ గార్డన్స్‌కు చేరుకున్నాడు రాజారాం.

షాలిమార్, నిషాత్, చష్మాషాహీ అన్నవి మూడు కలిపి మొగల్‌గార్డన్స్‌గా చలామణీ అవుతున్నాయి. నీళ్ల పైకి విరజిమ్మే ఫౌంటెన్లతో, చిన్న చిన్న కొండల మీంచి కిందకు జాలువారే చిన్న చిన్న జలపాతాలతో, చక్కగా తీర్చిదిద్దిన పూలచెట్ల పొందికతో ఎంతో అందంగా ఉంటాయి ఈ మూడు తోటలూ నిషాత్ డాల్ సరస్సుకు సమీపంలోనే ఉంది నూర్జహాన్ సోదరుడైన అసఫ్ ఖాన్ నిషాత్‌కు రూపు రేఖల్ని అందించాడు. చష్మాషాహీ అంటే రాజ వసంతం అని అర్థం. చష్మాషాహీలో ప్రవహించే నీటికి ఎన్నో వైద్యగుణాలు ఉన్నాయంటారు.

ఇక మిగిలింది షాలీమార్. ప్రేమ కుంజం అని అర్థం దానికి. జహంగీర్ నిర్మించిన ఉద్యానం ఇది. మూడిటిలోనూ దీనికే ఎక్కువ ప్రాచుర్యం. ఇక్కడే రాత్రిపూటల్లో జహంగీర్, నూర్జహాన్‌ల ప్రేమకథను శబ్దదృశ్యకావ్యంగా చూపిస్తూ ఉంటారు.

ఈ రోజు షూటింగ్ షాలిమార్‌లో

ఉద్యానవనానికి తగ్గట్లుగా, ఆ వాతావరణానికి తగ్గట్లుగా ఆరోజు అక్కడ ఒక డ్యూయెట్ చిత్రీకరించాల్సి ఉంది. కానీ రాత్రికిరాత్రే నాగరాజు ప్రోగ్రాం మార్చేశాడు. షాలిమార్‌లాటి ప్రేమ కుంజంలో ప్రేమగీతంకన్నా విషాదగీతం అయితే వెరైటీగా ఉంటుందంటూ అక్కడ ఓ సాడ్‌సాంగ్ పిక్చరైజ్ చేయాలని నిర్ణయించాడు.

అసిస్టెంట్ నరసింహానికి ఇది నచ్చలేదు. ఆమాటేఅనేశాడు. "సెట్టింగ్‌కు తగ్గ సీన్ ఉంటే బాగుంటుందేమో గురూ గారూ!" అన్నాడు.

నాగరాజు నవ్వాడు.

"అదంతా ఓల్డ్ ఫ్యాషన్. ఓల్డ్ స్టయిల్. మనం కొత్తగా తీద్దాంచిత్రాన్ని ప్రేమగీతం ప్రేక్షకులు ఊహించేచోట విషాదగీతం ఉంటే వెరైటీగా ఉంటుంది!"

"కానీ.. ఒప్పుకోరేమో జనం"

"జనం..నరసింహం! జనంగురించి నీకింకా తెలియాల్సింది ఎంతో ఉందయ్యా! ఎవరయ్యా జనం అంటే? నువ్వు, నేను, మనం. అంతేకదా! నాకు నచ్చింది అంటే? ఏమిటని అర్థం? జనంలో ఒకడినేకదా నేను. అంటే జనానికి నచ్చినట్లే కదా అర్థం! సో, భయమేమీ పెట్టుకోకు. ధైర్యంగా కానీ. ఇక్కడే ప్రేమ మొదలయింది, ఇక్కడేనా ముగిసేది అంటూ హీరో పాడేటట్లయితే సరిగా సరిపోతుంది గదా!"

"సరిపోతుందనుకోండి.."

"నువ్వు తీయగలవు గదా?"

"తీయగలనండీ!" అన్నాడు నరసింహం. అలా అనకపోతే మళ్ళీ ఇంకో చిత్రానికి తనను అసిస్టెంట్‌గా తీసుకోడేమోనన్న భయం నరసింహానికి.

"అయితే కానీమరి... నేను వెళి లొకేషన్స్ చూసుకొని వస్తాను! ఓ.కే.?"

"సరేనండీ. కానీ.. ఒక చిన్న అనుమానం! పాటలో ఆవైపుమాటలేవీ ఉన్నట్లులేవు" సాంకేతిక కారణాలవల్ల తీయలేమేమోనన్నట్లుగా అన్నాడు

నాగరాజు నవ్వేశాడు- "లేవా? లేక పోయినా సరే! ఉన్న పదాలతోతీయ్. పదాలకు, పెదాలకు అతక్కపోతే అపుడు ఎడిటింగ్‌లో చెకప్‌చేసుకొని లాంగ్ షాట్స్‌లో కొట్టేద్దాం"

నరసింహానికి అర్థం అయిపోయింది- ఏ పరిస్థితిలోను రేపు తీయాల్సింది కేవలం సారోసాంగ్ తప్ప ఇంకోటికాదు. తనెంత చెప్పినా అది వృధాయే అవుతుంది తప్ప ఏ ఫలితాన్నీ ఇయ్యదు.

నరసింహం ఒప్పుకొన్నాడు, నాగరాజు చెప్పినట్లు చేయటానికి. ఇలా అసిస్టెంట్‌గా ఉన్నప్పుడు తల ఊపితే క్రమంగా పైకి పోగలిగే అవకాశాలే అధికం. 'తన అసిస్టెంట్' అంటూ



అందరికీ తనను పరిచయం చేస్తున్నా, నాగరాజు మాత్రం తనకు సెకండ్ యూనిట్ సైతం అప్పగిస్తున్నా డపుడపుడు. ఈ రోజున ఇది సెకండ్ యూనిట్ అనుకొంటే సరి అనుకొన్నాడు నరసింహం.

రాజారాం షాలిమార్‌కు వచ్చేసరికి అక్కడంతా హడావిడిగా ఉంది. గార్డెన్స్ చూడ్డానికి వచ్చిన జనంఅంతా గార్డెన్స్ చూడటం మానేసి ఈ షూటింగ్‌చుట్టూ మూగారు. ఎటొచ్చీ ఎంతో క్రమశిక్షణ ఉన్నట్లుగా దూరంగా ఉండి ఉండి చూస్తున్నారు.

రాజారాం వెళ్ళగానే ప్రొడక్షన్ మేనేజర్ వచ్చి రిసీవ్ చేసుకున్నాడు.

"ఒంట్లో బాగులేదన్నారు కదా, రారనుకున్నాం" అన్నాడు.

రాజారాం నవ్వేశాడు "రాకూడదనే అనుకొన్నాను కానీ ఉండలేక వచ్చేశాను" అంటూనే "డైరెక్టర్‌గారు రాలేదేం ఈరోజు?" అని అడిగాడు.

"డైరెక్టర్‌గారు లొకేషన్స్ చూసేందుకు వెళ్లారు"

రాజారాం నవ్వాడు."భలే! ఆయనను నేను చూసివస్తుంటేను" అన్నాడు రాజారాం.

"ఎక్కడ ?"

"ఎక్కడేమిటి ? మన హీరోయిన్ గారి బోటుదగ్గర" అన్నాడు రాజారాం. ప్రొడక్షన్ మేనేజర్ క్షణం రాజారాంకేసి అదోలాచూసి "మొత్తానికి రిపోర్టర్ అని పించుకొన్నారు మీరు" అన్నాడు సర దాగా. అంటూనే వెళ్ళి దూరంగా కుర్చీలో కూర్చునివున్న ప్రొడ్యూసరుగారి చెవిలో వేశాడావార్తను. నిర్మాతా వార్త విని ఊరు కొన్నాడు.

అప్పటికి ఊరుకొన్నాడుగాని మళ్లీ వారంరోజులకు అదే రిపీట్ అవబోతోంటే మాత్రం నిర్మాత ఊరుకోలేదు.

ఆ రోజుకూడా శంకరాచార్య హిల్ మీద షూటింగ్. తాను రానని నాగరాజు చెప్పేశాడు. షెడ్యూల్ ప్రకారం అక్కడ కుమారికి షూటింగ్‌లేదు. ఆమెకా రోజు షాపింగ్‌కని షూటింగ్‌లేకుండా షెడ్యూల్ చేశారు ముందుగానే.

ఆరోజు ఉదయమే నరసింహానికి నాగరాజు సీన్‌గురించిచెప్తూ ఎలాతీయాలో అంతా చెప్తున్నాడు. చాలా సేపటివరకు అంతావింటూ నెమ్మదిగా చివరకుఅన్నాడు నిర్మాత "డైరెక్టర్‌గారూ! మీరు..."

"నేను ఈరోజు షూటింగ్‌కు రానండీ! అవంతిపూర్ దాకా వెళ్ళొద్దామనుకొంటు న్నాను".

"దేనికి?"

"కృష్ణ ప్రియవాళ్ళ షూటింగ్‌ఉంది త్వరలో. వెళ్ళి లొకేషన్స్ చూద్దామని"

"క్షమించండి ఇలా అంటున్నానని! మీరువచ్చింది మా షూటింగుకుకానీ కృష్ణ ప్రియ వాళ్ళకోసం కాదుగదా!" అన్నాడు నిర్మాత రాజమోహన్.

"అదేమిటండీ" అన్నాడు నాగరాజు ఉలికిపడుతూ "ఏమిటి అంటున్నారు మీరు?"

"మీరు వచ్చింది మా షూటింగ్‌కు. కనుక మా షూటింగ్ విషయాలే చూడ మని అంటున్నాను"

నాగరాజుకు ఇది షాక్‌లా తగిలింది. ఎవరూ ఇలా అడగలేదు తనను ఇంత కాలమూ. మకుటంలేని మహారాజులాగ, నియమాలేవీ లేని నియంతలాగ బతుకు తున్నాడు తను. పరిశ్రమలో పదిమందికీ తనే ఇపుడు కేంద్రస్థానంగా ఉంటున్నాడు.



అయినా ఇలా...

ఇది అనుకోని పరిణామం అయింది నాగరాజుకు.

"అదేమిటండీ రాజ్ మోహన్‌గారూ, ఇది మామూలు విషయమే గదా! దీనికి ఇంత రచ్చపడతారేమిటి?" అన్నాడు నాగరాజు మామూలుగా.

అలా ఇక కుదరదండీ. మొన్నా మీరు ఇలాగేచేశారు. షాలిమార్‌లో షూటింగ్ పెట్టి మీరు ఇక్కడే ఉండిపోయారు. బాధ్యతలేకుండా ఇలా ప్రవర్తించటం..."

"రాజ్ మోహన్‌గారూ!" గట్టిగా అన్నాడు నాగరాజు.

"మీరు గట్టిగా అరిచినా గిపెట్టినా అది నిజమేగదా! ఆరోజే ఆ సంగతి మాకు తెలిసినా,ఏదోఒకరోజుగదా అనుకొన్నాం. కానీ అది ఇక షరామామూలు అయిపోతే కుదరదండీ అని చెప్తున్నా ఇపుడు"

"మొన్నా?ఆరోజు నేను లొకేషన్‌కు.."

"అలాగేచెప్పారు. కానీ మీరు ఇక్కడే ఉన్నారు. కావాలంటే ఈ ఫొటోలు చూడండి"

చూసి ఉలిక్కిపడ్డారు నాగరాజు. అవి తీసినవాడి పీకపిసికివెయ్యాలన్నంత కోపం వచ్చిందతనికి ఆ క్షణంలో.




రాజ్ మోహన్‌తో కాశ్మీర్‌లో ఉండగా నాగరాజు గొడవ పడ్డాడన్న సంగతి కార్చిచ్చులాగ వ్యాపించిపోయింది.పరిశ్రమ పరిశ్రమఅంతా ఇదే విషయాన్ని చర్చించు కొంటూ ఉండిపోయింది. ఏదో ముసలం పుట్టినట్లుగా అందరూ దాని గురించే మాట్లాడుకోనారంభించారు. నాగరాజు గొడవ పడటం ఎందుకో, రాజ్ మోహన్ నాగరాజును ఎలా దారిలోకి తెచ్చాడో కూడా కథలు కథలుగా, చిలవలు పలవలుగా అల్లి మరీ చెప్పనారంభించారు కొందరు. 'తెర పత్రికలో రాజారాం రాసింది తప్పట' అని ఎవరైనా కొందరు అన్నా మిగిలినవారు ఆమాట అన్నవారి ముఖాన్నే నవ్వేసేవారు–'పక్కనే ఫొటో ఉంటే నమ్మకపోవటం ఏమిటోయ్ వెర్రి నాగన్నా' అన్న పద్ధతిలో. సెట్‌లో అందరూ షూటింగుకు సిద్ధం అవుతున్న టైంలో పనిచేసుకొంటూ కూడా అందరూ అదే చర్చించే స్థితికి చేరిపోయింది పరిస్థితి. నాగరాజు వస్తున్నాడంటే గప్‌చిప్‌గా అయిపోయేవారు.

నాగరాజు ఈ పరిస్థితి రెండుమూడు రోజులు గమనించాడు. అందర్నీ చూస్తోంటే అందరూ తన గురించే మాట్లాడుకొని నవ్వుకొంటున్నారన్న ఆందోళన పెరగనారంభించింది. వార్త వార్తలాగా ఉండి ఉంటే బాగుండేది. కానీ పక్కనే దోషిని పట్టుకున్నట్లుగా ఫొటో కూడా ఉంది. ఇంక 'ఇది నిజంకాదు, కేవలం కవిత్వం' అంటూ ఖండించటం ఎట్లా?

నాలుగోరోజు ఉదయం ఓ కొత్త ప్రొడ్యూసర్‌వచ్చాడు నాగరాజు దగ్గరకు. పేరు నాగరత్నం. ఆడ పేరులా తోచినా. అచ్చం మగతనం అంతా ఒకచోట కుప్ప పోసినట్లుగా ఉన్నాడు. ఆ రత్నం చింతపండు వ్యాపారంలో గడించిన

లక్షల్ని వెండి తెర మీదకు కుమ్మరించి కోట్లలాగ మార్చుకోవాలనే తపన అతనిది. వ్యాపారం గురించి అంత తెలిసినా చిత్రరంగం గురించి మాత్రం ఓనమాలు తెలీనివాడు నాగరత్నం. అందుకే అన్నివిషయాల్లో ఆరితేరినవాడు, ఒక్కవిషయంలోనూ పొల్లుపోనీయనివాడు అన్న పేరు తెచ్చుకొన్న నాగరాజు దగ్గరకు చేరాడు నాగరత్నం. నాగరాజు అసిస్టెంట్స్ పేరిట డబ్బు తినేస్తాడన్న సంగతి విన్నా అలా తిననివాడెవడులే అని సరిపెట్టుకొన్నాడు. తిన్నా పనిచేసి పెడతాడు కదా అని గుండెల్ని చిక్కబట్టుకొన్నాడు.

అన్నీ నిక్కచ్చిగా మాట్లాడుకోవటం నాగరత్నం పద్ధతి. "ఇదిగో, ఇది నేను పెట్టదల్చుకొన్న రొక్కం. దీంట్లో ఏదెంత ఎట్లా ఖర్చు పెట్టినా సరే, నాకు మాత్రం బొమ్మ తీయించి పెట్టండి. అది చాలు" అంటూ ఖచ్చితమైన లెక్కలతో అప్పగించేశాడు నాగరత్నం.

నాగరాజుకు క్షణం మతిపోయింది.

ఇంత డబ్బు ఒకేసారి అప్పగించటం ఏమిటి? ఇంత నమ్మకమా తన మీద అనుకొన్నాడు. ''సరే కానీండి" అంటూ "ఇంకో నెల తర్వాత మంచి ముహూర్తం చూసుకోండి. మొదలు పెడదాం స్క్రిప్టు వర్కు" అని చెప్పాడు.

నాగరత్నం ఆ మొత్తానికి తగినట్లుగా ఇన్‌కమ్‌టాక్స్ గొడవలు ఏవీ రాకుండా ఉండేట్లుగా వైట్‌లో ఇచ్చిన దానికి మాత్రం రసీదు పుచ్చుకొన్నాడు. వేరే మొత్తానికి వేరుగా ఇంకో రసీదు తీసుకొన్నాడు.

'అంతా అయిపోయింది' అని నాగరాజు అనుకొంటూ ఉండగా నాగరత్నం బాంబు పేల్చాడు. ''డబ్బంతా ఇచ్చేశాను. అన్ని విషయాల్లో మీ ఇష్టం" అన్నాడు. "కానీ నాదొక్కటే షరతు" అన్నాడు.

"ఏమిటది? మీ సినిమా హిట్ చెయ్యటమే గదా? అది నా బాధ్యత. మీ సినిమా హిట్ చేయించే పూచీనాది" అన్నాడు నాగరాజు నవ్వుతూ.

"హిట్ దేముందిలెండి - మీరు తల్చుకొంటే అదో లెక్కలోదేంకాదు. ఇందరు అసిస్టెంట్లు ఉండగా ఎలాగైనా తీసేస్తారు మీరు. కాదన్ను. కానీ...''

''చెప్పండి, సం దే హిం చ ద్దు" అన్నాడు నాగరాజు.

''ఇలా అంటున్నానని అనుకోవద్దు. పదిమందీ పదిరకాలు అంటుంటారు. అవేవీ పట్టించుకోవాల్సిన పనిలేదు. అయినా నమ్మి మీ దగ్గర చేరినవాడిని. మనసులో ఉంచుకోవటం దేనికని స్పష్టంగా చెప్తున్నాను. ఏమీ అనుకోరు గదా'' అని ఆగిపోయాడు నాగరత్నం.

నాగరాజుకు అర్థం కాలేదు.

ఏమిటి చెప్తున్నాడు? ఏం చెప్పాలనుకుంటున్నాడు?

క్షణం తెమిల్చి అదే అడిగాడు. ''చెప్పండి ఏమీ అనుకోను'' అని హామీ ఇచ్చాడు.

''మీరు ఈ సినిమాకు కథ ఏదైనా ఎన్నుకోండి మీ ఇష్టం. కానీ ఆ కథలో హీరోయిన్‌కు మాత్రం కుమారిని సెలక్టు చేసుకోవద్దనేదే నా షరతు!''

నాగరాజు ఉలికిపడ్డాడు. అంటే ఏమిటి ఇతని ఉద్దేశం? గుండెల్లోంచి బాధ బయలుదేరింది. ఎక్కడెక్కడినుంచో కోపం, ఉక్రోషం తన్నుకొచ్చే ప్రయత్నాలు చేస్తున్నాయి. తమాయించు

కొన్నాడు.

నాగరత్నమే అన్నాడు మళ్ళీ "మీరేమీ అనుకోవద్దు ఇలా నిక్కచ్చిగా చెప్పానని. వ్యాపారంలో, వ్యవహారంలో మొహమాటం ఉండ కూడదంటారు. అందుకే మొదలే చెప్పాను. అలాగే మా షూటింగ్ ఉన్న రోజుల్లో ఇంకో కంపెనీ షూటింగ్ అంటూనో, ఇంకో కారణాలు చెప్పో మీరు షూటింగ్ నుంచి గైర్ హాజర్ అవకూడదు! ఇది ఇంకో షరతు. ఈ రెండూ ఒప్పుకుంటే అన్ని అగ్రిమెంట్లు కుదిరినట్లే లెక్క"

నాగరాజు క్షణం ఆలోచించాడు "ఒక వేళ నేను ఒప్పుకోకపోతే...?"

"అది మీ ఇష్టం. ఇంత డబ్బుతెచ్చి సినిమా తీసిపెట్టండని అడుగుతున్నాను. సినిమా బాగుకోసం ఒకటిరెండు నా మాటలూ వినమంటున్నాను. అంతే! మీకిది ఇష్టం లేదనుకోండి. బలవంతం ఏమీలేదు. వేరేవాళ్ళకు అప్పగిస్తాను ఇదేపనిని! అంతే! కళ్ళకద్దుకుని ఎవరైనాచేసి పెడతారీ పని. అపుడు ఇదొకటే అని ఏం ఖర్మ ఎన్ని షరతులు పెట్టినా అన్నిటికీ ఊకొట్టి మరీ ఒప్పుకొంటారు"

నాగరత్నం అంటున్నది నిజం అని నాగరాజుకుతెలుసు. ఇప్పటికే పరిశ్రమలో ఒక విషయంలో కొంచెం పరిస్థితి చేయి జారింది. 'సినిమా బాగుకోసం....'అంటూ తనుకోరినది కాదన్నాడు నాగరాజు అని ఈయన వెళ్ళి బయటి ప్రపంచానికి చెప్తే తనకే నష్టం. పైగా ఇంత హార్డ్‌కాష్‌తో ఎందరొస్తారు చిత్రనిర్మాణ రంగంలోకి.

నాగరాజు క్షణం ఆలోచించి అన్నాడు నెమ్మదిగా- "మీరన్నదానికి నేను ఒప్పుకొంటున్నాను.కానీ ఒక్క మాట...ఏ కథ కయినా ఓ హీరోయిన్ కనీసం వుండి తీరుతుంది. ఆ హీరోయిన్‌కు కొన్నిలక్షణాలు ఉంటాయి.వాటినిబట్టే ఆ పాత్రకుతగ్గట్టుగా హీరోయిన్‌ని ఎన్నుకొంటాంగానీ ఒకరిద్దరి ఫాన్సీ కోసం కాదు. ముఖ్యంగా అందులో నా వ్యక్తిగతమైన అంశాలు నేను అసలు పట్టించుకోను. ఇకపోతే షూటింగ్‌లకు గైర్‌హాజరీ... ఒకటి రెండుసార్లు అలా జరిగిఉండొచ్చు. కానీ ఒక్కోసారి తప్పని సరి. మీ సినిమాకు పనిచేస్తున్నా ఇంకో సినిమాగురించి ఆలోచించటం నాబాధ్యత. అంతమాత్రాన మీ చిత్రానికి అన్యాయం జరుగుతుందంటే నేను ఒప్పుకోను."

"మీ ఇష్టం. మీరు ఒప్పుకోండి, మానండి మీరన్నది నాకు ఇష్టంలేనిది. నాకు కావాల్సిందల్లా నా చిత్రం టైం ప్రకారం రావటమే. ఆ పద్ధతి ప్రకారం మీరు మాట ప్రకారం నాకు పనిచేయండి. అది చాలు!"

నాగరాజు ఊఁఅనేశాడు. నాగరత్నం వెళ్ళిపోయాడు. నాగరత్నం వెళ్ళి పోయాడు. కానీ నాగరాజు మనసులో మాత్రం ఎన్నోఆలోచనలను రేపివెళ్ళాడు.

వారంరోజులు గడిచేసరికి మళ్ళీ ఆ విషయం 'తెర' పత్రికలో రాజారాం శీర్షికలోకి చేరిపోయింది. 'బిజీ దర్శకునికి నిర్మాత షరతులు' అన్న హెడ్ లైన్‌తో వచ్చిందావార్త. నిర్మాత దర్శకుల మధ్య ఒప్పందాలు, చర్చలు,నిర్ణయాలు ఉండటం పరిపాటే అయినా అవన్నీ చిత్రం గురించేకానీ దర్శకుని వ్యక్తిగత ప్రవర్తన గురించి మాత్రంకాదు. నాగరాజు ఈ విషయంలో రికార్డ్ సృష్టించాడని రాశాడు రాజారాం.

నాగరాజు ఆవార్త చదివాడు. పొరబాటు చేశాడు తను. నాగరత్నం ఏంచెబితే దానికి ఎందుకో తల ఊపేశాడు ఆ





క్షణంలో. ఆ తల ఊపటంలోనే తను తల వంచినట్లు అయిందా కొంపదీసి. ఈ రోజున పరిశ్రమలో తనంటే ఎంత చిన్న చూపు ఏర్పడిఉంటుందో కదా! మకుటం లేని రాజులాగ ఏలుతున్నాడీ రాజ్యాన్ని. ఇపుడీ అలజడి ఏమిటి??

నాగరాజు బాధపడ్డాడు.

అయినా ఏమీ జరగలేదన్నట్లుగా ప్రవర్తించే ప్రయత్నం చేయదలిచాడు. సాయంత్రం ఉన్న ప్రీవ్యూకు మామూలుగానే వెళ్ళాలనుకొన్నాడు. రైంకు సిద్ధమై 'రాగిణి' ప్రివ్యూ థియేటర్‌కు చేరాడు నాగరాజు.

ఒకరిద్దరు నాగరాజునుచూసి పక్కకు తొలగి దారిఇచ్చారు. గతంలో అలా ఎవరెనా పక్కకుతొలగితే అది వాళ్ళు తనమీదచూపిస్తున్న గౌరవంఅని భావించేవాడు నాగరాజు. కానీ ఈరోజు అలా అనుకోబుద్ధి కాలేదు. తనపట్ల ఏహ్యంతోనో, తనపట్ల చిన్నచూపుతోనో వాళ్లు అలా ప్రవర్తిస్తున్నారనిపించింది. ఒక క్షణం మనసు చిన్నబోయింది. మనసులో బాధను కప్పిపుచ్చుకొంటూ ముందుకు నడిచాడు.

అక్కడ తోటి పత్రికా విలేకరులతో కలిసి రాజారాం ఏదో జోక్స్‌వేసుకొంటూ నవ్వుకొంటున్నాడు.

రాజారాంను చూడగానే నాగరాజు కోపం పట్టలేకపోయాడు. గుండెల్లో ఎక్కడెక్కడో రాజుకొంటున్న కోపం ఒక్కసారి అగ్నిపర్వతం బద్ధలైనతర్వాత వెలువడే లావాలాగ ఎగిసిదూకింది. ఒక్కడుగు ముందుకేసి రాజారాం కాలర్ పట్టుకొని ఒక్కటి కొట్టాడు నాగరాజు.

అందరూ నిశ్చేష్టులయిపోయారు.

పత్రికా విలేకరులంతా ఆశ్చర్యంతో,

అవమానంతో బిక్కచచ్చి పోయారు. ప్రివ్యూకువచ్చినపెద్దలంతా విస్మయులయి పోయారు.

నాగరాజు కొట్టింది ఒకే చెంపదెబ్బ అయినా, అది అందరికీ తీవ్ర మనస్తాపానికి కారణంఅయింది.

క్షణంతర్వాత తన ప్రవర్తననందరూ నిరసించటం అర్థంచేసుకొన్న నాగరాజు ప్రివ్యూనుంచి తిరుగుముఖం పట్టాడు.

ప్రివ్యూ వాయిదాపడింది.



14

మర్నాడు పేపర్లన్నిటిలోనూ ఇదేవార్త అయింది. నిన్నటివరకూ చిత్రరంగంలో పేరు తెచ్చుకొంటున్న దర్శకుడు ఇలా చెయ్యటం ఏమిటని సినిమా పత్రికలు నిరసన వ్యక్తంచేశాయి. నిజాన్ని నిర్భయంగా రాసినందుకు ఇలా విరుచుకు పడటం ఏమిటంటూ విమర్శించాయి. 'కాలు జారినవాడు చెయ్యి జారటానికి వెనుదీయడుకదా' అంటూ ఓపత్రికవ్యంగ్యంగా వెక్కిరించింది. పత్రికలన్నీ కలసి నాగరాజుకు సంబంధించిన వార్తలను వెయ్యకూడదనే విషయాన్ని ఆలోచిస్తున్నాయనికూడా ఒకపత్రిక వెల్లడిచేసింది.

ఆ ఒక్కవాక్యంతోనే కథ మరింత బిగువున పడింది. ఏకంగా ఒకరిద్దరు నాగరాజుకే ఫోన్‌చేసి అడిగారు "ఏమిటి ఇలా రాశారు ? నిజంగానే జరిగిందా ఇలా?" అంటూ.

మరికొందరికి కాశ్మీర్‌గొడవ తెలీక పోయినా రాజారాంను కొట్టటం గురించి వార్తలు ప్రచురించిన పత్రికలన్నీ మళ్ళీ నాగరాజు, కుమారిల ఫొటోలువేసి అసలు కథ అక్కడే ఆరంభం అయిందని రాశాయి. దానితో కావాలని తనే తన జీవితంపైకి బురదచల్లుకొన్న చందం అయింది నాగరాజుకు.

'ఎక్కడో జీవితంలో చిన్న తప్పటడుగు వేశాను. దారితప్పుతోంది' అన్న భయం నాగరాజులో చిన్నగా ఆరంభం అయింది.

రెండురోజుల తర్వాత రామదాసు వచ్చాడు ఒకటే కంగారుతో– "ఇదేమిటండీ! ఇది ఇలా..." అంటూ ఆగిపోయాడు.

"ఏమిటి, ఏమిటయింది చెప్పండి?" అన్నాడు నాగరాజు.

"పత్రికలవాళ్ళకు మీరంటే ఇపుడు.." అని ఆగిపోయి "మొన్న నేను పంపించిన న్యూస్ తిప్పిపంపేశారండీ వాళ్ళు. మీరు పత్రికాముఖంగా క్షమాపణ చెబితేతప్ప ఇంక వాళ్ళు మీగురించి ఏవార్తా వెయ్యరట"

నాగరాజుకు ఒళ్ళుమండిపోయింది.

"పోనీండి. వార్తలు కావాల్సింది ఎవరికి? వాళ్ళకా, నాకా? పత్రికలు అమ్ముకొనే వాళ్ళకే అంత పొగరయితే పత్రికలకు న్యూస్ ఇచ్చే మనకెంత ఉండాలి చెప్పండి? వీళ్ళుకాకపోతే ఇంకోపత్రిక, అదీ కాకపోతే ఇంకోటి. ఆఖరికి ఏ పత్రికా నా గురించి వెయ్యకపోతే ఆఖరికి నేనే ఓ పత్రిక పెట్టేస్తా" అన్నాడు కోపంగా.

'మీరు దేనికయినా సమర్థులేగదా' అనిఅనుకొంటూనేరామదాసు నాగరాజును




అనునయించే ప్రయత్నంచేస్తూఅన్నాడు—"మీకు తెలీదండీ పత్రిక అంటే ఏమిటో! మనకు—ప్రజలకుమధ్య ఏకైకవారధి అది. దానికి ఉండే బలం ఎంతో మీ అంచనాకు సైతం అందదు. కావాలనుకొంటే ఆ పత్రికలు ఒకణ్ణి ఆకాశంలోకి ఎత్తనూగలవు. కోపం వహిస్తే ఒకణ్ని పాతాళంలోకి దింపనూగలవు. ఏమీ అక్కరలేదు, ఈ నిషేధం ఇలాగే కొనసాగితే మన సినిమాలకు పబ్లిసిటీ అనేది ఏముంటుందో ఆలోచించండి! నా మాటవిని మీరు ఏదో నాలుగు అక్షరాలతో 'క్షమించండి' అంటూ అనేస్తే సరిపోతుందేమో..."

"రామదాసూ!" గట్టిగా అరిచాడు నాగరాజు కోపంతో. "ఏమిటయ్యా నువ్వు అనేది? ఆఫ్టరాల్ ఒక పత్రికవాడిపైన చెయ్యిచేసుకొంటే అది తప్పు అంటూ మళ్ళీ ప్రకటన ఇచ్చుకోవాలా? అది మంచి పబ్లిసిటీయా? బాగుందయ్యా నువ్వు చెప్పేది!"

"నేననేది అది కాదండీ! క్షమాపణ చెప్పుకోవటం పబ్లిసిటీ అనటంలేదు. అది ఒక్కోసారి మనకు గౌరవాన్నే తెచ్చిపెడుతుంది. చేసింది తప్పే అయితే క్షమాపణ చెప్పుకోవటంలో తప్పేమీలేదండీ! నా మాట వినండి. ఇప్పటికీ మించిపోయిందేమీ లేదు..."

"అంటే వెళ్ళి వాడి కాళ్ళమీద పడమంటావా? ఇదిగో రామదాసూ! నా మంచి చెడ్డలు నాకు తెలుసుగానీ నువ్వేమీ ఇందులో జోక్యం కలిగించుకోకు. నాకు సినిమాలుఉన్నా, లేకున్నా నీకురావాల్సిన నెలజీతం ఇచ్చేస్తే సరికదా! అది పట్టుకొని గమ్మున ఊరుకో. అంతేకానీ..."

రామదాసుకు తలకొట్టేసినట్లయింది. పొరబాటయింది. గాడిదకాళ్లు పట్టుకొని, అది తన్నిందని ఆ తర్వాత బాధపడటంలో అర్థంలేదు.

మంచీ చెడ్డా తెలిసినవాళ్ళకు మంచి చెడులు చెప్పవచ్చుగానీ, మూర్ఖులకు చెప్పటం ఎవరితరం? చెప్పి నచ్చచెప్పగలగటం ఎవరి వశం అవుతుంది? జరిగేది జరగనీ, తానేమీ పట్టించుకోడు. నాగరాజే అంటున్నట్లుగా నెలజీతం తనకు అందితే, తలవంచుకొని, ఆత్మను చంపుకొని జీవితాన్ని కొనసాగించేస్తాడు. అంతేగానీ ఇంకెందులోనూ జోక్యం కలిగించుకోడు. ముఖ్యంగా ఆత్మగౌరవం గురించి తనలాటి ఆత్మను అమ్ముకొని బతికేవాడు అసలు లెక్చర్లు ఇవ్వనేకూడదు... రామదాసు నిర్ణయించుకొని వెనుదిరగబోయాడు.

అటునుంచి సూర్యం పరుగున వచ్చాడు—"విన్నారాండీ ఈ వార్త" అంటూ.

"ఏమిటి? ఏం జరిగింది సూర్యం?" అనడిగాడు నాగరాజు.

"దేవశర్మగారు చనిపోయారండీ! ఉదయం గుండెఆగిపోయిందట. ఆస్పత్రికి తీసుకెడితే వాళ్లు ఆయన ప్రాణం పోయిందని ఇప్పటికి తేల్చిచెప్పారట"

రామదాసుకు మతిపోయింది.

తెలుగు కవితాలోకంలో ఇదో పెద్ద దుర్ఘటన!చిత్తరంగానికిఏముంది—అక్షరాలు అమ్ముకొని పొట్టపోసుకొనే తనలాటివాళ్లు కోకొల్లలుగా దొరుకుతారు. కానీ ఆంధ్ర పాఠకులకూ, ఆంధ్ర ప్రజలకూ ఇదో నష్టం, తీరనిది అనుకొన్నాడు రామదాసు.

"సర్లెండి నాగరాజుగారూ! నేను దేవశర్మగారింటికి పోతున్నాను. బహుశా రేపూ, ఎల్లుండీ కూడా అక్కడే ఉండి పోతానేమోనండీ!" అన్నాడు రామదాసు.

నాగరాజు ఒక్కసారి రామదాసుకేసి



చూస్తూ అన్నాడు– "మంచిది వెళ్ళిరండి. కానీ.... ఆయిన శవాన్ని ఎత్తేటపుడు నాకు ఫోన్ చేయించండి కొంచెం ముందు గానే. ఓ పూలమాల ఆ శవం మీద పడేస్తే బాధ్యత తీరిపోతుంది"

రామదాసుకు అసహ్యమేసింది. కానీ దిగమింగుకొన్నాడు. పుట్టెడు శోకం నింపాల్సిన క్షణం ఇది. అదిలేదు సరికదా ఏదో ఓ పూలమాల పారేస్తే బాధ్యత తీరిపోతుందనుకోవటంఎంతటిదౌర్భాగ్యం.

రామదాసుకు అక్కడ నిలబడటానికి అసహ్యమేసింది. తలెత్తి చూడకుండా, 'ఊ', 'ఆ' అనకుండా అక్కడి నుంచి కదిలాడు.

రామదాసు వెళ్ళేంతవరకూ ఆగి ఆ తర్వాత సూర్యాన్ని పిలిచి ఓ కాగితం మీద చిన్న మెసేజ్ రాసి వెంటనే వెళ్ళి ఇది గ్రామఫోన్ కంపెనీలో ఇచ్చి రమ్మన్నాడు. 'ఎక్కువ ఏమీ మాట్లాడ వద్దు. ఇది ఇచ్చేసి వచ్చేసెయ్' అనీ హెచ్చరించాడు.

సూర్యం ఆ కాగితం మడత విప్పాడు. అందులో రాసి ఉన్నది చదివి ఉలిక్కి పడ్డాడు.

"ఇదేమిటండీ, ఇది అన్యాయంకదూ" అన్నాడు సూర్యం క్షణం తర్వాత.

"న్యాయాన్యాయాలు ఆ తర్వాత విచారించుకోవచ్చుగానీ వెళ్ళి నేను చెప్పిన పని చేసిరా! అక్కడేమైనా గొడవ ఉండే టట్లయితే మన మామూలు మంత్రం వేసిరా! ఓకే..." అన్నాడు నాగరాజు.

సూర్యారావు పరుగులాటి నడకతో ఆ ఇల్లు దాటాడు. వెళ్ళి అక్కడ అవ సరం అవుతోందంటూ ఫోన్ చేసి వెనక్కి వచ్చి కొంచెం డబ్బు కూడా తీసుకెళ్లాడు. తిరిగి వచ్చేటపుడు కొన్ని కాంట్రాక్ట్ ఫారాలు తెచ్చి నాగరాజు చేత సంతకం



చేయించాడు.

వారం రోజులు ఏ గొడవా లేకుండా గడిచిపోయింది. ఆ వారం రోజులూ రోజూ ఏదో ఓ పత్రిక నాగరాజు తను చేసిన పనికి క్షమాపణ చెప్పితీరాలని అనేది. నాగరాజు అది చదివీ చదవ నట్లుగా ఊరుకొనేవాడు.

ఆ తర్వాత రోజున పక్కగదిలో పాట వినిపించి రామదాసు అటుకేసి వచ్చి చూశాడు. నాగరాజు 'సీతాస్వయంవరం' లోని పాట వింటున్నాడు. 'రికార్డ్ వచ్చి నట్లుగా ఉంది' అనుకొంటూ తనూ అక్కడే ఉండి పాట అంతా విన్నాడు.

'ఎంత అద్భుతమైన సంగీతం, ఎంత గొప్పదైన సాహిత్యం, ఎంత అరుదైనమేలి కలయిక అది! ఎపుడో వాహినీవారి 'మల్లీశ్వరి' కాలంలో విన్న పాటలంత అద్భుతమైన అనుభూతిని కలుగజేసోంది రామదాసుకు ఆ పాట. చచ్చి ఏ లోకాన ఉన్నారో దేవశర్మ తన ఆఖరి పాటలో దైవత్వాన్ని నింపారు. అణువణువునా అందాన్ని అందించారు. అక్షరం అక్షరం వెనుకగా తను ఆత్మలా నిలిచారు. అందుకే పాటకు ఆ దైవత్వం సిద్ధిస్తోంది' అనుకొన్నాడు రామదాసు.

పాట పూర్తయింది. రికార్డు ఆపి, నాగరాజు మరోసారి అదే పాటను వేశాడు. అమర లోకాలనుంచి మధుర గాయకులెవరో సంగీత స్వరాన్ని ఆల పిస్తున్నట్లుగా ఉంది ఆ పాట. ఆ ఆలా పనలన్నీ మిన్నేరు తరగల మీంచి అల్లనల్లన పయనించి ఈ భువికి చేరి సంగీతప్రియులకు స్వర్గాన్ని చవిచూపిస్తు న్నట్లుగా ఉంది ఆ పాట. ఉత్కృష్టమైన ఆ సంగీత, సాహిత్యాలకు జోహార్లు పలుకుతూ అలాగే నిలబడిపోయాడు రామదాసు.

పాట పూర్తయింది రెండోసారి. కానీ తనివి తీరినట్లు లేదు. నిజానికి ఈ ఒక్క పాటనూ ముందు విడుదల చేస్తే చాలు సినిమా సూపర్‌హిట్‌గా నిలుస్తుంది. ఈ పాట ప్రతీ ఇంటా ప్రతినోటా పలుకుతుంది. నిర్మాతకు కనక వర్షాన్ని కురిపిస్తుంది. తాన్‌సేన్ మేఘమల్హార్ రాగమాలపించి మేఘాలచేత వర్షింప జేశారట! ఇక్కడ ఇన్నేళ్ళకు దేవశర్మ, సత్యమూర్తిల అపూర్వ సమ్మేళనం నిర్మాత ఇంట ధనలక్ష్మిని నింపుతుంది.

నాగరాజు చేతిలోంచి రికార్డును ఎంతో పూజ్య భావంతో అందుకొన్నాడు రామదాసు. స్వయంగా దేవశర్మకు నివాళి అర్పిస్తున్నంత భక్తిప్రపత్తిని కనిపింప జేశాడు రామదాసు. ఆప్యాయంగా దేవశర్మ పేరు ఆ రికార్డు మీద చూద్దామని అనుకొన్న రామదాసుకు అక్కడ గీత రచయితగా కనిపించిన పేరు చూసేసరికి మతిపోయింది. పంచప్రాణాలూ ఒకేసారి ఎగిరిపోయినట్లనిపించింది. సప్త సముద్రాలూ ఘోషించి ఒకేసారి చెలియలి కట్టలు దాటి విరుచుకు పడ్డట్టుగా అని పించింది

"ఏమిటండీ ఇది ?" అనడిగాడు రామదాసు.

నాగరాజు ఏమీ ఎరగనట్లుగా చూస్తూ అడిగాడు-"ఏ విషయం మీరు అడుగు తున్నది?"

"అదే, ఇక్కడ... దేవశర్మగారి పేరు ఉండాల్సింది మీ పేరు ఉందేమిటి అని అడుగుతున్నాను" అన్నాడు రామదాసు. తన కంఠంలో కొత్తగా కొంచెం కాఠిన్యం వినపడటం రామదాసుకే చిత్రంగా తోచింది.

నాగరాజు అది గమనించలేదు. లేకుంటే అది గమనించినా గమనించని విధంగా ప్రవర్తిస్తూ అన్నాడు - "దేవశర్మ పేరుండాలా అక్కడ?"

"అవునుకదా గీతాన్ని రచించింది ఆయనే అయితే ఆయన పేరే ఉండాలి మరి!"

"నిజమే మీరు అంటున్నది గీతాన్ని రచించింది ఆయనే అయితే. ఆయన అయితే కదా....! గీతాన్ని రాసినట్లుగా అక్కడ నా పేరు ఉంటే ఆ గీతరచయితని నేనేనని అర్థం!" నాగరాజు నవ్వాడు.

రామదాసుకు ఒళ్లు మండిపోయింది. "ఇదేమిటండీ, ఇది అన్యాయం కదూ"

"అన్యాయమా? అన్యాయం ఏముంది ఇందులో? దేవశర్మ ఈ పాటను రాసి పెట్టాడు. ఓకే. కానీ దేని కోసం? డబ్బు కోసమే కదా! ఆడబ్బు ఆయనకు ఎలాగూ ముట్టింది గనుక అన్యాయం ఏమీ లేదు. ఇక పేరంటావా? ఆయన పేరుకు ముందు కీర్తిశేషులు అన్న బిరుదు ఇప్పటికే చేరి పోయింది ఇంకా కావాల్సిన పేరేమి ఉందాయనకు? అంతగా అయితే ఇంకో వందో రెండొందలో పారేద్దాం. ఆసంగతి వెళ్ళి మీరే మాట్లాడి రండి" అన్నాడు నాగరాజు.

రామదాసు క్షణం నిలబడ్డాడు. ఆ క్షణకాలంలో రామదాసు తనఒంట్లోని సర్వశక్తుల్నీ ఒక్కసారిగా ఒక్క చోటికి సమీకరించుకొన్నాడు. ఆ ఆత్మ బలంతో అన్నాడు —"నాగరాజూ! తప్పు చేశావ్. నన్ను కొల్లగొడుతున్నావ్.... సహించాను! నా తోటి పరిశ్రమలోవారిని కొల్లగొడుతున్నావ్.. వాళ్ళూ సహించారు. కానీ దేవశర్మలాటి జాతిరత్నపు కవి శ్రేష్టుడిని కొల్లగొట్టే ప్రయత్నం చేస్తు న్నావ్. ఆయన విస్తరిముందు పడ్డఎంగిలి మెతుకుల అక్షరాలకు సైతం అర్హతలేని వాడివి అతిపెద్దతప్పు చేసేస్తున్నావ్!దీన్ని క్షమించను. చేసిన తప్పుకు క్షమాపణ చెప్తేకానీ ఒప్పుకోను"

నాగరాజు నివ్వెరపోయాడు. ఇదేమిటి ఈ బక్క రచయిత ఇలా అంటున్నాడు? తను పెట్టిన తిండి తిని విశ్వాసంతో మెలగాల్సినవాడు ఇలా ఎదురుతిరుగు తున్నాడేం?

క్షమాపణ చెప్పాలా? అటు రాజారాం గాడు అడిగేదీఅదే, ఇటు ఈ రామదాసు గాడు అడిగేదీ అదే..!

కోపంతో నాగరాజు కళ్లు రక్తవర్ణాన్ని పులుముకొన్నాయి. "ఏరా, నాగరాజు నీకు క్షమాపణ చెప్పాలా? ఏం, ఎలా ఉంది నీ ఒంటిపొగరు? చిటికె వేస్తేచాలు శవంగా మారిపోగలవ్. వెళ్లు, వెళ్ళి బతికిపో... ఈ విషయం ఎక్కడైనా బయటకుపొక్కిందా, నీకు ఈ లోకంలో నూకలు చెల్లినట్లే లెక్క. గుర్తుంచుకో" అన్నాడు నాగరాజు.

రామదాసు ఒక్కడుగు వెనక్కు వేశాడు. "ఆల్‌రైట్ వెళ్ళిపోతున్నాను. కానీ ఈ తప్పు చేసినందుకు నీ చేత క్షమాపణ మాత్రం చెప్పిస్తాను! గుర్తుం చుకో" అన్నాడు.

రామదాసు వెళ్ళిపోయేంతవరకూ అక్కడే నిలబడి, ఆ తర్వాత డ్రైవర్‌ను కేకేసి కాచు కోసం వెయిట్ చేశాడు.

డ్రైవర్ రాలేదు. క్షణంసేపు వెయిట్ చేసి మళ్ళీ పిలిచాడు. ఈ సారీ డ్రైవర్ రాలేదు. నాగరాజుకు చిరాకు వేసింది. 'ఎక్కడ చచ్చాడు వీడు' అనుకొంటూ బయటకు వచ్చాడు.

అయిదారు నిమిషాల తర్వాత దూరా




న్నుంచి కారు వస్తూ కనబడింది. 'అమ్మయ్య!' అనుకున్నాడు నాగరాజు కారులో కూర్చుని రవ్వంతసేపు అలా ఊరు ఊరంతా తిరిగి వస్తేకానీ మనశ్శాంతి చిక్కేలాలేదు అనుకున్నాడు.

కారు వచ్చి నాగరాజుముందు ఆగింది. కార్లోంచి శంకర్ దిగాడు. "దిగుతున్నా వేమిటి, పద అలా తిరిగొద్దాం" అన్నాడు శంకర్‌ను ఉద్దేశించి నాగరాజు.

శంకర్ ఏమీ మాట్లాడలేదు.

"ఏంరా? ఏమయింది?" అనడిగాడు నాగరాజు కోపంగా.

''ఇవిగోండి తాళంచెవులు" అన్నాడు శంకర్ కారు తాళం చెవులు అందిస్తూ.

నాగరాజు ఉలిక్కిపడ్డాడు ''ఏం జరిగింది?" అడిగాడు.

"మీ దగ్గర పనిచేయటం కుదరదండీ! ?గా మేమంతా సమ్మె చేస్తున్నాం" న్నాడు నాగరాజుతో శంకర్.

"సమ్మె? దేనికిరా సమ్మె?"

శంకర్ అలా చూసి నెమ్మదిగా ?డు- "మీరొక్కసారి మీ ఇంటికి ?ూడండి, అర్థం అవుతుంది మీకే ప?"

?సలేమయిందో చెప్పవేంరా? ఏం జరిగ? గొడవ?"

శ?ర్ నెమ్మదిగా అన్నాడు-"అమ్మ గారు ?ుడిని కొట్టారండీ!"

''?గారా? అంటే మా ఆవిడా? రాముడె?"

''అ?డీ! కుసుమమ్మగారే! కుమారి గారి డ్రైవ? రాముడిని కొట్టారండీ!"

నాగరా? మతిపోయింది "ఎందుకు కొట్టటం? ఏ?రిగిందని?"

"ఇపుడే?డీ అపుడే వారం రోజులనుంచీ ?గుతోందండీ-ఈగొడవ! మీకూ, కుమా?రికీ సంబంధం ఉందని ఆ పత్రికలో వచ్చిందిగదండీ, అక్కడి నుంచే ఆరంభం అయిందండీ! నన్ను అడిగారండీ. మొదట్లో నాకేమైనా తెలుసా నని! నాకేం తెలీదన్నానండీ! రాముడిని పిల్చారండి, వాడు ఈరోజు రేపంటూ ఆఖరికి ఈరోజు వెళ్లాడండీ మీ ఇంటికి! అమ్మగారు మా యూనియన్‌కు ప్రెసిడెంట్ కదండీ! అబద్ధంచెప్తే ఏంనష్టమోనని మీ సంగతి ఆడు నిజమేనని చెప్పేశాడండీ! ఆ సంగతి ముందే ఎందుకు చెప్ప లేదని అమ్మగారు కోపంతో రాముడిని రెండేశారండీ! వాడెళ్ళి యూనియన్‌లో ఫిర్యాదు చేశాడండీ. ఎంత ప్రెసిడెంట యినా అమ్మగారు చేసింది తప్పనీ, దానికి ఆమె క్షమాపణ చెప్పితీరాలని మా యూనియన్ పట్టుపడుతోందండీ. ఇంక మీ కారుకు డ్రైవర్‌గా మేం ఎవ్వరూ పనిచేయకూడదనీ తీర్మానించు కున్నాం"

నాగరాజు బుర్రంతా ఖాళీ అయి పోయింది.

కుసుమ రాముడిని కొట్టిందా? అదీ కుమారి విషయంలోనా??

అంటే-

కుసుమ తనమీద నిఘా ఆపలేదన్న మాట!

అసలిదంతా ఆ రాజారాంగాడివల్లే వచ్చింది. చేతిలో కలం ఉందిగదాని చేతికి వచ్చిందంతా రాసుకుపోవటమేనా? దేవుడు కళ్లిచ్చింది అన్నిటినీ చూడమని. కానీ మరుపు ఇచ్చింది చూసింది మర్చిపో మని! ఆ సంగతి రాజారాంగాడు ఇంకా తెలుసుకున్నట్లులేదు. ఈసారి కనబడితే మక్కెలిరగకొడితే సరిపోతుంది. అపుడు చూసినవాటిల్లో సగం మర్చి

పోవటం అలవాటు చేసుకొంటాడు.

అయినా-

కుసుమ ఇలా చేయిచేసుకోవటం ఏమీ బాగాలేదు.

అసలు దాని తత్త్వమే అంత. మొదటి నుంచీ మొండిఘటమే! లేకపోతే... చెప్పా పెట్టకుండా ఉన్నట్లుండి ఇంటిముందు ప్రత్యక్షం కాగగేంత ధైర్యం మామూలు ఆడదానికి ఉండదు. ఈ కుసుమకు అసలు ఎక్కడా ఆడ లక్షణమేలేదు.

ఓ వినయం లేదు, ఓ విధేయత లేదు. అన్నిటికీ ఎదురుతిరగడం ఆమెకు ఆడ జాతిపరంగా వచ్చిన లక్షణం. ఇక తల పొగరు ఇంటిలో పెరిగిన విధానంవల్ల వచ్చిన లక్షణం. ఇన్నేళ్ళూ పెరుగుతూ వచ్చిన ఆ అవలక్షణం ఇపుడు పొమ్మంటే ఎలా పోతుంది?

అందుకే-

చెయ్యెత్తి రాముడిని ఒకటి వేసింది.

ఆ దెబ్బ తనకు తగులుతోంది!

ఆ రోజే చెప్పాడతను-చెవిలో ఇల్లు కట్టుకొన్న రీతిలో...

"నీకెందుకే ఈ యూనియన్లు ఈ గొడవలూ" అంటూ! వినిదికాదు.వినిఉంటే ఇపుడిలా ఈ అవాంతరం ఎదురయ్యేది కాదు!

నాగరాజుకు కుసుమ చేసిన తెలివి తక్కువ పనులన్నీ ఒకటొకటిగా గుర్తు కొచ్చాయి.

యూనియన్ పెడితే డ్రైవర్లంతా చేతిలో ఉంటారంది కుసుమ. నిజమే! ఎక్కడైనా, ఏ పరిశ్రమలోనైనా పదిమంది కలిసిఉండే యూనియన్ అంటే ఎవరైనా జడుస్తారు-ఆఖరికి ఆ పరిశ్రమనే పెట్టిన యజమాని అయినా!

అందుకే తనూ ఊ అన్నాడు ఆ రోజున. పరిశ్రమను గుప్పిటిలో ఉంచు కోవాలంటే ఒకే పద్ధతిలో ప్రయాణం చేయటం ఏం తెలివైనపని? చేరాల్సిన గమ్యానికి నాలుగురకాల దార్లను ఎన్ను కోవటంలోనే ఉంటుంది ప్రతిభ అంతా! తెలిసో తెలియకో అర్ధాంగిగా తన మార్గాలు నాలుగింటిలో రెంటిని తాను ఏరి పెడతా నంటోంది. కాదనుకోవటం, కాలదన్ను కోవటం తెలివితక్కువతనం. భార్య అందిస్తున్న చేయూతను సాదరంగా సొంతం చేసుకోవటమే మంచిదను కున్నాడు.

కుసుమ ఓ వారం రోజుల తర్వాతి నాటికి ఓ స్టూడియో ఆవరణలో 'ఆల్ సినిమా డ్రైవర్స్ యూనియన్' అన్న పేరిట ఓసంఘాన్ని ఏర్పాటుచేసింది. సంఘం ప్రారంభోత్సవానికి నాగరాజే వెళ్ళాడు. ప్రారంభోత్సవ చిహ్నంగా ఓ చిన్నదీపాన్ని ముట్టించాడు.

"ప్రతిమనిషీ ఓచిన్నదీపంలాటివాడు. దీపంఅంటే కాంతి. కాంతిఅంటే వెలుగు ప్రతిమనిషి ఒక వెలుగై వెలగాలనే అ కొంటాడు. కానీ... అలా ప్రతిమని అనుకొంటూ ఒకరికి ఒకరు తోడైతే. దీపంతో దీపం కలిస్తే... కాంతితో కా కలిసి వెలిగితే... ఆలోచించండి త వెలుగు ఈ ప్రపంచంలో పండుతుందో! ఎంతవెలుగు మీ జీవితాల్లో పండుతుందో! అందుకే చెప్తున్నాను. చైతన్యంతొడిన మీరంతా దీపాలై కలిసి కాంతిగా ?గి మీ జీవితాల్ని వెలిగించుకోవాలి. ఐకమత్యంతో మీరంతా ఓ అద్భుతశక్తిగా పొంది, మీ సమైక్యతా బలాన్ని పరిశ్రమకు చూపండి. ఈపరిశ్రమ కోట్లవ్యాపారం చేసే పరిశ్రమ. కానీ మీకేమొస్తోంది? కట్టు కొనేందుకు ఓ యూనిఫారకోటు. కోట్లు





వాళ్ళుమింగి కేవలం చిరుగుబతుకుల కోట్లను మీకు మిగిల్చే ఈ పరిశ్రమలోని దోపిడీ ఇంకా సాగలా? ఆలోచించండి! ఏం చేయాలో ఆలోచించిచెప్పండి. పరిశ్రమలో ఒకడిగా, మీకు పెద్దగా ఏంసాయం కావాలన్నా చేస్తాను" అంటూ దీపం ముట్టిస్తూ నాగరాజు చెప్పాడు ఆరోజు.

ఆ దీపం ఈరోజు అగ్గిలా అంటుకొంది; మంటై మండుతోంది. తన భవిష్యత్‌నే కాల్చివేస్తోంది—అనుకొన్నాడు నాగరాజు.

నిజానికి ఈ డ్రైవర్ల ఐకమత్యం తననే దెబ్బతీస్తుందని నాగరాజు కలలోకూడా అనుకోలేదు.

పరిశ్రమ తన ఉడుంపట్టులోంచి జారిపోకుండా ఉండాలని వేసిన పథకం అది! అది ఆరోజు ఆ సినిమా డ్రైవర్స్ యూనియన్‌కు కుసుమ ప్రెసిడెంట్‌గా ఎన్నిక అవటందగ్గర ఆరంభమైంది.

ప్రెసిడెంట్‌గా ఎన్నికయ్యాక, పదవి లభించాక కుసుమ తెలివి పదింతలుగా

వికసించింది. యూనియన్‌లో చేరాలంటే అడ్మిషన్ ఫీజు, ఆతర్వాత ఏడాదికి ఓసారి సభ్యత్వచందా చెల్లిస్తే చాలునని అందరికీ హామీలు ఇచ్చింది. ఆ ప్రకారమే చేరిన అందరికీ జీతభత్యాలు సరైన విధంగా, సమయానికి అందేలా ఏర్పాటు చేయిస్తానంది. అందర్నీ అలా సంఘంలోకి చేర్పించాక తన విశ్వరూప ప్రదర్శన జరిపించింది.

ఆ సంఘంలో ఓ రోజు వేలుపిళ్లై అనే డ్రైవరు చేరాడు. వేలుపిళ్లైకు నలుగురు పిల్లలు. డ్రైవర్‌గావచ్చే డబ్బు ఏ మూలకీ సరిపోదు. అందుకే అపుడపుడుస్టూడియో కారును తెలిసీతెలియని విధంగా టాక్సీలా కూడా వాడటం మొదలెట్టాడు వేలుపిళ్లై. 'వెళ్ళి ఫలానాఆర్టిస్ట్‌ను తీసుకొని రా' అని చెప్పి కారిచ్చి పంపిస్తే – ఆమె లేదనో, ఉన్నా ఆమె తనను అక్కడికీ ఇక్కడికీ తిప్పిందనో కారణాలు చెప్తూ చాలా ఆలస్యంగా వచ్చేవాడు వేలుపిళ్లై. అయితే ఇలాటివన్నీ సీనియర్ ఆర్టిస్టుల విషయంలోనే చేసి జాగ్రత్త పడేవాడు. ఎవరికీ అంతటి సీనియర్ఆర్టిస్టును నిలదీసి అడిగే ధైర్యం వుండేదికాదు. పైగా సొంతకార్లు ఉన్నా ఇలా తమకారు ఉపయోగించుకోవాల్సి రావటం అంటే ఎంత అర్జెంటు పనో అని సమాధానపర్చుకునేవారు. కారు ఇలా ఉపయోగించుకొన్న సంగతి తమకు చెప్పటం మేనర్స్ అయినా ఇంత చిన్న విషయంలో చెప్పేదేమిటని వాళ్ళు ఊర్కుండిపోయి ఉండొచ్చుననీ సమాధానపడేవారు. ఈ బలహీనతలన్నీ వేలుపిళ్లైకు తెలుసు. ఇలాటి విషయంలో తన పద్ధతి ఎవరూ గ్రహించలేరన్న ధైర్యం వచ్చేసింది వేలుపిళ్లైకు.



కానీ ఓ రోజు అవతల సెట్లో హీరో గారు వెయిట్ చేస్తోంటే ఇటు ఇంకా హీరోయిన్ రాకపోవటంతో ఆరంభమైంది గొడవ. కొంచెం సేపు వెయిట్ చేసి ఆఖరికి ఫోన్ చేస్తే ఆవిడ 'కారింకా రాలేదు. మీరు ఇలా కారు పంపితే అలా వస్తానని' సమాధానం చెప్పింది. కారుతో వెళ్లిన వేలుపిళ్లై ఏమయ్యాడో తెలీక పోవటంతోనూ, ఆలస్యం అవుతోందన్న బాధతోనూ వేరే కారిచ్చి పంపుతూ దారిలో వేలుపిళ్లై కారు ఫెయిలయిందేమో చూడమని చెప్పారు. దారిలో వేలుపిళ్లై కారెక్కడా తగలేడు. అరగంట తర్వాత వేలుపిళ్లై తన మామూలు దిన చర్య తర్వాత తిరిగి వచ్చేసరికి షూటింగు జరుగుతోంది. సెట్లో హీరోయిన్‌ను చూసేసరికి ఏ సమాధానమూ చెప్పలేక పోయాడు వేలుపిళ్లై. దాంతో ఆ యజమాని కాస్తా వేలుపిళ్లైను తిట్టి ఆరోజు జీతం ఇచ్చేది లేదంటూ శిక్షగా ఆ నెల జీతం కూడా ఇవ్వనన్ని బెదిరించాడు.

అంతే! కుసుమకు సందు దొరికింది.

వేలుపిళ్లైను నిజం అడిగి తెలుసుకుంది. వేలుపిళ్లై ఏం చేస్తాడో మిగతా వాళ్ళను అడిగి రుజువు చేసుకొంది. వెంటనే వెళ్లి ఓయాభైమంది డ్రైవర్లతో స్టూడియో మీద పడింది. వేలుపిళ్లైను అవమానించినందుకు ఆ యజమాని క్షమాపణ చెప్తే కానీ వదల్లేదు.

అప్పటికి ఆ యూనియన్ బలం ఏమిటో అర్థం అయిపోయింది అందరికీ.

ఆ తర్వాత ఒకటొకటిగా యూనియన్లు వెలిశాయి పరిశ్రమలో. నిన్నటి వరకూ పరిశ్రమలో కనపడని ప్రతిశాఖకు ఇపుడో యూనియన్. లైట్‌బాయ్స్‌నుంచి అందరికీ యూనియన్లే. సెట్ మీద, సెట్ బయటా పనిచేసే ప్రతి రెగ్యులర్

ఉద్యోగి పేరు తెరమీద కనపడి తీరాలి సిందేనన్నారు అందరూ. ఏ ఒక్కడి పేరు కనపడకపోయినా అన్ని యూనియన్లు కలిసి పోరాడటం నేర్పింది కుసుమే-అన్ని యూనియన్లకు ఆమే ప్రెసిడెంట్ గనుక!!

చిత్రం సజావుగా పూర్తి కావాలంటే కుసుమ సహకారం తప్పనిసరి అని అందరికీ స్పష్టంగా తెలిసిపోయింది. ఆమెతో మంచిగా ఉంటేనే పరిశ్రమలో నిలదొక్కుకోగలం లేకుంటే లేదని అందరికీ అర్థమయింది. దాంతో కొత్తగా చిత్రాన్ని ఆరంభించే ముందు కుసుమను దర్శించుకొని ఆమె ముడుపు చెల్లించటం ఆనవాయితీ అయిపోయింది.

ఇది పరిశ్రమలో పదికాలాలుగా ఉన్న పెద్దలకు కష్టం కలిగించింది. ఇంత కాలంలేని అవినీతి ఇపుడు ఆరంభమవటం ఏమిటని అందరూ బాధపడ్డారు. అయితే బాధపడి కూడా చేయగలిగేది ఏదీలేదని అందరికీ తెలుసు. పరిశ్రమ ఇలాగే అయితే కకావికలం కాకపోదని అందరూ బహిరంగంగానే అనటం ఆరంభించారు.

ఒకరిద్దరు నిజాయితీపరులు మాత్రం స్పష్టంగా ఏ యూనియన్‌తోనూ సంబంధం లేని కార్మికులు లభిస్తేనే పని చేసేది అంటూ ప్రకటనలు ఇచ్చేశారు. ఇంత కాలమూ ఏ కార్మికునికీ తాము అన్యాయంచేసి ఎరగమనీ, అలా చేసినట్లు ఎవరు రుజువు చేసినా పరిశ్రమనుంచే తప్పుకుంటామనీ వారు ఛాలెంజీచేశారు. అందుకే తమపట్ల నమ్మకం ఉన్నవారు ఏ యూనియన్‌లోనూ చేరకుండా తమతో పనిచేయాలని షరతు పెట్టారు. అటు తమకు న్యాయం జరగటంలేదన్న వాదంతో యూనియన్లు, ఇటు తాము యూనియన్ల చేతిలో కీలుబొమ్మలం కాలేమన్న వాదంతో పరిశ్రమ ఉండటంతో పరిశ్రమ నాశనం అయిపోతుందనే భయం అందరిలోనూ పెరిగింది.

అప్పుడు... అప్పుడు కలగజేసుకున్నాడు నాగరాజు.

అది ఎవరో అందించిన అధికారం కాదు, ఎవరో అప్పగించిన బాధ్యతాకాదు. తనంత తానుగా చేపట్టిన బాధ్యత అన్నా నిజానికి అది ఇంకో పన్నాగం. అటు యూనియన్లకోసం పోరాడే తన భార్య కుసుమనూ, ఇటు పరిశ్రమలో ఒకడిగా ఉన్న తాను పరిశ్రమనూ సంధాన పరుస్తానంటూ ప్రకటించాడు. రెండు వర్గాలవారితోనూ సత్సంబంధాలు ఉన్న తాను మధ్యవర్తిగా ఉంటూ అన్నీ తానే చక్కబెడతానంటూ నాగరాజు ముందు కొచ్చాడు.

తాత్కాలికంగా పరిశ్రమలో సంక్షోభం తగ్గిపోయింది. కానీ అందరికీ అర్థమైపోయింది – నాగరాజు పన్నిన పన్నాగం ఏమిటో! అసలు ఇన్ని గొడవలెందుకు అనుకుంటూనే కొందరు తమ చిత్రాల బాధ్యత ఏకంగా నాగరాజుకే అప్పగిస్తే సరికదా అనీ సర్దుకున్నారు. ఫలితంగా అప్పటివరకూ ఒక్కో బేనర్‌కూ ప్రత్యేకంగా ఉంటూ వచ్చిన దర్శకులు, కథకులు, రచయితలూ అంతా తప్పనిసరిగా చెల్లాచెదురు అయినారు.

'అలా అక్కడ గెలిచిన తాను ఇక్కడ ఇలా దెబ్బతింటున్నాడేమిటి?' అనుకున్నాడు నాగరాజు.

కుసుమ తొందరపడింది. అన్ని చోట్లలాగానే ఇక్కడ కూడా తొందరపడింది. తొందరపాటు అనేది జీవితాన్ని

దెబ్బతీసెయ్యగలదన్న విషయం కుసుమకు ఇంకా తెలిసిరాలేదు. ఇపుడిపుడే తనకు తెలిసివచ్చేలా ఉంది!

అయినా కోపం ఒకరిమీద, శిక్ష ఇంకోరికీ అయితే ఎలా?

కుసుమ కోపం తనమీద!

తాను కుమారితో సరాగాలు సాగిస్తున్నాడని ఈ గొడవంతా!

అసలు తనకున్న బలహీనత అది అని కుసుమకు తెలికపోతేగదా! తెలిసినా ఇలా తొందరపడిపోతే ఎలా? నిజానికి పెళ్ళయిన కొత్తలోనూ ఇలాగే జరిగింది గదా! కుసుమకు అమాత్రం గుర్తులేదా? అప్పట్లో నాగరాజుకు పెళ్లయిన ఆరు నెలలకు కుసుమ ఓసారి ఇంటికి వెళ్లొస్తానంటూ పుట్టింటికి వెళ్ళినరోజులవి. ఏమీతోచక పంచాయితీ ఆఫీసు కచేరి వరండాలమీద పేకాటకో, ఉబుసుపోకకో చేరటం అలవాటయిన రోజులవి.



**15**

అలా వెళ్తూనే ఒకరోజు నాగరాజు రమణమ్మను చూశాడు.

రమణమ్మ నాగరాజు చూసేటప్పటికి గానుగమీద ఉంది. తెలుకుల రమణమ్మ సాధారణంగా గానుగెక్కదు. ఇంట్లోఉండే అమ్మో, నాన్నో చేసేపని అది. కానీ ఆరోజు వాళ్లంతా వేరేపనిలో ఉండిపోబట్టి, గత్యంతరంలేక రమణమ్మ గానుగెక్కింది. నువ్వుల్ని పోసి, నెమ్మదిగా ఎద్దు అడుగులో అడుగువేసుకొంటూ గుండ్రంగా తిరుగుతోంటే—ఆ బద్దీలమధ్య కూర్చుని నువ్వుల్ని కలబోస్తూ, నెమ్మదిగా కలియదీస్తూ ఉండటం రమణమ్మ చేయాల్సిన పని! కానీ ఇష్టంలేని పని కావటంతో రమణమ్మ గానుగమీద కూర్చుని దిక్కులుచూస్తోంది. అలా చూస్తున్నపుడు కనపడ్డాడు నాగరాజు.

రమణమ్మ గానుగమీద ఉంది. నాగరాజుకు ఆమె ఎత్తైన సింహాసనంమీద కూర్చున్నట్లుగా తోచింది.

రమణమ్మ కూర్చున్న గానుగను ఓ ఎద్దు గుండ్రంగా తిప్పుతోంది. నాగరాజుకు ఆమె అందాలు తనను వెర్రెక్కించి గుడ్డివాడినిచేసి తనచుట్టూ తిప్పుకొంటున్నట్లుగా తోచింది.

రమణమ్మ చిన్నగా నువ్వుల్ని గానుగలోకి తోస్తోంది. నాగరాజుకు ఆమె తనను నిలువునా విరహాగ్ని గుండంలోకి తోస్తున్నట్లుగా తోచింది.

రమణమ్మ ఒకసారి చిన్నగా చెయ్యెత్తి నెత్తిమీద కొప్పును సరిచేసుకొంది. అపుడామె కొంగు రవ్వంత తొలిగి, జాకెట్‌లేని ఆమె యవ్వనం అందంగా, ఆబగా, ఆశగా నాగరాజును కదిలించింది. నాగరాజుకు ఆమె చేతులెత్తి తనను జుర్రుకోమని పిలుస్తున్నట్లుగా తోచింది.

నాగరాజు నిలబడిపోయాడు. ఆ క్షణంలో అక్కడ అలాగే నిలబడిపోయాడు.

ఎర్రని ఎండవేళ. పసిమిపచ్చని ఛాయ. పైగా నూనెజిడ్డుతో మెరుస్తున్న ఒళ్లు.

నాగరాజు అక్కడే నిలబడిపోయాడు.




గానుగెద్దు గుండ్రంగా తిరుగుతోంది ఒకే లక్ష్యంతో. అతనికళ్లుమాత్రంగుండ్రంగా తిరుగుతున్నాయి ఆమె అందాల్ని తనివి తీరాచూస్తూ. ఆ క్షణంలోనే మానసికంగా రమణమ్మకు బానిసయిపోయాడు.

రమణమ్మ యధాలాపంగా చూసి నపుడు నాగరాజు అలాగే నిలబడిపోయి ఉండటం ఆమెకుఆశ్చర్యాన్ని కలిగించింది. అయిదారునిమిషాల తర్వాతకూడా అతను అలాగే నిలబడి ఉండటంతో రమణమ్మకు నవ్వొచ్చింది. మండుటెండవేళ. వీధులన్నీ విశ్రాంతి తీసుకుంటున్న వేళ. ఇక్కడ నాగరాజు ఎందుకు నిలబడిపోయాడో రమణమ్మకు అర్థం అయింది.

'మండుటెండలో ఒకమగాడిని నిలబెట్ట గలిగింది తన అందం' అనుకొని రమణమ్మ మనసులోనే తనను తాను అభినందించు కొంది. ఆ అభినందనకు చిహ్నంగా చిన్నగా చిరునవ్వు ఆమెపెదవుల మీదకి చేరింది.

నాగరాజు ఆ నవ్వుకు బదులిచ్చాడు.

ఆరోజు రాత్రి పేకాటకని బయలుదేరిన నాగరాజు పంచాయితీఆఫీసు కచేరీకి చేరుకోలేదు. గాండ్లవీధి మొదలు ఎత్తు అరుగుల వెనుక ఆరోజురాత్రి రమణమ్మను ఆదరంగా అందుకున్నాడు. ఆమె అందాన్ని ఆనందంతో జుర్రుకున్నాడు నూనె వాసనతో రమణమ్మ నాగరాజు మనసులో మత్తుని నింపింది. ఆమె వంపు లన్నీ అతని గుండెల్ని కాల్చి వదిలాయి.

ఆ వ్యవహారం అలా గుట్టుగానే సాగే దేమోకానీ-తెలుకుల సాంబయ్య ఓ రాత్రి వేళ అలా వెళ్లటానికి లేవటంతో కథ అడ్డం తిరిగేసింది. నువ్వులను ఆరబోసు కోవటానికి కట్టుకున్న ఆ ఎత్తు అరుగుల వెనుక ఏదో అలికిడి విని సాంబయ్య అటు నడిచాడు-'ఎవ్వడ్రా అది?' అంటూ.

నాగరాజు గుండెల్లో రాయి పడింది.

రమణమ్మ ఉలిక్కిపడింది. భయంతో, కంగారుతో పక్కన పడేసిన చీరను అందుకొంది. నాగరాజు లేచి సాంబయ్య అడుగులు దగ్గరపడుతోంటే కంపరంతో అడుగులు వేస్తూ పరుగు అందుకొన్నాడు.

"ఎవ్వడ్రా అది? ఏటదీ ?" అంటూ సాంబయ్య అరుపులు నాగరాజును ఊరి పొలిమేరలవరకూ వెంబడిస్తూనేఉన్నాయి.

అవిసిపోయిన గుండెలతో, అలసి పోయిన పరుగుతో నాగరాజు ఊరిచివరి బస్ స్టాండ్ చేరుకున్నాడు. తెల్లగ తెల్లా రేంతవరకు అక్కడేవుండిపోయి మొదట వచ్చిన బస్సెక్కి కుసుమ వాళ్లఊరికి బయలుదేరాడు. బస్సు వెడుతున్నంత సేపు అతనిధ్యాసంతా రమణమ్మ మీదే ఉండిపోయింది.

తూర్పు తెల్లవారకముందు ఇంటి ముందు దిగిన భర్తను చూసి కుసుమ ఆశ్చర్యపోయింది. భర్త రావటం సంతో షమే అయినా రావటం ఇంత అకస్మా త్తుగా, ఇంత అర్థంలేకుండా - చేతుల్లో ఏ పెట్టెలేదు, బేగాలేదు...ఇలా రావటం అంటే వెనక ఏదో కథ ఉండేతీరుతుంది అనుకొంది. కానీ నెమ్మదిగా అదే తెలు స్తుందని కుసుమసరిపెట్టుకొని ఊరుకుండి పోయింది. ఆమె అనుకున్నట్లు ఆసంగతి కుసుమ తిరిగి వచ్చాక స్పష్టంగా తెలి సింది. భర్తచేసిన ఘనకార్యానికి కుసుమ తిట్టని తిట్టు తిట్టకుండా చెడామడా పెట్టేసింది. ఆరోజే కుసుమకు భర్తంటే ఉన్న కొంచెం గౌరవమూ లేకుండా పోయింది. అక్కడ ఆరంభమైంది భర్తపై కుసుమ అథారిటీ.

ఆ తర్వాత ఎపుడూ నాగరాజు ఏ

తప్పు చేయలేదనటం తప్పు. ఏ తప్పు చేసినా అది కుసుమ దృష్టికి రాకుండా జాగ్రత్తపడేవాడు.

అయినా ఈ కుమారి గొడవ రాజారాంగాడివల్ల కుసుమ చెవిలో పడనే పడింది అనుకున్నాడు నాగరాజు.

ఇపుడేం చేసినా... ఏం చెప్పినా తప్పేది లేదు.

భార్య చేసింది తప్పు.

నిజానికి తప్పు చేసింది తను. కానీ తనమీది ఉక్రోషంతో కుసుమ ఆ డ్రైవర్ని కొట్టింది. కుమారికోసం కక్కుర్తిపడి... అవును, అందులో ఏం ఉంది తప్పు! ఆడది... అందంగా ఉంది. తనకు అవస



రంగా ఉంది. దానికి తప్పనిసరైపోయింది. కొంచెం కక్కుర్తిపడితే తప్పు అయిపోయి నట్లు కుసుమ ఇలా విరుచుకు పడిపోవటం?

నాగరాజుకు పరిస్థితి తల్చుకొంటుంటే చికాగ్గా ఉంది!

తప్పు చేశాడు తను!

కాదు, తప్పులు చేశాడు తను. ఒకటా, రెండా... లెక్క పెడుతోంటే తెలుస్తోంది, అంచనా వేస్తోంటే అర్థం అవుతోంది....

రామదాసు చెంత పనికి చేరి ఆఖరికి ఆయన జీవికకే ఎసరు పెట్టాడు తను!

రాజూ..ధర్మమూర్తి వంటి రచయితల శ్రమను కొల్లగొట్టాడు తను! 'పేదల్లూ,



మీ రక్తాన్ని పీల్చేస్తున్నారు ధనికులు. జాగ్రత్త పడండి!' అంటూ కథలు రాసిన రచయితలను పీల్చివేయగలిగాడు తను!

రాజారాం పత్రికా విలేకరి. ఉద్యోగ ధర్మంగా చూసింది చెప్పాడు అతను! అయినా అతని పైన చెయ్యిచేసుకొన్నాడు తను!

ఇపుడు ... ఇక్కడ .... డ్రైవర్ రాముడి మీద కుసుమ చేసిన అత్యాచారం...

ఏమిటిది? సంఘటనలన్నీ ఒకేసారి ఇలా తోసుకొని వచ్చేస్తున్నాయేం? అటు రాజారాం కోరేది క్షమాపణ. ఇటు రామదాసు కోరేది క్షమాపణ. ఇటు డ్రైవర్లు కోరేది క్షమాపణ. అవును.... అన్నట్లు ఎపుడో బూచిగాడిని కొడితే అపుడు వాడు కోరిందీ క్షమాపణే! ఒకపుడు తన అవసరంకొద్దీ ప్రోత్సాహం ఇచ్చిన వాళ్ళను తన అదుపులో ఉంచుకోడానికి తనే నేర్పాడివన్నీ.

జీవితం గుండ్రమా? మళ్ళీ యధాస్థానానికే చేరుతోందా? ఒక్క చెంపదెబ్బతో మలుపు తిరిగిన తన జీవితం మళ్ళీ చెంప దెబ్బలవల్లే తిరుగుముఖం పడుతోందా?

నాగరాజు కారెక్కాడు. ఇంటివైపు మళ్ళించాడు. ఇల్లు ఇంకో యాభైగజాల దూరంలో ఉండనగానే నాగరాజుకు ఇంటిదగ్గర పరిస్థితి అర్థం అయిపోయింది. తన ఇంటిముందు రకరకాల జెండాలు, బానర్లు ఎగురుతున్నాయి. ఈ జెండాలను, బానర్లకు ప్రాణప్రతిష్ట చేసింది తన భార్యే. అంతవరకూ యూనియన్లన్నవి ఎరుగనివారికి నేర్పిపెట్టింది తన భార్యే. ఇపుడా జెండాలన్నీ ఎదురుతిరిగి బుసకొడుతున్నాయి. ఈ క్షణంలో వెడితే పరిస్థితి ఇంకా విషమిస్తుందనుకున్నాడు నాగరాజు.

కారు వెనక్కు తిప్పాడు. ఆఫీసుకు పోయి కొంచెంసేపు విశ్రాంతి తీసుకుందామని అటు మళ్ళించాడు కారును.

తన ఆఫీసుముందు కొత్తగా ఒక షామియానా వెలుస్తోంది. షామియానా ముందు రామదాసు కనిపించాడు నాగరాజుకు. రామదాసుతోబాటు ఇంకా అక్కడ రాజు, ధర్మమూర్తి కూడా ఉన్నారు. అంటే రామదాసు అందర్నీ కూడగట్టాడన్నమాట! షామియానా పైకి లేస్తున్నకొద్దీ షామియానాకు అంటించిన స్లోగన్లు స్పష్టంగా కనిపిస్తున్నాయి. అన్నీ తన అన్యాయాలను ఎకరువు పెడుతూ తననుంచి క్షమాపణ కోరుతున్నవే!

నాగరాజు క్షణం అక్కడ నిలబడి ఆఫీసు లోపలికి నడిచాడు.

లోపల టెలిఫోన్ మోగుతోంది ఒకటే నిర్విరామంగా.

వెళ్ళి అందుకున్నాడు నాగరాజు అసహనంతో. "నాగరాజ్ దిస్‌సైడ్" అన్నాడు.

అవతలినుంచి ఓ నిర్మాత కంఠం చిన్నగా వినిపిస్తోంది – "ఏమిటండీ నాగరాజుగారూ! ఇంకో వారంలో పెట్టుకున్నాంకదా మన పిక్చర్ రిలీజ్! ఇపుడు ఇలా అయిందేమిటి? మీరు...మీ మంచి కోసమే చెప్తున్నాను. అపాలజీ చెప్పేయండి. లేకుంటే పరిస్థితి బాగా విషమించిపోవచ్చు. పెద్దవాడిని–నా మాట వినండి. మీరు అన్యాయమైపోయి మమ్మల్ని ముంచేయకండి" ఇంకా ఏదేదో అంటున్నాడాయన.

 

నాగరాజుకు కోపం పెరిగిపోయింది. రిసీవర్‌ను, క్రేడిల్ మీద ఉంచేశాడు ఏ జవాబూ ఇవ్వకనే.

టెలిఫోన్ మళ్ళీ మోగింది.

నాగరాజు ఆ టెలిఫోన్ ఎత్తలేదు. ఎత్తితే అందులోంచి ఏం వినిపిస్తుందో, అదంతా టెలిఫోన్ అందుకోకనే నాగ రాజుకు వినిపిస్తోంది.

అసహనంతో బయటకు వచ్చాడు నాగరాజు.

షామియానాలో జంబుఖానా పరు స్తున్నాడు రామదాసు. రాజూ, ధర్మ మూర్తిలతోబాటు ఇంకా పరిశ్రమలో రచయితలుగా స్థిరపడ్డ ఎందరో అక్కడ నాగరాజుకు కనపడ్డారు.

నాగరాజుకు ఉక్కిరి బిక్కిరిగా ఉంది. ఎదురుగా ఎక్జిక్యూషన్ స్క్వాడ్ ఉన్నంత చికాగ్గా ఉంది. ప్రాణాలన్నీ బిగుసుకొనిపోతున్నట్లుగా ఉంది.

కారులోకి ఎక్కి కూర్చుని కారు స్టార్ట్ చేశాడు.

లక్ష్యం అంటూ ఏదీ లేకుండా, గమ్యం అంటూ ఏదీ లేకుండా కారు నడుపుతూ వచ్చేశాడు నాగరాజు. అరగంట అయ్యే సరికి నాగరాజు నగర పొలిమేరలు దాటాడు.

నాగరాజు ఉలిక్కిపడి వెనక్కి తిరిగి చూశాడు. నగరం చాలా దూరంలో ఉంది. అయినా... ఒక వేపు నుంచి కార్మిక సంఘాలు, మరో వైపు నుంచి మేధావులైన రచయితల సంఘం, ఇంకో పక్క నుంచి పత్రికలు, నాలుగో దిక్కు నుంచి పరిశ్రమలో పెద్దలూ అందరూ తన వైపు తన పైకి దాడి జరిపేందుకు వస్తున్నట్లుగా వుంది. శత్రువును తరిమి కొడుతున్నట్లుగా, వారంతా చేతులెత్తి వస్తున్నట్లుగా అనిపించింది నాగరాజుకు.

నాగరాజు భయంతో ఒక్కసారి స్టీరింగ్ మీదకు వంగి తలను దాచు కొన్నాడు. చర్మితలోంచి కనబడకుండా పారిపోయే ప్రయత్నం చేస్తున్నట్లుగా ఉంది అతని ప్రవర్తన. జీవితంలో ముందూ వెనుకా అంతా చీకటి అలము కొన్నట్లుగా అతనికి ఆక్షణంలో తోచింది. నాగరాజుకు తనపట్ల తనకే జాలివేసింది, అసహ్యం కలిగింది. జీవితాన్ని తల్చు కొంటే ఏహ్యత కలిగింది. బాధతో కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి నాగరాజుకు.

కళ్ళకు కనపడని దేవుడనేవాడుంటే, వాడువచ్చి ఒకసారి కళ్ళముందు ప్రత్యక్ష మయితే-ఈ జీవితంలోని ఇటీవలి గతాన్ని మరొక్కసారి జీవించే అవకాశం కోసం కోరాలనుకొన్నాడు నాగరాజు. ఆ అవ కాశం రాదు, వస్తే మాత్రం నాగరాజు మళ్ళీ ఇప్పటిలా పరాన్నభుక్కులా జీవిం చేందుకు సిద్ధంగాలేడు. అతన్ని పశ్చా త్తాపం పట్టుకొని పీడిస్తోంది.

నాగరాజు కళ్ళల్లోంచి నీళ్ళు కింపకు కారనారంభించాయి.

ఆ క్షణంలో అతని కన్నీరు తుడి చేందుకు అతనికెవరూ లేరు - ఆప్తులు, బంధువులు, చుట్టాలు, ఆశ్రితజనం... ఆఖరికి అంతవరకూ అతనికి కల్సివచ్చిన కాలం-అన్నీ, అందరూ అతనికి ఎపుడో వీడ్కోలు చెప్పేశారు.

ఇంత పెద్ద ప్రపంచంలో నాగరాజు ఈక్షణంలో ఏకాకిగా మిగిలాడు-మానసి కంగా, శారీరకంగా! అతను రకరకాలుగా సంపాదించిన నోట్లూ, నాణాలు ఏవీ అతన్ని ఓదార్చేందుకు అక్కడ సిద్ధంగా లేవు!!






పుర్రెకో బుద్ధి. మనిషికో సరదా మామూలే కదా! ఇప్పుడా జాబితాలోకి జంతువులు కూడా చేరాయన్నమాట. పులి పిల్లని పెంచటం ఈ రష్యన్ పెద్దమనిషికి సరదా. వాటిని ముద్దాడటం ఆయనగారి పెంపుడు కుక్కగారి సరదా.




రాజులు, మహారాజులు తెరమరుగు అయ్యారు. నిజమే! కానీ, వారి ఆచారాలూ, అలవాట్లూ, డాబు-దర్పాలూ కొనసాగించేందుకు వారసులు మిగిలే-ఉన్నారు కదా!



↑ 'రొయ్యకు లేదా బారెడు మీసం' అంటారే! మాకూ ఉన్నాయి లెండి ఆ మాత్రం.

కంప్యూటర్ సాయంతో డ్రైవర్ లేకుండా 44 మందిని మోసుకెళ్తుంది పట్టాలక్రింద పరుగెత్తే రైలు. ↓





‘నాకీ బందిఖానా ఓ లెక్కా?’ అంటూన్న ఈ ఇంగ్లీషు ‘దున్నపోతు’గారు లండన్ జూలో ఉన్నారిప్పుడు.

ఆ మాత్రం స్పీడు మాకూ ఉంది లెమ్మంటున్నాయి స్లెడ్జిని లా[illegible] ఈ మంచు కుక్కలు.



# అమ్మకోసం

ఒకనాడు యువ హృదయాలను గిలిగింతలు పెట్టిన హాలీవుడ్ తార లానాటర్నర్ ఇల్లది. 730 నార్త్ బెడ్ ఫోర్డ్ డ్రైవ్‌లో వుందది. పోలీసులు హడావుడిగా వచ్చి ఎర్రని కార్పెట్ మీద రక్తసిక్తంగా పడి ఉన్న శవాన్ని, పరిసరాల్ని పరిశీలించి, ఫొటోలు తీశారు.

ఆరోజు గుడ్ ఫ్రైడే. అది 1958 సంవత్సరం అందంగా, అతి ఆడంబరంగా వున్న ఆ భవంతిలో రక్తపుమడుగులో పడిఉన్నాడు జానీ స్టాంపెనాటో. లానాటర్నర్ ప్రియుడతను.

లానా శవంకేసి చూస్తోంది. ఆమెకు కాస్త దూరంలో ఆమె కూతురు ఛెరిల్ కూడా నిల్చొనివుంది. ఛెరిల్ లానా రెండోభర్త రెండోకూతురు. స్టీవ్‌కార్నెతో సంబంధం బెడిసిపోయాక, తన కూడా తెచ్చుకుందామెను.

జానీ శవంమీద అనేక కత్తిపోట్లు వున్నాయి. ముఖ్యంగా గుండె,పొట్టభాగం



ఛిన్నాభిన్నమైంది. ఈ ఘోరహత్య చేసింది లానా కూతురు ఛెరిల్ అని తెలిసినప్పుడు పోలీసువిభాగం, యావత్ హాలీవుడ్ ఫిలిం ప్రపంచం దిగ్భ్రాంతి వెలిబుచ్చింది. ఇంకా టీన్ఏజ్‌లోవున్న ఛెరిల్ తన తల్లి ప్రియుడిని ఘోరంగా హత్య చేసి కూడా నిర్భీతిగా అక్కడే ఉండడం మరింత ఆశ్చర్యపరిచింది.

* * *

లానాటర్నర్ 1921లో ఇడాహో రాష్ట్రం వాలెస్‌లో పుట్టింది. అయితే తల్లి దండ్రులు ఎప్పుడూ కీచులాడుకుంటూ చివరికి విడిపోవడంతో ఆమె దిక్కులేనిదై పోయింది. దూరపు బంధువులు ఎవరో ఆమెను ఆదరించారు. కానీ ఆమె అక్కడ ఎక్కువకాలం ఉండలేకపోయింది. ఏదో దొంగతనం నేరంలో తండ్రి మరణించడంతో కాలిఫోర్నియాలో వున్న తల్లి దగ్గరకు ప్రయాణంఅయింది. వాళ్ళిద్దరూ బతుకుతెరువుకు లాసెంజిల్స్‌కు వలస వచ్చారు.

గత్యంతరంలేక ఒక చిన్న మందుల కొట్లో పనికికుదిరింది లానా. అప్పటికే ఆమె యవ్వనవతి అయింది. చూపరుల్ని ఇట్టే ఆకర్షించే అందం ఆమెది. స్వెట్టర్, టైట్‌పాంట్ వేసుకుని ఆమె షాపుకి వస్తే ఆమెనుచూడ్డానికే చాలాజనం వచ్చేవారట! ఈ అందంచూసి పత్రికలవాళ్లు ఆమెను సినిమారంగానికి ప్రోత్సహించారు. 1937లో 'దె వోంట్ ఫర్‌గెట్ మి' అనే సినిమాలో ఆమె స్వెట్టర్‌తో నటించి పెద్ద సంచలనం తీసుకువచ్చింది. మెట్రోగోల్డ్విన్ మేయర్ వారి చిత్రాల్లో అనేక సెక్సీ పాత్రలు పోషించింది. క్లార్క్‌గేబుల్‌వంటి ప్రఖ్యాత హీరోల సరసన తన అందంతో వెర్రెత్తించేలా నటించి, స్వెట్టర్ గర్ల్‌గా ప్రసిద్ధిచెందింది.

ఆమె టార్జాన్‌మేన్‌గా ప్రసిద్ధిచెందిన లెక్స్ బార్‌కర్, లేటిన్ లవర్‌సుప్రెమో - హీరో ఫెర్నాండో లామాస్, ప్రముఖ సంగీత దర్శకుడు ఆర్టీ షా, గొప్ప బిజినెస్ మాగ్నెట్ స్టీవ్‌కార్నె(అంటే ఛెరిల్‌తండ్రి) ఇలా చాలామందిని పెళ్ళిళ్లు చేసుకుంది. ఆమె జీవితం అంతులేని శృంగారకావ్యం. పెళ్ళి చేసుకోకుండా కూడా సరదాగా కొందరు యువకులతో వీలు ఉన్నపుడల్లా తిరిగేది. అలాంటిప్రియులలో జానీ ఒకడు.

జానీ మంచిఅందగాడు. స్టీవ్‌కార్నెతో లానా సంబంధం తెగతెంపులు చేసుకున్నాక తనరాకను మరింత ఎక్కువ చేసుకున్నాడు జానీ. లానా తత్వం ఎప్పుడూ బహురుచులకోసం తాపత్రయపడడం. అది తెలిసికూడా జానీ ఆవిడ తనకుమాత్రమే పరిమితం అని అనుకోవడంతో అసలు రగడ ప్రారంభమయింది

చీటికీమాటికీ తన తల్లి లానాతో జానీ తగువులుపెట్టుకోవడం,మాటామాటా అనుకోవడం భరించలేకపోయేది ఛెరిల్. ఒక్కోసారి జానీ తన తల్లిని క్రూరంగా కొట్టేవాడు కూడా. ఈ దృశ్యం చూసినప్పుడల్లా ఛెరిల్‌రక్తం ఉడుకెత్తేది.'ఎవడీ జాన్? తన తల్లిని ఎందుకిలా హింసిస్తున్నాడు? వీడి అధికారం ఏమిటి?' అని అతనిమీద బాగా కసిపెంచుకుంది.

ఆసాయంత్రం గుడ్‌ఫ్రైడే రోజు తన తల్లితో గట్టిగా తగువు పెట్టుకుని, కోపంగా బయటకు వస్తున్నజానీని వెంబడించి వంటింటి ఆపిల్‌కోసుకునే కత్తితో పొట్టమీద బలంగా పొడిచింది. ఈ హఠాత్ సంఘటనను ఊహించని జానీ అలాగే నేలకు ఒరిగాడు. కసితీరని ఛెరిల్ జానీని ఇంకా

తీవ్రంగా గాయపరిచి మరణానికి గురి చేసింది.

ఈ నేరం తనే చేసినట్టు రాసుకొమ్మని లానా పోలీసులను బ్రతిమాలుకుంది. వారు దానికి అంగీకరించలేదు. టీన్ ఏజ్ గర్ల్ ఛరిల్‌ను న్యాయస్థానంలో నిల్చోబెట్టారు. ఆనాడు అమెరికాలో అతి ఎక్కువ ఫీజు తీసుకునే జెర్రీ గెయిస్లర్ అనే న్యాయవాదిని నియమించింది లానా—తన కూతుర్ని రక్షించమని! లాభంలేక పోయింది. పత్రికలు, రేడియోలు, టీవీలు ఈ సంచలన సంఘటనను ప్రముఖంగా ప్రసారంచేసాయి.

ఛరిల్‌ను రక్షించేందుకు గెయిస్లర్ అనేక రకాలుగా వాదించాడు. చివరకు 'ఇది ప్రయత్నపూర్వక హత్యకాదు. తన తల్లిని హింసిస్తున్న జానీని బెదిరించడానికి మాత్రమే ఛరిల్ కత్తితీసుకుని బెదిరించింది. అతను తల్లిని మరీ వేధించడంతో ఛరిల్ కత్తితో అతనిని గాయపరుద్దామని అనుకుంది. అంతే! ఈమె హంతకురాలు కాదు' అని వాదించాడు.

గెయిస్లర్‌వాక్చాతుర్యం వల్లనైతేనేం, లానా ప్రముఖ తార అవడంవల్లనైతేనేం ఛరిల్‌కు ఏ శిక్షా పడలేదు. ఆమె విడుదల అయ్యింది.

* * *

నెల్లూరుకి దగ్గరగా వున్న నల్లగుంట క్రిష్టియన్ మిషన్ ఆస్పత్రిలో అంజమ్మ ఒక నర్సు.యవ్వనంతో మిసమిసలాడుతూ వుంటుంది. కొడుకు కిష్టిగాడు పుట్టిన కొద్దిరోజులకే ఆమె భర్త చనిపోయాడు. కిష్టికి ఇప్పుడు పదేళ్ళు. ఆమెకు పదహారేళ్ళప్పుడే వాడు పుట్టాడు.

ఒక రోజు ఉదయం ఆమె ఇంట్లోనే అంజమ్మ శవాన్ని చూసి అంతా ఆశ్చర్యపోయారు. ఆ రెండు గదుల ఇంట్లోని ఒక గదిలో ఆమె అర్ధనగ్నంగా పడి వుంది. ఊడిన జాకెట్టులోంచి రొమ్ములు కనిపిస్తున్నాయి. మెడచుట్టూ ఎర్రని టర్కీ తువాలు చుట్టబడివుంది. మెడ వెనక భాగంలో రక్తంతో గడ్డకట్టిన గాయం వుంది. మరో గదిలో కిష్టిగాడు భయంకరంగా ఏడుస్తున్నాడు.

సీనియర్ సర్కిల్ ఇన్స్పెక్టర్ జలీల్‌ఖాన్ అంజమ్మ శవాన్ని పరీక్షకు పంపేడు. కిష్టిగాడిని పక్కింటివాళ్ళకి అప్పగించాడు.

ఆ ఇంట్లో టైలర్లు వుపయోగించే పెద్ద కత్తెర ఒకటి దొరికింది. దాన్నిండా రక్తం వుందని పోలీసులు స్వాధీనం చేసుకున్నారు.

కిష్టిగాడు బాగా చురుకు. 'టర్కీ టవల్‌గాడే మా అమ్మను చంపి వుంటా'డని తిట్టడం మొదలు పెట్టాడు. పక్క గ్రామంలో ఉండే చెరువుల రోశయ్య అనే టెయిలర్‌ను అంతా టర్కీటవల్ అనిపిలుస్తారు. ఎప్పుడూ ఎర్రని టర్కీటవల్ మెడచుట్టూ వేసుకుని ఉంటాడని అంతా అతనికాపేరు పెట్టారు. రోశయ్య అంజమ్మ అందానికి దాసోహమని, తరుచూ వచ్చి వెళ్తూండేవాడు. వాళ్ళిద్దరూ పక్కగదిలో రాసలీల జరుపుకోవడం కిష్టిగాడికి తెలుసు. వాడికి అంజమ్మ అన్నా, రోశయ్య అన్నా కోపం. తెలిసీ తెలియని వయసు. అంతా వాడిని గేలిచేస్తూంటే వాడికెంతో బాధగా వుండేది.

అంజమ్మ హత్యను ఉపయోగపడ్డ తువాలు, కత్తెర—రెండూ రోశయ్యవే! పోలీసులు పాలపాడు వెళ్ళి రోశయ్య

గురించి గాలించారు. వాడు రెండు రోజుల నుంచి ఊళ్ళో లేడనీ, వాడు చాలామంచి వాడనీ, పక్క ఊళ్ళో అంజమ్మ అనే మహమ్మారి వాడిని వలలో వేసుకుని తన కాపురం కూల్చిందనీ శోకనాలు మొదలు పెట్టింది - రోశయ్య భార్య మరియమ్మ. వాళ్ళకి ఒక కొడుకు.

పోస్ట్‌మార్టం రిపోర్టు ప్రకారం అర్ధ రాత్రి దాటేక హత్య జరిగి వుండవచ్చనీ, ఊపిరి ఆడక ఆమె మరణించి వుండ వచ్చనీ, మరణానికి ముందు ఆమె సంతృప్తి కరమైన సంభోగంలో పాల్గొని వుండవచ్చనీ తేలింది. కత్తెరతో గాయం చేయడం వల్ల మరణించే అవకాశంలేదనీ, మరణానంతరమే కత్తెరతో గాయం చేయడం జరిగి వుండవచ్చని కూడా రిపోర్టు వెల్లడించింది. ఇందుకు రక్తం గడ్డకట్టి వుండడమే నిదర్శనం - అన్నారు నిపుణులు.

ఇన్‌స్పెక్టర్ ఆలోచనలు అనంతమయ్యాయి. తువాలుతో ఊపిరి ఆడనివ్వ




కుండా చేసి చంపిన తర్వాత, కత్తెర ఎందుకు ఉపయోగించినట్టు?

కిష్టిగాడు కూడా రాత్రి రోశయ్య వచ్చి వెళ్ళాడని చెప్పాడు. కానీ అంతటితో సంతృప్తి చెందలేదు జలీల్ ఖాన్. మరో సారి అంజమ్మ ఇంటికి వెళ్ళి నిశితంగా చూశాడు. ముందు గదిలో వున్న గోడ బీరువాలోకి వెళ్తూ నల్లచీమల బారు కని పించింది అతనికి. వాటిని అనుసరించి లోపలికి చూస్తే ఓ డబ్బా కింద వున్న కాగితం మీదకు అవి వెళ్తున్నాయి. అది నూనెతో వుంది. ఏదో తీపి వస్తువు పొట్లం కట్టి వుంటాలి. ఆ కాగితాన్ని తీసిచూశాడు. దానిమీద చెదురు మదురుగా అక్షరాలు కూడా వున్నాయి. అనుమానంతో కిష్టిగాడి వేలిముద్రలను కూడా తీసుకున్నాడు. ఆ నూనె మరకల కాగితాన్ని కూడా పరీక్షకు పంపేడు. ఆ డబ్బాపక్కనే కిష్టిగాడి స్కూల్ బాక్స్ వుంది. దాంట్లో తళతళ మెరుస్తూ అయిదు కొత్తరూపాయి బిళ్ళలు కనిపిం చాయి. "ఇవి నీకెక్కడివి" అని అడిగాడు. వాడు బిత్తరపోతూ "నాకు తెలీదు. అమ్మ పెట్టి వుంటుంది" అని అన్నాడు. జలీల్ అనుమానంతో "నీ పెట్టెలో ఎందుకు వుంచింది? రోశయ్య ఇచ్చాడా?" అని అడిగాడు.

''వాడా? వాడు వట్టి పీనాసి పీచుగాడు. ఒక్కపైసకూడా ఇవ్వడు...'' అన్నాడు కిష్టిగాడు.

తర్వాత నిపుణుల పరీక్షలో ఆ కాగి తంలో తీపి బూంది చుట్టివుండవచ్చని, అది అంజమ్మ మరణించిన రాత్రే తెచ్చి వుండవచ్చని తెలిపారు. అంతేకాదు ఆ నూనెకాగితంమీద 'చల...' అనే ఇంగ్లీషు అక్షరాలు చూచాయగా కనిపించినట్టు కూడా తెలిపారు. ఆ పూర్తిపేరు చలపతి' చలమయ్య, చలమాజీ—ఏదైనా కావచ్చని ఊహించాడు జలీల్. ఈ ప్రశ్నకు రోశయ్య సమాధానం ఇవ్వగలడని తిరిగి అతని గురించి అన్వేషించాడు.

నెల్లూరు జేమ్సు గార్డెన్‌లో వుంటున్న సుశీల ఇంట్లో దొరికాడు రోశయ్య. అంజమ్మ హత్య విషయం విని అతను హతాశుడయ్యాడు. ఇది తప్పక చల మయ్య పనే అయివుంటుందని అన్నాడు. అంజమ్మ హత్య జరిగినరాత్రి రోశయ్య సుశీలతోనే వున్నాడు.

''ఎవడీ చలమయ్య?'' అని అడిగాడు. "వాడు ఆసుపత్రిలో కంపౌండరు. వాడు అంజమ్మతో సంబంధం పెట్టుకున్నాడు. అదొక బిచ్. వాడే దాన్ని హత్యచేశాడు" అన్నాడు.

జలీల్ మనసులో ఏదో మెరిసింది. వెంటనే కిష్టిగాణ్ని కలుసుకుని ''మీ అమ్మ దగ్గరికి చలమయ్య వచ్చాడు కదూ? నీకు ఆరూపాయలు వాడే ఇచ్చాడుకదూ ? ఆ రాత్రి లడ్డూలు కూడా తెచ్చాడుకదూ" అంటూ దబాయించాడు. కిష్టిగాడు బావురుమంటూ అవునని ఒప్పేసు కున్నాడు. ఈలోగా చలమయ్యను పోలీ సులు అరెస్టు చేశారు.

''అవును. నేనే అంజమ్మను చంపేను. నా నుంచి ఆమె విపరీతంగా డబ్బు గుంజేది. లేదంటే ఆస్పత్రిలో మందులు తీసుకువచ్చి అమ్మమనేది. ఎప్పుడూ ఏదో ఒకటి కావాలని అడిగేది. నేను అలా చెయ్యనన్నాను. నన్ను భయపెట్టింది. నాకు ఆరుగురు కూతుళ్లు. ఇద్దరికి పెళ్ళి చేశాను. ఇంకా నలుగురికి పెళ్ళిచెయ్యాలి. నా పరువు తీస్తానంది. నా భార్యకు, నేను పనిచేస్తున్న చర్చి ఆస్పత్రి అధికారులకు తనను నేను వేధిస్తున్నానని చెప్తానంది

నేను భయపడ్డాను. అందుకు పథకంవేసి నా మీదకు అనుమానం రాకుండా ఆ టెయిలర్‌గాడి తువాలు, కత్తెరతో హత్య చేశాను. తువాలుతో ఊపిరాడకుండా చేశాను. అనుమానం తీరడానికి కత్తెరతో కూడా పొడిచాను. దానితో సుఖంగా గడి పాక, అది నిద్రపోయాక ఈ పని చేశాను...." అంటూ వివరించాడు చలమయ్య.

చలమయ్యే తన తల్లిని చంపేడని కిష్టిగాడికి తెలిసినా రోశయ్యమీద కోపంతో నేరం వాడి మీదకు నెట్టడానికి ప్రయత్నించాడు వాడుకూడా.

చలమయ్యకు ఉరిశిక్ష అమలుచేశారు.

* * *

**అ**ది 1970 డిశంబర్ 20 సూర్యోదయ సమయం.

చెంగల్పట్ జిల్లా సిన్నేరి గ్రామ స్మశానంలో అడ్డంగా పడివున్న ఓ ఇరవై ఏళ్ళ యువకుడి శరీరాన్ని చూసి అదిరి పోయారు ఇద్దరు పశులకాపర్లు. అతని శరీరం మీద ఎలాంటి గాయాలూ లేవు. నిద్రపోతున్నట్టు వున్నాడు. చొక్కా, బనియన్, అండర్‌వేర్, లుంగీ–ఇదీ అతని వస్త్రధారణ.

వెంటనే వెళ్ళి రంగనాథన్ అనే గ్రామ సర్పంచ్‌కు తెలియజేశారు. అతను హుటాహుటి వచ్చి చూసి పోలీసులకు రిపోర్ట్ ఇచ్చాడు. పోలీసులు వచ్చి చెయ్య వలసిన తతంగమంతా చేసి, ఆ యువ కుడిని పరీక్షించారు. అతను బతికే వున్నాడు–కాకపోతే అపస్మారక స్థితిలో వున్నాడు.

చెంగల్పట్ మెడికల్ కాలేజీలో జాయిన్ చేశారు. అతడిని బతికించడానికి డాక్టర్లు శాయశక్తులా ప్రయత్నించారు గానీ, 22వ తేదీని అతను మరణించాడు. ఎక్కువ సంఖ్యలో ఫెనోబార్బిజోన్ అంటే నిద్రమాత్రలు మింగడంవల్ల ఈ మరణం సంభవించిందని నిర్ణయించారు.

'ఇంతకీ ఈ యువకుడు ఎవరు? ఎందుకు ఇన్ని నిద్రమాత్రలు మింగాడు? ఇక్కడికెలావచ్చాడు?' ఇవన్నీ ప్రశ్నలు గానే మిగిలిపోయాయి. అతని చొక్కా మీద 'ఫేమస్ టెయిలర్స్–కారైకుడి' అనే గుర్తు కనిపించడంతో పరిశోధన ప్రారం భించారు. ఈ వార్తను తమిళ దినపత్రిక 'దినతంతి' 1971 జనవరి 2న ప్రము ఖంగా ప్రచురించింది.

ఈ ప్రకటన చూశాక కారైకుడిలో వున్న సుబ్రహ్మణ్యం, కరుప్పన్ చెట్టి యార్ అనే వర్తకులు తమ మేనల్లుడు వాడివుల్లువన్ అనే ఇరవై ఏళ్ళ యువకుడు మద్రాసు వచ్చి మరి తిరిగి రాలేదని, అతని వద్ద 90 వేల రూపాయలు వున్నా యని మద్రాసు సిటీపోలీసు కమిషనర్‌కు ఫిర్యాదుచేశారు. అతని చేతికి టిటోని వాచీకూడా వుందని అన్నారు.

పోలీసుల పరిశోధన జరుగుతూండ గానే మార్చి 1971లో ఆంధ్రప్రదేశ్‌కు చెందిన నగరిపేట గ్రామశివార్లలో ఓ పెద్ద చింత చెట్టుకు ఒక శవం వేలాడుతూ కనిపించింది. అతను కట్టుకున్న లుంగీనే అతనికి ఉరిగా ఉపయోగపడింది. ఒక్క చొక్కామాత్రం శరీరం మీద వుంది. ఆ చొక్కాకి వుండే టెయిలర్ గుర్తు కత్తిరించ బడింది.

మురుగప్ప నాయుడు అనే గ్రామస్తుడు ఈ శవాన్ని చూసి గ్రామ మునసబుకు ఫిర్యాదు చేశాడు. పోలీసులు హంగామా అంతా అయాక ఆ శవాన్ని తిరుపతి

ఆస్పత్రికి తీసుకువెళ్లారు. పోస్ట్‌మార్టంలో ఇతని శరీరంలో కూడా ఫెనోబార్బిజోన్ ఎక్కువ మోతాదులో కనిపించింది. అయితే ఇది ఇంజక్షన్ రూపంలో వుంది. సుంతీ చేయబడిన జననాంగాన్ని బట్టి ఇతను ముస్లిమ్ అని చెప్పారు ఆస్పత్రి అధికారులు.

పేపర్లలో ప్రకటనల్తో పరిశోధన ప్రారంభించారు పోలీసులు. 'మార్చి 24న రామంతపురం జిల్లా అజగంకళమ్ గ్రామం నుంచి తన బావమరిది వచ్చాడని, అతని వద్ద 55 వేల రూపాయలు వున్నాయని, అతను ఎగ్మోర్ స్టేషన్ నుంచి బయలుదేరవలసివుండగా ఏమయ్యాడో మరి కనిపించలేదని' సాహుల్ హమీద్ అనే మద్రాసు న్యూ కాలేజీ ట్యూటర్ ఒకాయన రాయపేట పోలీస్ స్టేషన్‌లో రిపోర్టు ఇచ్చాడు.

జూలై 1971లో చిత్తూరు జిల్లా రామాపురం ప్రాంతంలో వున్న ఓ కాలువలో బాగా కుళ్ళిపోతున్న ఓ శవాన్ని కొందరు కుర్రాళ్లు చూసి పెద్దవాళ్ళకు చెప్పారు. వాళ్లు పోలీసులకు ఫిర్యాదు చేశారు. ఇన్‌స్పెక్టర్ అన్సారి రంగంలోకి దూకి శవాన్ని పరీక్షకు పంపేడు. శవపరీక్షలో ఎక్కువ మోతాదులో ఫెనోబార్బిజోన్ ఇంజెక్ట్ చేయడం వల్ల మరణం వచ్చిందని తేల్చారు. సుంతీ చేయించబడ్డ జననాంగం వల్ల ఈ శవం కూడా ముస్లిమ్‌దే అని తేలింది. పోలీసు శాఖలో ఆందోళన ప్రారంభం అయింది.

'ఈ హత్యలన్నీ ఒక పథకం ప్రకారం జరుగుతున్నాయేమో' అనే అనుమానం కలిగింది. వీటి వెనుక ఫెనోబార్బిజోన్ వుండడం ఈ అనుమానాన్ని బలపరిచింది.

పరిశోధన, ఆలోచనలు ఇలా వుంటూండగానే మరికొద్ది రోజుల్లో మద్రాసు-బెంగుళూర్ జాతీయ రహదారిలో చిత్తూరు జిల్లాకు చెందిన కల్లూర్‌పల్లి అనే గ్రామ సమీపంలో ఓ కానా కింద బురదలో మరో శవం కనబడింది. అది బాగా కుళ్ళి, పురుగులుపట్టి భయంకరంగా తయారైంది. గ్రామస్తుల రిపోర్ట్ ప్రకారం పోలీసులు రంగంలోకి దిగారు. ఈ శవం కూడా ముస్లిమ్‌దే కావడం, ఫెనో బార్బిజోన్ ఈ మరణానికి కారణం కావడంతో ఆంధ్ర - తమిళనాడు పోలీసు విభాగంలో సంచలనం ఎక్కువైంది.

1970-72 మధ్యకాలంలో దాదాపు ఏడు హత్యలు ఆంధ్ర - తమిళనాడు సరిహద్దు ప్రాంతంలో జరిగాయి. ఇందులో అయిదుగురు ముస్లిమ్‌లు కావడం మరింత ఆశ్చర్యంగా భావించారు. ఎన్నిరకాల ప్రయత్నాలు చేసినా ఏ రకమైన క్లూ లభించలేదు.

ఇదిలావుండగా 1972 నవంబరులో సయ్యద్ అహ్మద్ అనే వ్యక్తి మద్రాసు సెవెన్ వెల్స్ పోలీసు స్టేషన్‌లో ఒక ఫిర్యాదు చేశాడు. అతనిది కీలక్కరై గ్రామం. అది స్మగ్లింగ్‌కు ప్రసిద్ధి చెందింది.

తన అల్లుడు 'ఉమర్ అబ్దుల్ ఖాదర్ టిక్కాతంబి' అనే అతను కనిపించడం లేదని అతని ఫిర్యాదు. టిక్కా తంబి మద్రాసువెళ్ళి మరి తిరిగిరాలేదని, తన కూతురు సుహోతాబీబీ దుఃఖం తాను చూడలేకపోతున్నానని ఫిర్యాదు చేశాడు.

పోలీసు శాఖ ఈ కేసుల గుత్తలాన్ని సి.ఐ.డి. రామకృష్ణన్‌కు అప్పగించింది. అతను మంచి కార్యదక్షుడు కావడంతో రంగంలోకి దూకాడు.

తమిళనాడులో కీలక్కరై గ్రామం





స్మగ్లింగ్‌కు ప్రసిద్ధిచెందడం, టిక్కాతంబి అక్కడివాడు కావడంతో ముందు తన పరిశోధన ఆ గ్రామంనుంచి ప్రారంభించాడు రామకృష్ణన్.

అక్కడ మహమ్మద్ తంబి అనే వ్యక్తి ద్వారా ఎన్నో ఆసక్తికర విషయాలు బయటకు వచ్చాయి.

"నేనూ, టిక్కా తంబి కలిసి మద్రాసు వెళ్ళాం. అక్కడ మా ఊరివాడే అబ్దుల్ ఖాదర్‌కి ఒక చిన్న బట్టల షాపు వుంది. అతను చాలా బీదవాడు. అయినా తొందర్లోనే బాగా ఆర్జించి ధనవంతుడవడం మాకు ఆశ్చర్యాన్ని కలిగించింది. నేను అతడిని ఇందులో కిటుకుచెప్పమన్నాను. చెప్పాడు.

'దొంగవ్యాపారం-ముఖ్యంగా బంగారం వ్యాపారం చేసేవారి ఆచూకీ కష్టమ్స్ శాఖకు చెబితే వారు మనకి బాగా డబ్బు ఇస్తారు. అది ప్రభుత్వానికి సహాయంచేసినట్టేకదా! అంచేత అలాచేసి నాలుగు రూపాయలు ఆర్జిస్తున్నాను'అని అంటూ-

'టిక్కాతంబి బాగా దొంగబంగారం వ్యాపారం చేస్తూంటాడుకదా. ఆ రహస్యం కాస్తా కస్టమ్స్‌కు చేరవేస్తే నీ పంటపండుతుంది' అని అన్నాడు.

నేను ఆలోచించి 'అది మంచిపనే కదా' అని నిర్ణయించుకుని అలాగే అన్నాను. ఖాదర్ నన్ను మురుగన్ సిన్మా హాల్ వద్దనున్న రెష్టారెంట్‌లోకి తీసుకెళ్ళి వేణు అనే వేణుగోపాల్‌ని, పార్థసారథిని, కన్నన్‌ని పరిచయం చేశాడు కస్టమ్స్ అధికారులుగా. పార్థసారథి నాకు ముప్పై రూపాయలు ఇచ్చి ఆశపెట్టాడు. నేను వాళ్ళకి సహాయం చెయ్యడానికి నిశ్చయించుకున్నాను.

రెండు రోజుల తర్వాత నేను, టిక్కాతంబి, ముత్తయ్య అనే మరో మిత్రుడు

కలిసి బెంగుళూరు రైలు ఎక్కుతూండగా, మాతోపాటు కన్నన్ కూడా అదే రైలు ఎక్కాడు. ఈ సంగతి నాకు ఒక్కడికే తెలుసు.

1972 అక్టోబర్ 25న బెంగుళూరులో భారతీ హోటల్‌లో మేం దిగాం. కన్నన్ వేరేగా మరో రూంలో దిగాడు. నా పని కేవలం టిక్కాతంబి కదలికలు తెలియజేయడమే! వాళ్ళ ప్లాన్ ప్రకారం వేణు, కన్నన్ కాక మరో ముఖ్యమైన కస్టమ్స్ ఆఫీసర్ వైతీశ్వరన్–ఈముగ్గురూ భారతి హోటల్ ఎదురుగా దిగి నా సంకేతాలకోసం ఎదురుచూశారు.

26వ తేదీని టిక్కాతంబి బెంగుళూరులో తన వ్యాపారస్తులనుంచి 23 బంగారు బిస్కట్లను తెచ్చాడు. అవి నేను, ముత్తయ్యా కలిసి టిక్కాతంబి చంకల కింద రహస్యంగా కట్టాం. మా వద్ద శలవు తీసుకుని అతను వెళ్ళిపోయాడు. ఆ తర్వాత ఏమైందో మరి తెలీదు.

నేను కీలక్కరై వచ్చిన వారం తర్వాత మహమ్మద్ ఇబ్రహీం అనే మిత్రుడు మరికొన్ని విశేషాలు చెప్పాడు. అతను కూడా బెంగుళూరు వెళ్లాడట. అక్కడ అతను, ముత్తయ్యా కలిసి టిక్కాతంబికి వెల్లూరుకి టిక్కెట్ తీశారట. అతను బయలుదేరటం చూశారట గానీ ఆ తర్వాత ఏమైందో వాళ్ళకీ తెలీదట. ఈ విషయంలో ఆందోళనతో వాళ్లు శాంతిలాల్ అనే మరో మిత్రుడిని కలిసి చెప్పారట. అప్పుడు శాంతిలాల్ దగ్గర కొన్ని బంగారు బిస్కట్లు వున్నాయట. అంతేకాదు, పార్థసారధి దగ్గర కూడా మరికొన్ని చూశారట. అయితే అడిగేధైర్యం లేక తిరిగి వచ్చి నాకు చెప్పారు. నేను సయ్యద్ అహ్మద్‌కు

జరిగిందంతా వివరించాను. అతను ఆందో ళనతో పోలీసు రిపోర్టు చేశాడు" అంటూ చాలా వివరంగా చెప్పాడు అహ్మద్ తంబి.

సి.ఐ.డి. రామకృష్ణన్‌కు ఇదంతా ఏదో పెద్ద గూడు పుఠాణీలా అనిపించింది మద్రాసు తిరిగి వచ్చి కేసుని క్షుణ్ణంగా చదివి, ఈ హత్యల వెనుక తప్పకుండా ఒక గేంగ్ వుందని నిశ్చయించుకుని, ఫైల్స్‌లో దొరికిన దావూద్ అనే ఓచిన్న వ్యాపారస్తుడి చిరునామాతో బయలు దేరాడు.

ముందు కాస్త ఇటూ అటూ అయినా భయపెట్టేసరికి తనకు తెలిసిన నిజాలు బయటపెట్టాడు దావూద్.

"తంబుచెట్టి వీధిలో ఒక హెయిర్ డ్రెస్సింగ్ సెలూన్ వుంది. అక్కడ నేను తరచూ కూర్చుంటూంటాను. అక్కడికి వేణు తరచూ వస్తూండేవాడు. మేం అక్కడి నుండి కొందరు స్మగ్లర్లను కని పెట్టి, భయపెట్టి కాస్తోకూస్తో లాగేవాళ్ళం వాళ్ళ దగ్గరనుంచి. ఒకరోజు వైతీశ్వరన్ నా దగ్గరకు వచ్చి తన ఇంటి మీద అప్పు సంపాదించమని కోరాడు. వైతీశ్వరన్ చదువుకున్నాడు. ఫార్మసిస్ట్‌గా అతనికి అనుభవం వుండడమే కాక, ఒక మందుల షాపు కూడా అన్నాసలైలో వుంది. మనిషి మంచి ఒడ్డూ పొడుగూ బాగుండేవాడు. నేను సరదాగా అన్నాను-'మీరు కస్టమ్స్ ఆఫీసర్‌గా వేషం వెయ్యండి. మేం సహాయం చేస్తాం. మీకు కావల్సినంత డబ్బు' అని. అతను ఓకే అన్నాడు. కథ ప్రారంభించాం.

ముందుగా కమల్ బచ్చా అనే అతను పది బంగారం బిస్కట్లతో వెళ్తూంటే, అడ్డగించి భయపెట్టాం. అతను ఆ బంగారం బిస్కట్లు మాకు వదిలేసి వెళ్ళిపోయాడు. మాకు ఎంతో ఆనందం కలిగింది. అయితే కమల్ తిన్నగా వెళ్ళి తన బాస్ 'కాకా'ని వెంట తీసుకువచ్చాడు. కాకా సామాన్యుడుకాడు. మమ్మల్ని దమాయించి ఇచ్చినవి ఇచ్చినట్టే లాక్కుపోయాడు.

కథ అడ్డం తిరిగినందుకు విచారించాం. 'ఆ కమల్‌గాణ్ని చంపేసి వుంటే ఈ గొడవ లేకపోవునుకదా' అనిఅనుకున్నాం. అయితే చంపే మార్గం ఏమిటి? రక్తం, గాయం కనపడకుండా అడు తొలగించుకోవాలి. ఆలోచించాడు వైతీశ్వరన్.

మాకు తాపీగా ఒక గేంగ్ తయారైంది. అందులో పార్థసారథి, వేణు, వైతీశ్వరన్ - వీళ్ళు కస్టమ్స్ ఆఫీసర్లుగా వ్యవహరిస్తూంటారు. నేను, అయూబ్, మజీద్, గోపాల్, లక్ష్మణన్, కన్నన్- మేమంతా ఆయా పరిస్థితుల బట్టి గుమాస్తాలుగా, ప్యూన్‌లుగావ్యవహరిస్తూంటాం.

బ్రాడ్వే హోటల్ చాలా పెద్దది. అందులో ఎందరో స్మగ్లర్లు వచ్చిపోతూంటారు. లక్షలమీద వ్యాపారం సునాయాసంగాజరిగిపోతూంటుంది. ఆ హోటల్లో బషీర్, జఫరుల్లా అని ఇద్దరు బాయిస్ వుండేవారు. వారికి అయూబ్ బాగా టిప్ చేసి 'కస్టమ్స్ అధికారులకు రహస్యాలు అందిస్తే బాగా డబ్బు దొరుకుతుంది' అని బోధించాడు. వాళ్ళుఅంగీకరించారు. త్యాగు అనే మరో అబ్బాయిని కూడా వారికి సహాయంగా ఏర్పాటు చేశాం.

ఆ రోజు 1970 డిసెంబర్ 19. ఒక వ్యక్తి హోటల్ బ్రాడ్వేలో గది తీసుకుని మేనేజర్‌తో 'నాదగ్గర లక్షన్నర రూపాయలు వున్నాయి. మీ హోటల్‌లో లాకర్లున్నాయా?' అని అడిగాడు.




మేనేజర్ 'లాకర్లు లేకపోయినా 'జాగ్రత్త చెయ్యగలం' అనిచెప్పాడు. కానీ, అతను డబ్బును తనదగ్గరే వుంచుకున్నాడు.

బషీర్, జఫరుల్లాల సంకేతం ప్రకారం త్యాగు వైతీశ్వరన్‌కు విషయం చెప్పాడు. ఆ సాయంత్రం డబ్బుసంచీతో ఆ వ్యక్తి బయటకు వచ్చి అలా మెల్లిగా నడిచి వెళుతుంటే పోలీస్‌స్టేషన్‌దగ్గర అతణ్ని అటకాయించి కస్టమ్స్ ఆఫీసుకు రమ్మని పక్కనేవున్న టాక్సీ ఎక్కించారు పార్థసారథి, వేణు. అతను నిరుత్తరుడయి పోయాడు. అయినా బయటపడలేదు. ఇంటరాగేషన్‌నెపంతో అతడిని వైతీశ్వరన్ మందులషాపు మీనాఫార్మసీకి తీసుకువచ్చి ఏసీగదిలో కూర్చోబెట్టారు. స్పెషల్ ఆఫీసర్ ముసుగులో వైతీశ్వరన్ వచ్చి ఇంటరాగేషన్ చేశాడు. అతడు తన పేరు ఎస్.పి.రామనాథన్ అని, తనవద్దవున్న డబ్బు నల్లడబ్బుకాదని, దానికి లెఖ్ఖ వుందని గట్టిగానే చెప్పాడు. దానికి వైతీశ్వరన్ ఆ విషయాలని కాగితంమీద రాసి, రెవిన్యూస్టాంప్‌మీద సంతకంచేసి ఇమ్మన్నాడు. రామనాథన్ తొణకలేదు. అక్షరాలా అలాగే చేశాడు.

ఈలోగా రామనాథన్ పెట్టెలోవున్న డబ్బుని అతిలాఘవంగా మరో అట్ట డొక్కులోకిమార్చి ఈ బ్రీఫ్‌లోకి చిత్తుకాగితాలు కూరారు పార్థసారథి తదితరులు. రామనాథన్ అలా సంతకాలు పెట్టిన కాగితాన్ని వేణు తన పర్సులో భద్రం చేసాడు. వైతీశ్వరన్ 'ఇంకా పెద్ద ఆఫీసర్ వద్దకు నిన్ను తీసుకువెళ్ళాలని' రామనాథన్‌ని కారెక్కించాడు.

గోపాల్ కారు నడిపాడు. వైతీశ్వరన్ అతనిపక్కన కూర్చున్నాడు.వెనక సీట్లో పార్థసారథి, వేణు, రామనాథన్, నేను కూర్చున్నాం.

కారులో చాలా సేపు ఇంటరాగేషన్ నడిచింది. రామనాథన్ దిగిరాలేదు. 'నీకు ట్రూత్ సీరమ్‌గాని, నిజం పలికించే టేబ్లెట్లుగాని ఇస్తేనే నువ్వు నిజం పలుకుతావు' అంటూ అతనిగొంతులో ఒక్కొక్కమాత్రా వేశారు. అతను చాలా పెనుగులాడేడు. నీటిచుక్క అయినా పొయ్యకుండా ఒకదాని తర్వాత ఒకటి అలా ఇరవై మాత్రలు అతడిచేత బలవంతంగా మింగించారు. తోవలో ఒకచోట ఆపి పక్కనే పారుతున్న నీటిలో రుమాలు ముంచి గొంతు తడిపారు. రామనాథన్ స్పృహ కోల్పోయాడు.

అప్పటికి సూర్యోదయం ఇంకా గంట వుందనగా ఆ ఇరవయ్యోతేదీని కారు సిన్నేరి గ్రామ శ్మశానానికి చేరుకుంది. వెంటనే ఆ శరీరాన్ని ఆ శ్మశానంలోకి విసిరేసి అతని చేతికున్న టైటాని వాచీని కూడా లాక్కొని బయలుదేరాం. ఇంతకీ అతనిపేరు రామనాథన్ కాదు. వాడివ్వల్లవన్ అనే చెట్టియార్ల యువకుడు. వాళ్ళది కారైక్కుడి.

మార్చి 1971లో ఓరోజు వైతీశ్వరన్ ముతాకు హోటల్ బాయ్ బషీర్‌నుంచి మరో కబురు అందింది.

అంతే! సారథి రంగంలోకిదూకి, ఒక ముస్లిమ్‌ని ఎటాక్‌చేసి, కారులో కస్టమ్స్ ఆఫీసుకు లాక్కుపోయాడు. అతనివద్ద 55వేలరూపాయలు వున్నాయి. అది తెల్లడబ్బే అంటాడు అతను. పేరు అడిగితే మాణిక్కామ్ అన్నాడు. కానీ అతను నిస్సందేహంగా ముస్లిమ్ యువకుడే. అతని వేషభాషలబట్టి వైతీశ్వరన్ ఇత్యాదులు భయపెట్టారు. అయినా బయటపడలేదు. 'నా బావమరిది సాహుల్ హమీద్

ఇక్కడ కాలేజీ లెక్చరర్. వారిని పిలిపిస్తే మీకు నిజం తెలుస్తుంది' అని అన్నాడు. కానీ వాసు, సారథి భయపెట్టి 'ట్రూత్ సీరమ్' పేరిట ఫెనో బార్బిజోన్ ఇంజక్షన్ను ఎక్కువడోసులో ఇచ్చేశారు. అతడివద్ద ఉన్న డబ్బుని స్వాధీనంచేసుకుని,అతడిని కారులో ఈసారి తమిళనాడులో కాక ఆంధ్రప్రదేశ్ పరిసర ప్రాంతం అయిన నగరికి తీసుకుపోయారు. బాగా పెరిగిన చింతచెట్టుకు ఆ శవాన్ని అతడి లుంగీ సహాయంతోనే ఉరిలా వేలాడదీసి, చొక్కాకి వున్న టెయిలర్స్ మార్క్‌ని చింపేసి హాయిగా వెనక్కి వచ్చేశారు. ఆ డబ్బంతా అందరం పంచుకున్నాం.

మరోసారి అంటే 1971 జూలై 9వ తేదీన దక్షిణామూర్తి అని ఒక స్నేహితుడు మేం అందరం బాగుపడిపోవడం భరించ లేక మానుంచి డబ్బుగుంజడం ప్రారం భించాడు. ఇవ్వకపోతే బెదిరించి లాక్కునే వాడు. భరించలేక వేణు ఈ పీడవదిలించు కుంటే మంచిదని వైతీశ్వరన్ సాయంతో పథకంవేశాడు. బెంగుళూరు సరదాగావెళ్లి వద్దామని కారులో బయలుదేరాడు—దక్షిణా మూర్తిని తీసుకుని. వెనక కారులో మేం బయలుదేరాం. మా కారులో కొంత పెట్రోలుకూడా తీసుకువెళ్ళాం. చిత్తూరు ప్రాంతం వచ్చేసరికి మూర్తికి పెథిడిన్ ఇంజక్షన్—అదే ఫెనోబార్బిజోన్ ఎక్కువ డోసులో ఇచ్చి ఆ శవాన్ని కారులోంచి ఇవతలకుతోసేసి పెట్రోలుతో అంటిం చేశాం. ఆ రకంగా అతడి బాధ వదిలించు కున్నాడు వేణు.

మరోసారి బుహారీ తంబి అని ఒకవ్యక్తి నుండి 60వేల రూపాయలు కాజేసి, అతడిని ఫెనోబార్బిజోన్ ఇంజక్షన్ను ఇచ్చి చిత్తూరు ప్రాంతపు కల్వర్ట్—అంటే కానా కింద తోసేశాం.

ఈ రకంగా వైతీశ్వరన్, సారథి, వేణు బాగా ఆర్జించి, ఎన్నో ఆస్తులు కొను క్కుని కార్లలో హాయిగా జీవించడం ఆరంభించారు. వాళ్ళకార్లలో ఫెనోబార్బి జోన్ అంటే–పెథిడిన్ ఇంజక్షన్లు, సిరింజి, సూదులు, గట్టి రబ్బరుగుడ్డ, ఎప్పుడూ పాడే రేడియో,కేసెట్లు, నల్లని గ్లాస్ డోర్స్ ఇవి విధిగావుంటాయి" కథ ముగించాడు దావూద్.

సి.ఐ.డి. రామకృష్ణన్ ఇంత పెద్ద రాకెట్ బయటకువచ్చినందుకు సంతోషిం చాడు. వేణును సోదాచెయ్యగా రామ నాథన్ పేరుతో వాడివుల్లువన్ సంతకం చేసి, ఇచ్చిన కాగితం దొరికింది. దానితో కేసు మరింత బలపడింది.

సాక్ష్యాధారాలతో వైతీశ్వరన్, పార్థ సారథి, వేణు ఇత్యాదులంతా అరెస్ట్ అయ్యారు. వేణు ప్రభుత్వపక్షానికి మారి జరిగిన హత్యలన్నీ సవివరంగా తెలియ జేశాడు.

ఆ ముఠామీద 56 ఛార్జీలు పెట్టారు. 263 మంది సాక్ష్యులను విచారించారు. 643 ఎగ్జిబిట్స్ దాఖలుపర్చారు. 187 మెటీరియల్ ఆబ్జెక్టులు అందజేశారు. అనేక నెలలు సాగిన ఈ కేసును జస్టిస్ ఎస్. విజయరంగం స్టడీచేశారు.

పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా పి. రాజ మాణిక్కమ్ అసాధారణమైన ప్రజ్ఞ చూపించారు.

వైతీశ్వరన్ తన తరఫున వి.పి.రామన్ అనే వకీలును పెట్టుకుని వాదించారు. ఆయన వాదనకూడా ఆసక్తికరంగానే సాగింది. ముఖ్యంగా వేణు అప్రూవర్‌గా మారి చెప్పినసాక్ష్యాలు నమ్మడం

 

అన్యాయం అన్నాడు. అనేక శవాలు రూపురేఖలు లేకుండా పోయాయి. అవన్నీ వైతీశ్వరన్ హత్యచేసినవే అని అనడం దారుణం. ఈ హత్యలన్నీ జరిగాయనే ఒప్పుకున్నా ఇవి కేవలం ఇంకెవరో పెథిడిన్ ఇంజక్షన్లుఇచ్చి వాటిని వైతీశ్వరన్ మీదకు నెట్టబడినవి ఎందుకు కాకూడదు అని వాదించాడు.

చివరకు కేసును పరిశీలించి జస్టిస్ పి.ఆర్. గోకులకృష్ణన్, జస్టిస్ పాల్ లు 1976 నవంబరులో తీర్పుఇచ్చారు. వైతీశ్వరన్, సారథి, లక్ష్మణన్, కన్నన్‌లకు మరణశిక్ష, మిగతావారికి యావజ్జీవ కారాగార శిక్ష విధించారు.

మద్రాసు హైకోర్టుతీర్పును సవాల్ చేస్తూ వైతీశ్వరన్ సుప్రీంకోర్టుకు అప్పీలు చేశాడు. వారు మరణశిక్ష బలపర్చలేదు. అమలుపర్చమని చెప్పలేదు. అలా వదిలేశారు. వైతీశ్వరన్, పార్థసారధి తప్ప మిగతా అంతా యావజ్జీవశిక్ష అనుభవిస్తున్నారు. వీరి మరణశిక్ష ఏమైందీ తెలీదు.

1970-72 మధ్యలో "విష ఊసి" కేసుగా (అంటే విషపు ఇంజక్షన్) ఇది మద్రాసు రాష్ట్రంలో తీవ్రసంచలనాన్ని తెచ్చింది. వెంటనే ఈ విషయం మద్రాసు పౌరులలో ఒక జ్ఞాపికగా మిగిలింది.

వేలాదిమంది ప్రేక్షకులు కోర్టుకివచ్చేవారు. పత్రికలు ప్రత్యేక వ్యాసాలు, ఫొటోలు ప్రచురించాయి. రేడియో విపరీతంగా కవర్ చేసింది.

ఎవరో ప్రొడ్యూసర్ ఈ సంఘటనను చిత్రంగా తీద్దామని ప్రయత్నించాడు కూడా. అయితే కొన్ని కారణాలవల్ల అది కొనసాగలేదు.

* * *

**1934** జనవరి 13వ తేదీ అర్థరాత్రి ఎగ్మోర్ స్టేషన్‌లో బుక్ అయిన ఆరు పార్శిళ్లూ క్షేమంగా కరుంగుళికి చేరాయి. అందులో అయిదుపార్శిళ్ళు ఎవరివి వాళ్లు తీసుకున్నారు. ఒకపార్శిల్ గురించి ఎవరూ రాలేదు.

అనుమానంతో పోలీసులకు రిపోర్ట్ చేశారు అధికారులు–ఆ పార్శిల్ దుర్వాసన వెయ్యడం మొదలు పెట్టేసరికి. పోలీసులు వచ్చి దానిని స్వాధీనపరుచుకుని, విప్పి ఆశ్చర్యంతో అదిరిపోయారు. అందులో ఒక అందమైన ఆడశవం ఉంది. అది అప్పుడే కుళ్లిపోతోంది.

ఫొటోలు తీశాక పోస్టుమార్టంకు పంపేరు. ఆమె ఊపిరిఆడక చనిపోయినట్టు రిపోర్టువచ్చింది. ఎవరో ఆమెను పీక పిసికి చంపారని నిర్ధారణ చేశారు.

పేపర్లలో ఆమె ఫొటోను వార్తతో పాటు ప్రచురించారు. పోలీసులు రంగంలోకి దిగారు.

బాగా లావుగా, అందవికారంగావున్న పార్థసారథి అనేవ్యక్తి వచ్చి "ఆమె నా భార్య. పేరు సీతమ్మాళ్. ఆమె గతసంవత్సరం ఆగస్టు నాలుగోతేదీని ఇంట్లో ఖరీదైన వస్తువులతో మాయమైంది. ఆ సంగతి పోలీసురిపోర్టు కూడా ఇచ్చాను. ఇప్పుడిలా ఎవరో ఆమెను హత్యచేశారు'' అని రిపోర్టుఇచ్చాడు.

పోలీసుల పరిశోధనలో చాలా విషయాలు వెలుగులోకి వచ్చాయి.

సీతమ్మాళ్ ప్రవర్తన ఏమీ మంచిది కాదు. వారు అద్దెకుఉండే ఇల్లు ఒక పెద్ద లోగిలి. అందులో చాలాకుటుంబాలు అద్దెకు ఉండేవి. భర్త ఎప్పుడూ స్థబ్దుగా, మన్ను తిన్నపాములా ఉంటూండడంవల్ల ఆమె ఆ లోగిలిలో చాలామంది మగాళ్ళతో సంబంధం ఏర్పరచుకుంది.

ఆ లోగిలిలో ఉండే వెంకటాచారికి దగ్గరబంధువు రామానుజం మద్రాసుకు దగ్గరగాఉండేసాలూరుగ్రామానికిమునసబు. స్త్రీలోలుడు. అతడితో సీతమ్మాళ్‌కి సంబంధం ఏర్పడింది. వాళ్ళ తిరుగుడుకి, సరసాలకి అంతులేకుండా ఉండేది. ఇది గ్రహించిన పార్థసారథి భార్యని గట్టిగా మందలించి చెయ్యిచేసుకున్నాడు. అదే రోజు రాత్రి అంటే 4–8–1933న సీతమ్మాళ్ ఇంట్లోఉండే వెండి వస్తువులు, బంగారునగలు అన్నీ తీసుకుని మాయమైంది. ఆతర్వాత కూడా ఆమె నిచ్చలవిడిగా మగాళ్ళతో తిరిగేదట.

పోలీసులు తమ పరిశోధన ఉధృతం చేసారు. ఎగ్మూర్ స్టేషన్‌లో పార్శెల్ గురించి వాకబుచెయ్యగా పార్శెల్‌క్లర్క్ తాతాచారి 'ఎవరో బాగా అందగాడిలా వున్నాడు. స్ఫురద్రూపి కూడా. అతనా పార్శెల్ కరుగంజ్‌కి బుక్‌చేశాడు. మా పోర్టర్ మునుస్వామి పార్శెల్ చాలా బరువుగావుందని అన్నాడు. అందులో ఇంటి వస్తువులు ఉన్నాయని అన్నాడు అతను. తోడుగా తీసుకెళ్ళే పార్శెల్‌గా బుక్‌చేస్తామని అన్నాం. అతనూ టిక్కెట్ కొనుక్కొచ్చాడు' అని సాక్ష్యం చెప్పాడు.

"ఈమె నాకు తెలుసు. మా ఇంట్లోనే వీళ్లు అద్దెకుఉండేవారు. ఈమె భర్తపేరు రామానుజం. మాఇల్లు పెద్దు నాయకన్ వీధిలో ఉంది. నెంబరు 24. అందులో వీళ్లిద్దరూ చాలా హాయిగానే ఉండేవారు. అయితేసీతమ్మాళ్ ప్రవర్తన చాలా అనుమానాస్పదంగా కనిపించేది. సాయంత్రం అయ్యేసరికి ఖరీదుగా సింగారించుకుని బయలుదేరేది. అది రామానుజానికి తెలుసేమో అనే అనుమానం కూడా కలిగేది. 11 జనవరి సాయంత్రం ఆరుగంటలకి ఆమె సింగారించుకుని బయటకు వెళ్ళడం నేను చూశాను" అంటూ ఇంటి యజమాని సాక్ష్యంఇచ్చాడు పోలీసులకు.

వెంటనే రామానుజాన్ని అరెస్టుచేసి న్యాయస్థానానికి తీసుకు వచ్చారు.




అతనితరఫున ఆనాటి ప్రముఖన్యాయవాది నరసింహాచారి వాదించారు.

ఇంగ్లండ్‌కుచెందిన మద్రాసు హైకోర్టు చీఫ్‌జస్టిస్ సర్ ఓవెన్ బోస్‌లే ఈ కేసుని చాలా ఆసక్తిగా పరిశీలించాడు.

"ఆమె నా భార్యకాదు. నన్ను కావాలని నాతో వచ్చేసింది. ఆమె అంటే నాకు పిచ్చి ప్రాణం. ఆమె భర్త పార్థసారథే. అయితే మేం భార్యాభర్తలకన్న ఎంతో అన్యోన్యంగా వుండేవాళ్ళం. ఆమెను ప్రేమించి చేజేతులా చంపేంత రాక్షసుణ్ని కాను నేను. ఆమె పోయిన దుఃఖంలో నేను కుంగిపోయి వున్నాను" అన్నాడు రామానుజం.

"నావద్ద పార్శెల్ చేసిన చాపకొన్నది ఇతనే" అంటూ రామానుజాన్ని చూపించాడు భాసిం అనే అమ్మకందారు. "ఆ చాప నా చేత తన ఇంటి వరకూ మోయించాడు. మూడు రూపాయలు అడిగితే రెండున్నర ఇచ్చాడు" అంటూ సాక్ష్యం చెప్పింది తాయమ్మాళ్ అనే కూలీ మనిషి.

రైల్వేపోర్టరు క్లర్కు వీళ్లు కూడా రామానుజాన్ని గుర్తుపట్టారు. ఇంత మంది ఇన్ని రకాలుగా సాక్ష్యాధారాలు ఇస్తున్నా ఆనాటి ప్రముఖులు, రామానుజానికి సన్నిహితులు అందరూ అతను అలాంటివాడు కాదని, చాలా సున్నిత హృదయుడని అర్జీలు పంపేరు. ఎక్కడో ఏదో లోపం ఉందని మనవి చేశారు.

"ఇతను శోత్రియమైన బ్రాహ్మణుడు. వీరికి పిలక ఒక ఆచారం. ఆ పిలకను ఇతను ఈమధ్యనే తీయించేసి క్రాఫ్ కూడా మార్చేశాడు. ఇదంతా తన రూపురేఖల్ని మార్చే వుద్దేశంతో చేసినవే" అంటూ ప్రభుత్వం తరపు వకీలు వాదించాడు. ఇన్ని సాక్ష్యాధారాలు వున్న ఈ హత్యకేసు బ్రిటిష్ న్యాయాధిపతిని ఎంతో తికమక పెట్టింది.

పదకొండు మంది జడ్జీల బెంచ్‌తో చర్చించి, చివరకు రామానుజానికి మరణ శిక్ష విధించాడు జస్టిస్ ఓవెన్ బోస్‌లీ. అయితే రామానుజం తన మిత్రుల సహకారంతో అడ్వొకేట్ జనరల్‌కు మనవి చేసుకొన్నాడు. వారు ఏడుగురు జడ్జీల బెంచ్‌తో చర్చించి, మరణ శిక్షను ఖాయం చేశారు.

అయినా వూరుకోలేదు రామానుజం. అతని మిత్రులు ఇంగ్లండ్‌లో వున్న ప్రీవీకౌన్సిల్‌కు అప్పీలు చేశారు. అక్కడి నుంచి కూడా మరణశిక్ష అమలు జరపవలసిందిగా అర్డరు వచ్చింది.

ఇంకా పట్టు వదలకుండా గవర్నర్ జనరల్ ఆఫ్ ఇండియాకు తిరిగి మొర పెట్టుకున్నారు రామానుజం, అతని మిత్ర బృందమూ.

అదృష్టవశాత్తూ గవర్నర్ జనరల్ మరణ శిక్షను యావజ్జీవిత ఖైదుగా తగ్గించాడు.

సాక్ష్యాధారాలలో ఎక్కడో లోపం వుందని, ఎట్టి పరిస్థితిలోనూ రామానుజం హత్య చేసే తత్వం కలవాడు కాదని, ఎవరో ఈ నేరం చేసి రామానుజానికి తీరని అపకారం చేసారని అతని ధనవంతులైన మిత్రులు గట్టిగా నమ్మేరు. ఇంతకీ నిజానిజాలు ఎవరికీ తెలియలేదు. అయితే రామానుజం తన ప్రేయసి, చపల చిత్త అయిన సీతమ్మాళ్‌ను ఈ స్నేహ బృందానికంతకూ అమర్చి పెట్టేవాడని, ఆ కృతజ్ఞతతోనే వాళ్ళంతా అలా అతని పక్షంలో మాట్లాడుతున్నారని కొందరు అనుకోక పోలేదు.

— రాండార్ గై

# పై చతుర

జీవితాన్ని సరదాగా గడపాలన్నది, ఎంజాయ్ చేయాలన్నది రాజావెంకట బహదూర్‌గారి ఆశయం. ఆ ఆశయానికి తగ్గట్టు అతనిక్కొన్ని బిల్డింగులు,వ్యాపార సంస్థలు, చేతినిండా డబ్బు, ఇంటినిండా నగలూ వున్నాయి.

అతను స్కాచ్ విస్కీ తాగుతాడు.

డన్‌హిల్ సిగరెట్స్ కాలుస్తాడు.

రేస్‌కోర్సులో లక్షలకి లక్షలు తగలేస్తాడు.

[illegible] అమ్మాయిల వెంటపడి వేలకివేలు ఖర్చుచేస్తాడు.

ఇవన్నీ 'హేపీలైఫ్' లక్షణాలంటాడు శ్రీమతితో అయితే ఆ శ్రీమతిగారు వీటిని వేటినీ భరించదుగాక భరించదు. స్కాచ్ విస్కీ తాగినవాడు, డన్‌హిల్ సిగరెట్స్ కాల్చినవాడు, రేసుకోర్సులకీ, అమ్మాయిలకీ డబ్బు తగలేసినవాడు మంచివాడు కాదంటుంది; జీవితంలో ఎదగడంటుంది. పైగా ఇవన్నీ లక్షాధికారులకి ఉండవలసిన లక్షణాలు కావంటుంది.

ఈ పాయింటు దగ్గరే-రాజా వెంకట బహదూర్ గారికీ, శ్రీమతికీ ఫటాఫట్ ఫైటింగ్‌సీన్స్ తరుచూ జరుగుతుంటాయి. ఆవిడ అంచనాలు తప్పంటాడాయన. కాదంటుంది ఆమె. నిరూపిస్తానంటూ ఆరోజు అతగాడు సిద్ధంగా ఉన్నాడు.

రేస్‌కోర్సులో ఓ పాతిక వేలకి పైగా తగలేసుకొని అప్పుడే బయటికొస్తున్న అతన్ని అటకాయించినట్టుగా నిలబడి ఓ ముష్టివాడు-

"బాబూ! ఆకలేస్తోందయ్యా! ఓ పది పైసలు పడేయండి" అని అర్థించాడు.

బహదూర్ వాణ్ని తేరిపార చూసి-




"పది పైసలేం ఖర్మ! ఇంకా ఎక్కువే ఇస్తాను. నాతోపాటు బార్‌కొచ్చి స్కాచ్ విస్కీ తాగుతావా?" అనడిగాడు.

"లేదు బాబూ! నాకటువంటి అలవాటు లేదు"

"పోనీ! ఈ డన్‌హిల్ సిగరెట్ కాల్చు. నువ్వు అడిగినదానికన్నా ఎక్కువపైసలే ఇస్తాను"




## కతలు

"వద్దండి! సిగరెట్స్ కాల్చే దుర్గుణం లేదు"

"సరే అయితే! ఓ మాంచిఅమ్మాయిని



నీకివ్వాళ చూపిస్తాను. ఆవిడే తిండి పెడుతుంది. పైగా నీతో పడకనికూడా పంచుకొంటుంది. వస్తావా?"

"వద్దు బాబూ! అటువంటి మాటలు నేను వినలేను"

"చూడు! పదిపైసలు సువ్వడిగావు! నేన్నీకు పది పదులు వంద రూపాయలు ఇస్తాను. రేస్‌కోర్స్‌కొచ్చి పందెంకాస్తావా? తొందరపడకు! ఆ తర్వాత ఓడిపోతే నువ్వడిగిన పదిపైసలూ నీకిస్తాను"

"ఛ ఛ! నాకటువంటి దుర్బుద్ధులు లేవండి! దయచేసి నాకు పదిపైసలివ్వండి అంతేచాలు" అని ప్రార్థించాడు ముష్టివాడు. దాంతో బహదూర్‌గారి పెదవులు చిద్విలాసంగా తెరుచుకొని చిన్నగా నవ్వుకొన్నాయి.

"సరే! ఓ పనిచెయ్యి! నాతో మా ఇంటికి రా! నీకు పదిరూపాయలిస్తాను"

"ఎందుకండి?" అమాయకంగా ప్రశ్నించాడు ముష్టివాడు.

"మరేంలేదు! నిన్ను మా ఆవిడకి చూపించాలి. ఆవిడ దృష్టిలో రేస్‌కోర్సు, మందు, పిల్ల, సిగరెట్ అలవాట్లాంటివేవీ లక్షాధికారులు అలవర్చుకోకూడదట! అవి లేనివాళ్లు ఏమవుతారో నిన్ను చూసి ఆవిడ తెలుసుకొంటుంది. అందుకు" అన్నాడా రాజా వెంకటబహదూర్.

— శర్మ

## నిజాయితీ

నాయుడుగారు తనింటి ముందు వాలు కుర్చీలో కూర్చుని చుట్ట కాలుస్తూ గత వైభవాన్ని తలుచుకుంటున్నారు. ఆయన తన జిల్లాని దాదాపు ముప్ఫయి ఏళ్లు మకుటంలేని మహారాజులా పాలించి మొన్న అసెంబ్లీ ఎన్నికల్లో ఘోరంగా ఓ ఆడదాని చేతిలో ఓడిపోయారు. అప్పట్నించీ ఆయన పచ్చి మంచినీళ్లైనా ముట్టడం లేదు. కేవలం 'మందు' మీదే కాలక్షేపం చేస్తున్నారు. ఆయన ఏకాంతాన్ని భంగపరుస్తూ ఓ చిన్న దగ్గు వినిపించింది.

ఎదురుగా ఎల్లారావు నిల్చున్నాడు. ఎల్లారావు ఓ సర్పంచ్. మొన్న ఎన్నికల్లో ఆ గ్రామస్థులకు పంచమని అతనికి ఓ పాతికవేలు ఇచ్చారు నాయుడుగారు.

"తమర్ని ఈ పరిస్థితిలో..." అని ఏదో అనబోయాడు ఎల్లారావు.

"ఎల్లారావ్! ఆ సానుభూతి మాటలు మరి నేను వినలేను. దయచేసి అవి కట్టిపెట్టి, నువ్వేపనిమీద వచ్చావో చెప్పు" అని కోపం నిండిన గొంతుతో అరిచారు నాయుడుగారు.

"మరేం లేదు బాబుగారూ! మొన్న మీరిచ్చిన పాతిక వేలలో సగం మా గ్రామ ప్రజల్లో కొందరు తీసుకోలేదు. అందుకే ఆ డబ్బు తిరిగి తీసుకొచ్చాను. మా ప్రజలందరూ అవతలి పార్టీవోడికే ఓట్లు వేశారు. ఈసారి ప్రజలు బాగా తెలివిమీరిపోయారండి! తీసుకోండి ఈ డబ్బు" అంటూ సంచిలోని ఓ కవరు తీసి అందించాడు ఎల్లారావు.

నాయుడుగారి ఆశ్చర్యానికి అవధుల్లేవు! గబుక్కున కుర్చీలోంచి లేచి ఎల్లారావు చేతులు పట్టుకున్నారు.

"ఎల్లారావ్! ఈ రోజుల్లో కూడా నీలాంటి నిజాయితీ పరులున్నారంటే నమ్మబుద్ధి కావడంలేదు. నీలాంటి మిత్రుడున్నందుకు నాకు చాలా ఆనందంగా ఉంది" అన్నారు ఆవేశంగా నాయుడుగారు. మరికొంత సేపు ప్రశంసలు, మందు, విందు అయిన తరువాత ఎల్లారావు అక్కడనుండి వెళ్లిపోయాడు. నాయుడుగారు తాను అసెంబ్లీ ఎన్నికల్లో ఓడిపోయినా 'జిల్లాపరిషత్ ఛైర్మన్'గా మిగిలి ఉన్నాననీ, ఎల్లారావు 'కాంట్రాక్ట్ బిల్సు' సుమారు రెండు లక్షలు జిల్లా పరిషత్ నుండి విడుదల కావాల్సి ఉన్నాయనీ మర్చిపోయారా క్షణంలో.

—కిల్లాన మోహన్‌బాబు




# మహా మగాడు

పుల్లయ్యకు పెళ్ళాంమీద ఎక్కడలేని విసుగుపుట్టుకొచ్చింది. 'దీని మొహం చూడాలంటే మహాచెడ్డ బోరుగా వుంది.... ఇహలాభంలేదు రెండోపెళ్లి చేసుకోవలసిందే' అనుకున్నాడు. ఆ ఆలోచనవచ్చిన వెంటనే జానెడు బారుమీసాలను రసిక చక్రవర్తిలా మెలేశాడు. వెంటనేలేచి గ్రామ పెద్ద ఇంటికెళ్లి సాయంత్రం 'పంచాయతి' అన్నాడు. గ్రామపెద్ద సరేనని ఇతర పెద్దలందరికీ కబురుపంపాడు.

సాయం సంధ్యవేళ అందరూ రచ్చ బండదగ్గర బైఠాయించారు. పుల్లయ్య భార్యను వెంటపెట్టుకునివచ్చి పెద్దలతో అన్నాడు - "దీన్ని నేను ఎంతగానో నమ్మాను. నాకోమగపిల్లవాడ్ని కంటుంది, వంశం నిలబెడుతుందని ఎంతగానో ఆశించాను. కానీ నా ఆశ నిరాశగా మారిపోయింది. ఇది నాలుగుసార్లు నలుగురూ ఆడపిల్లల్నే కన్నది. నాకు కొడుకు కావాలి. అంచేత నేను దీనికి విడాకులిచ్చి ఇంకో పెళ్ళి చేసుకుందామనుకుంటున్నాను" అన్నాడు.

గ్రామపెద్దలు ఇరకాటంలో పడిపోయారు. ఏంచెప్పాలో ఎవరికీ తోచటం లేదు. పెద్ద గడ్డుసమస్య అయిపోయిందే అనుకుంటూ వుండగా అంతా విన్న పుల్లయ్య భార్యకు వళ్లుమండిపోయి చటుక్కున లేచినిలబడింది. రెండుచేతులూ ఎగతాళిగా ఊపుతూ అంది- "ఆడదని మరీ అంత బజారుకీడుస్తారా! అయినా ఈయన్ను నమ్ముకునుంటే నాకు మగపిల్లల సంగతలావుంచి కనీసం ఒక్క ఆడపిల్లయినా పుట్టేదేనా?" అంది ఆగ్రహంతో.

-పథిక్

FORM IV [See Rule 8]

Statement about ownership and other particulars of CHATURA

| | | |
|---|---|---|
| 1. Place of Publication | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 004. |
| 2. Periodicity of its Publication | : | Monthly |
| 3. Printer's Name | : | RAMOJI RAO |
| Whether citizen of India? | : | Yes |
| If Foreigner, state the country of origin | : | —— |
| Address | : | 6-3-570, Eenadu Compound Somajiguda, Hyderabad-500 004. |
| 4. Publisher's Name | : | RAMOJI RAO |
| Whether citizen of India? | : | Yes |
| If foreigner, state the country of origin | : | —— |
| Address | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 004. |
| 5. Editor's Name | : | RAMOJI RAO |
| Whether citizen of India? | : | Yes |
| If foreigner, state the country of origin | : | —— |
| Address | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 004. |
| 6. Names and addresses of Individuals who own the news paper and partners or share holders holding more than one percent of the total capital. | : | VASUNDHARAPUBLICATIONS 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 004. |

I, RAMOJI RAO, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

for VASUNDHARA PUBLICATIONS.

Date : March 1, 1983.

Sd/- RAMOJI RAO
Publisher.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications
Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthl
Eenadu Compound, Hyderabad - 500 004.

పార్లే

నేను పెద్దయ్యాక కారులో
బేంకుకి వెళతాను, డబ్బు
తెచ్చుకుంటాను, దుకాణాల్లోని
బిస్కట్లన్నీ కొనేస్తాను...!






పిల్లలు ప్రేమించేది పార్లే గ్లూకో-
మరింత రుచికరమైన, శక్తినిచ్చే ఆహారం.



# పార్లే
# గ్లూకో

భారతదేశంలో అత్యధికంగా అమ్మబడే బిస్కట్

